జూన్ 2015

జ్యేష్ఠ-ఆషాఢ | శాలివాహన శకం 1937 ₹ 5



# ఆంధ్రప్రదేశ్




అనాథలా వదిలేసిన
రాష్ట్రానికి తన నాయకత్వ
పటిమతో ఏడాదిలో దశ, దిశ
నిర్దేశం చేసిన ముఖ్యమంత్రి

# సాకారమవుతున్న స్వర్ణాంధ్ర స్వప్నం




# కలలకు రెక్కలొస్తున్న వేళ..

కలలుగంటున్న రాజధాని వాస్తవరూపం ధరిస్తోంది. అనుకున్నది అనుకున్నట్టు సాధించగల ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నాయకత్వంలో, ప్రపంచ స్థాయి రాజధానిగా అమరావతి మహా నగర నిర్మాణానికి తొలి అడుగు పడింది. రాజధాని మాస్టర్‌ప్లాన్‌ను సింగపూర్ మంత్రి ఈశ్వరన్ స్వహస్తాలతో సచివాలయంలో మే నెల 25న అందిస్తున్న చారిత్రక దృశ్యమిది.

# ఈ సంచికలో...



8

అతడు అడవిని జయించాడు!

మొండెంలా మిగిలిన అవశేష ఆంధ్రప్రదేశ్ కి ఏడాదిలోనే కొత్త చివురులు పూయించిన ధీరోదాత్తుడు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు





18

కోనసీమ ఇక కొత్త బంగారు లోకం!



30

అజరామరం అమరావతి







62

సంస్కృతి: ఏకత్వ భిన్నత్వం గంగమ్మ బహుముఖం!

ఆంధ్రప్రదేశ్
తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ప్రచురితం

సంపుటి 58 సంచిక 11
శాలివాహన శకం 1937 జ్యేష్ఠ – ఆషాఢ

**కమిషనర్ పబ్లిషర్**
ఎన్ వి రమణారెడ్డి, ఐఆర్‌పిఎస్

**ప్రధాన సంపాదకుడు**
కందుల రమేష్

**సంపాదకుడు**
నున్నా నరేష్

**సహ సంపాదకులు**
నీరుకొండ ప్రసాద్
జాస్తి గోపాల ప్రసాద్

ముఖచిత్రం
ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు

రెండవ కవర్
రాజధాని మాస్టర్‌ప్లాన్‌ని అందుకుంటున్న ముఖ్యమంత్రి

మూడవ కవర్
వివిధ కార్యక్రమాల్లో ముఖ్యమంత్రి

నాల్గవ కవర్
నీరు–చెట్టు ప్రకటన

**ప్రచురణ**
సమాచార, పౌరసంబంధాల శాఖ
సమాచార భవన్, ఎ.సి.గార్డ్స్
హైదరాబాద్ – 500 028
ఫోన్: 040 – 23300258

రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి చెందినవి కానక్కర లేదు.

**రూపకల్పన**
సాయి

**ముద్రణ**
కాక్స్‌టన్ ఆఫ్ సెట్ ప్రైవేట్ లిమిటెడ్
హైదరాబాద్

www.apchiefeditor@gmail.com
www.ipr.ap.nic.in





# నవ నిర్మాణం వైపు తొలి అడుగు

రాష్ట్ర ఆవిర్భావాన్ని కూడా మనస్ఫూర్తిగా, సంతోష సంబరాలతో జరుపుకోలేని దుస్థితి ఇవాళ తొలి భాషాప్రయుక్త రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్‌ది. మంచీచెడూ లేకుండా, ముందూవెనుకా చూసుకోకుండా, తుచ్ఛ రాజకీయ ప్రయోజనాల కోసం ముక్కలు చేస్తే, అవశేషంగా మిగిలిన ప్రాంతమిది. కోల్పోయిన ఉనికిని పొందడానికి, కొత్త అస్తిత్వాన్ని అందిపుచ్చుకోవడానికి చేస్తున్న పోరాటంలో ఏడాది గడిచింది. ఆవేదన, ఆక్రోశం, ఆగ్రహం, ఆవాహనం ముప్పిరిగొంటున్న ఈ క్షణాలని ఎలా చూడాలి?

అందుకే రాష్ట్ర విభజన తేదీ జూన్ 2న నవనిర్మాణ దీక్ష కార్యక్రమం రాష్ట్రమంతటా జరపాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నిర్ణయించారు. అవును, ఇప్పుడు చేసుకోవాల్సింది సంబరాలు కాదు; ఇవాళ చేపట్టాల్సింది సంకల్ప దీక్ష. కఠోర వాస్తవాలను మరోసారి మననం చేసుకొని, జరిగిన అన్యాయాన్ని తలచుకొని, కష్టనష్టాలను ఎదుర్కొని, మరో ప్రపంచాన్ని నిర్మించుకోడానికి సంసిద్ధులు కావాల్సిన సమయమిది.

రాష్ట్ర ఆవిర్భావం రోజున చేపట్టే దీక్ష వేడుక కాదని, రాష్ట్రాభివృద్ధికి అందరూ కసిగా, కలిసి కట్టుగా కదిలేందుకు పూనిన చైతన్య దీక్ష అని ముఖ్యమంత్రి వివరించింది అందుకే. రాష్ట్ర విభజన చరిత్ర భావి తెలుగు పౌరులకు తెలియాల్సిన అవసరం ఉందని, ఈ నవనిర్మాణ దీక్ష కార్యక్రమంలో విద్యార్థులు, ఉపాధ్యాయులు పాల్గొనాలని ఆయన కోరారు. నవనిర్మాణ దీక్ష ప్రభుత్వ కార్యక్రమం మాత్రమే కాదు, ఇది 13 జిల్లాల ప్రజల మనోభీష్టం.

విభజన వల్ల ప్రజలు గుండె కోతకు గురైవున్నారు. అభివృద్ధి చేసుకోవాలన్న తపన వారిలో ఉంది. సంక్షోభంలో ఉన్న రాష్ట్రాన్ని శర వేగంగా ప్రగతి పథంలో నిలబెట్టాలన్న సంకల్పంతో కసిగా, కలిసి కట్టుగా కదిలేందుకు జన చైతన్య దీక్ష ఒక ఆమంత్రణం. చరిత్రను మననం చేసుకుంటూనే, జరిగిన అనైతికాన్ని ప్రశ్నిస్తూనే, కోట్లాది ప్రజల కంటున్న కొత్త బంగారు కలను సాకారం చేయగల సమర్థ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పట్టిన పూనిక ఈ నవ నిర్మాణ దీక్ష. జనమంతా ఏకమై చేస్తున్న భీష్మ ప్రతిజ్ఞ.

కందుల రమేష్

**కందుల రమేష్**
చీఫ్ ఎడిటర్



# ఎలా కొలవగలం ?

చాలా సులభమైన విషయం ఏమిటంటే - వ్యాఖ్యానించడం. నేను ఈమధ్య తరచూ ఒక పోలిక వింటున్నాను. గత ఏడాది కాలంలో "ఆంధ్రప్రదేశ్‌లో ఏం జరిగిందీ" అంటూ వ్యాఖ్యానాలు చేస్తున్నారు. పత్రికల్లో రాస్తున్నారు. రాసేవాళ్ళు వ్యాఖ్యానాలు విని రాస్తున్నారో, చేసే వాళ్ళు పత్రికల్లో చదివి చేస్తున్నారో తెలీదు కానీ, ఒకే రకమైన విశ్లేషణలు కొంచెం తేడాతో వినిపిస్తున్నాయి. బహుశా ఏడాది పాలన పూర్తవుతున్న సందర్భంగా ఈ రెండు రాష్ట్రాలలో సంబరాలకు ఏర్పాట్లు జరుగుతున్నాయన్న వార్తలు ఇలాంటి పరిశీలకులకి ఈ ప్రేరణ ఇచ్చి వుండవచ్చు.

అవిభక్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం 2014 జూన్ 1తో అంతర్ధానమై, జూన్ 2న రెండు రాష్ట్రాలుగా అవతరించింది. రెండు రాష్ట్రాలకూ రెండు వేర్వేరు రాజకీయ పార్టీలకు చెందిన నేతల సారథ్యంలో ప్రజాస్వామిక ప్రభుత్వాలు ఏర్పాటయ్యాయి.

గత ఏడాది కాలంలో ఏం జరిగింది - అన్న చర్చ మీడియాలో కనపడటం సహజం. పత్రికల్లో వ్యాసాలూ, టెలివిజన్‌లలో విశ్లేషణలూ ఇవే.. కాని, 'ఏ రాష్ట్రంలో ఏం జరిగింది' విడివిడిగా చూడటం కాక ఈ రెండు రాష్ట్రాలనూ పోల్చి ఎందుకు చూడాలి- అన్నది నాకు అర్థం కాదు.

రెండూ అవిభక్త ఆంధ్రప్రదేశ్ నుంచి ఉద్భవించిన రాష్ట్రాలే అయినప్పటికి అభివృద్ధి దిశగా రెండూ ఒకే రకమైన శక్తితో ఉద్భవించినవి అయి ఉంటేనే కదా! రెండింటి మధ్య పోలిక చూడటం సమర్థనీయమవుతుంది.

వాణిజ్య రంగంలోనూ, క్రీడా రంగంలోనూ ఒకే పదాన్ని బాగా వింటుంటాం - Level Playing Field అంటే, రెండు సంస్థలు లేదా వ్యవస్థల మధ్య పోటీ ఉండాలంటే రెండూ సమఉజ్జీలై ఉండాలి. వనరుల పరంగా, శక్తి సామర్థ్యాల పరంగా ఒకరితో ఒకరు పోటీ పడగల వాతావరణం ఉండాలి. అలా లేని సంస్థల పురోగతి మధ్య పోలిక చూడటం ఏలా సమంజసమవుతుంది?

2014 జూన్ 2 న రెండు రాష్ట్రాల ఆవిర్భావం తరువాత పరిస్థితి ఎలాంటిది? ఆర్థిక వనరులు, ఉన్నత విద్యా సంస్థలు, విస్తృత మౌలిక సదుపాయాలతో కూడిన రాజధాని, పారిశ్రామిక ప్రగతికి అవసరమైన అంతర్జాతీయ విమానాశ్రయం, రైల్వే వంటి మౌలిక సదుపాయాలు, కొత్త పెట్టుబడులను సులువుగా ఆకర్షించడానికి అవసరమైన ప్రత్యేక రాయితీల వ్యవస్థ...ఇలాంటివి ఏవి లేకుండా పుట్టిన నవ్యాంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రగతిని అన్ని విధాల అభివృద్ధి కనిపిస్తున్న నేపథ్యం ఉన్న తెలంగాణా రాష్ట్ర ప్రగతితో పోల్చి చూడటం ఎలా సమర్థనీయం? విశ్లేషకులు ఈ అంశాన్ని ఎలా విస్మరించగలరు?

నిజానికి నవ్యాంధ్రప్రదేశ్‌లో చంద్రబాబు నాయుడు గారి సారథ్యంలో ఏర్పడిన ప్రభుత్వం గత 12 మాసాలలో పనిచేసిన తీరుని విశ్లేషించినప్పుడు మనకి చాలా కొత్త అంశాలు కనిపిస్తాయి.

హిమాచలప్రదేశ్ బియాస్ నదిలో జరిగిన ప్రమాదంలో మరణించిన మన ఇంజనీరింగ్ విద్యార్థుల దేహాల్ని రప్పించి, వాళ్ళ కుటుంబాలకు ఉపశమనం చేకూర్చడంలో కాని, తమిళనాడులో జరిగిన రెండు భవన ప్రమాదాల్లో మరణించిన / గాయపడిన తెలుగువారి కుటుంబాలకు సహాయం అందించటంలో కాని, హుద్ హుద్ తుఫాన్‌కి పూర్తిగా జీవచ్ఛవంలా మారిన విశాఖ నగరానికి యుద్ధప్రాతిపదికన తిరిగి ప్రాణం పోయటం గాని, రైతులకు వాగ్దానం చేసిన విధంగా రుణాలు మాఫీ చేయడంలో గాని, మహిళ స్వయం సహాయక సంస్థలకు ఇసుక రీచ్‌ల వ్యాపారాన్ని అప్పగించి వాళ్ళని మరింత శక్తిమంతులను చేయటంలో గాని నీరు - చెట్టు పథకంతో రాష్ట్రాన్ని హరిత వనంలా చేయడానికి విప్లవాత్మక కార్యక్రమాన్ని అమలు చేయడంలో గాని, రాజధాని నిర్మాణానికి రైతులను ఒప్పించి, స్వచ్ఛందంగా భూములు ఇచ్చేలా చేయడంలో గాని సింగపూర్, జపాన్, చైనా, అమెరికా దేశాల నుంచి పెట్టుబడులు పెట్టగల పారిశ్రామిక సంస్థలను ఆకర్షించడంలో గాని...ఇలాంటి అనేక అంశాలలో (కామన్ ఎంట్రన్స్ పరీక్షల వివాదం, జల పంపిణీ వివాదం, విద్యుత్ వివాదం, రవాణా వాహనాల పన్ను వివాదం వంటి అనేక ప్రతికూల పరిస్థితుల్ని అధిగమిస్తూ కూడా) గత 12 మాసాలలో ఈ ప్రభుత్వం సాధించిన పురోగతిని Level Playing Field లేని చోట ఏ సారూప్య కొలబద్ద (scale of comparison)తో కొలవగలం?

ఎన్. వి. రమణారెడ్డి

**ఎన్ వి రమణారెడ్డి**

సమాచార కమిషనర్



మే నెల ఆంధ్రప్రదేశ్ పత్రిక ముఖ్యమంత్రి ముఖచిత్రంతో అబ్బురమనిపించింది. చంద్రబాబు ముఖచిత్రాల్లో ఇది హైలెట్. అలాగే ఈ నెల నామిని కథకి మోహన్ గారి బొమ్మ అద్భుతం. కథ కూడా బాగుంది.

– తోట రాజ్యలక్ష్మి, చెరుకుపల్లి.

మే నెల ఆంధ్రప్రదేశ్ పత్రిక పాత కొత్తల మేలుకలయిక. పత్రికలో వచ్చిన ఈ మార్పుకి పరవశించని పాఠకుడు ఉండడంటే అతిశయోక్తి కాదు. ఇంతకు ముందు లేని విధంగా మెరుగైన పేపర్ వాడారు. శీర్షికలు కూడా అపూర్వంగా ఉన్నాయి. ఒంటిమిట్ట శ్రీరాముడుకి కూడా భద్రాచల రాముడికి వలెనే అపారమైన సాహిత్య సంపద ఉందని చెప్పకనే చెప్పారు. ఒంటిమిట్టను సందర్శించుకున్న తర్వాత మహావాగ్గేయకారుడు అన్నమయ్య రచించిన కీర్తనని ప్రచురించడం సందర్భోచితం.

– షేక్ కరిముల్లా, పొన్నూరు.

ఆంధ్రప్రదేశ్ మే నెల పత్రిక ద్వారా మాకు తెలియని ఎన్నో విషయాలు తెలుసుకున్నాము. గత 40 ఏళ్లుగా ఆంధ్రప్రదేశ్ చదువుతున్నాను. లక్షలాది మంది అభిమానులున్న ఆంధ్రప్రదేశ్ క్రమేణా ఆదరణ కోల్పోయింది. కానీ, మే నెల సంచిక చూస్తే, పత్రికకు పునర్వైభవం రానున్న సూచనలున్నాయి. ఇది శుభ పరిమాణం. తేలికపాటి క్విజ్, పద ప్రహేళిక ప్రవేశపెట్టండి.

– రామసూరి, మోతీనగర్, హైదరాబాద్.

వృద్ధ కళాకారులకు ఇచ్చే పెన్షన్ రూ. 1500కి పెంచడం సంతోషంగా ఉంది. కానీ, ఈ పెన్షన్ నెలనెలా సక్రమంగా అందక మాబోటి వృద్ధ కళాకారులు నిరాశ, నిస్పృహలకు గురవుతున్నారు. మా అభిమాన పత్రిక ఆంధ్రప్రదేశ్ ద్వారా మా సమస్యను సంబంధిత అధికారుల దృష్టికి తీసుకుపోదల్చాము. ఇటువంటి ప్రజాసమస్యల మీద కూడా ఆంధ్ర ప్రదేశ్ పత్రికలో కథనాలు రావాలని కోరుకుంటూ,

– తూర్పుగోదావరి జిల్లా వృద్ధకళాకారుల సంఘం, కాకినాడ

సోమిరెడ్డి జమున స్మారక రాష్ట్ర స్థాయి అవార్డుకు గాను, నానీల సంపుటిలకు, నవలలకు ఆహ్వానం:

2008 నుంచి ప్రతి ఏడాది ఇస్తున్న రచయిత్రి స్వర్గీయ సోమిరెడ్డి జమున స్మారక రాష్ట్ర స్థాయి అవార్డు కోసం ఈ ఏడాది కూడా 2013–14లో ప్రచురింపబడిన డైరెక్ట్ నవలలను, నానీల సంపుటిలను ఆహ్వానిస్తున్నారు డా. పెళ్లకూరు (సోమిరెడ్డి) జయప్రద.

గతంలో బహుమతి వచ్చిన రచనలు ఈ పోటీకి అర్హం కావు. కవరు మీద నవలల పోటీకి, లేదా నానీ సంపుటుల పోటీకీ అని స్పష్టంగా రాయాల్సి ఉంటుంది. ఎంట్రీలు జూలై 30, 2015 లోపు అందేలా పంపాలి. ఉత్తమ నవలకు రూ. 10,000, నానీల సంపుటికి రూ 5,000 నగదు బహుమతులు ఉంటాయి.

రచనలు పంపవల్సిన చిరునామా:

డా. సోమిరెడ్డి జయప్రద, వంశీ నర్సింగ్ హోం, ఇందిరాభవన్ రోడ్డు, నెల్లూరు– 524 003

ఫో: 98486 27158, 94402 79596

### రచయితలకు గమనిక

' ఆంధ్రప్రదేశ్' పత్రికపై అభిమానంతో రచనలను పంపుతున్న రచయితలు రచనతోపాటు తమ బ్యాంకు అకౌంట్ పాస్ బుక్ మొదటి పేజీ ఫోటో కాపీ గానీ, బ్లాంక్ చెక్కు కొట్టేసి పంపితేనే, ప్రచురితమైన రచనలు పారితోషికం ఆయా అకౌంట్ లో జమ చేయడం జరుగుతుందని అకౌంట్స్ అధికారి తెలియజేస్తున్నారు. రచయితలూ, రచయిత్రులు దీని ప్రాధాన్యత గ్రహించి, మాతో సహకరించవలసిందిగా కోరుకుంటున్నాం.

– సంపాదకులు

### 'ఆంధ్రప్రదేశ్' పత్రికకు చందా ఇలా కట్టాలి

'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికకు చందాదారులుగా చేరాలనుకుంటున్న వారు వార్షిక చందా నిమిత్తం 50 రూపాయల మనియార్డరును 'అకౌంట్స్ ఆఫీసర్, సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్' పేరిట పంపాలి. తమ పూర్తి చిరునామాను, తాము 'ఆంధ్రప్రదేశ్ ' పత్రికను ఏ భాషలో కోరుకుంటున్నారో కూడా ఆ మనియార్డరులో రాయాలి. ఆ మనియార్డర్‌ను ఈ క్రింది చిరునామాకు పంపాలి.

అకౌంట్స్ ఆఫీసర్, సమాచార, పౌర సంబంధాల శాఖ, సమాచార భవన్, ఏ.సి.గార్డ్స్, మాసాబ్ ట్యాంక్, హైదరాబాద్ – 500 028.

ఆంధ్రప్రదేశ్ మే నెల సంచిక మా కుటుంబ సభ్యుల్నీ, మా స్నేహితుల్నీ ఆశ్చర్యానందాల్లో ముంచెత్తింది. మరీ అంతలా శీర్షికలు ఒక దానితో ఒకటి పోటీ పడి అలరించాయి. ఇక ముందు కూడా ఇదే పద్ధతి కొనసాగించండి. సరదా శీర్షిక అయిన చక్కిలిగీత బాగుంది. ఓ చక్కని పౌరాణిక సీరియల్ కూడా వేయండి.

– ఎం ఎస్ బి పి ఎన్ వి రమాసుందరి, భీమవరం.




గోదావరి మహా పుష్కరాలను అత్యంత వైభవంగా జరిపేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాట్లు చేస్తున్న శుభసందర్భాన్ని పురస్కరించుకొని, జూలై మాస ఆంధ్రప్రదేశ్ పత్రికను పుష్కరాల ప్రత్యేక సంచికగా వెలువరిస్తున్నాం. మీ కాపీని ఇప్పుడే బుక్ చేసుకోండి.

# వేదంలా ఘోషించే గోదావరి

ఫోటో: టి శ్రీనివాస రెడ్డి






గోదావరి మహాపుష్కరాలకు రంగం సిద్ధమైంది. 12 ఏళ్లకు ఒకసారి వచ్చే ఈ పుష్కరాలను జూలైనెలలో భక్తి శ్రద్ధలతో జరుపుకోడానికి రాష్ట్ర ప్రజలు సన్నద్ధమవుతున్నారు. పోయినసారి 2003 లో ప్రభుత్వ ప్రోత్సాహంతో భారీఎత్తున జరిగిన పుష్కరాల నిర్వహణ కూడా ఇదే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడి ఆధ్వర్యంలో జరగడం విశేషం. ఈ సారి వచ్చే పుష్కరాలు 144 సంవత్సరాలకు ఒకసారి వచ్చే మహాపుష్కరాలు కావడంతో మరింత వైభవంగా ఈ పవిత్ర కార్యక్రమాన్ని నిర్వహించేందుకు రాష్ట్ర ప్రభుత్వం సర్వసన్నద్ధమవుతోంది.

మున్నెన్నడూ కనీవిని ఎరుగని విధంగా గోదావరి పుష్కరాలు నిర్వహించేందుకు ప్రభుత్వం 1,470 కోట్ల రూపాయలను వివిధ అభివృద్ధి, సదుపాయాల కల్పన కోసం విడుదల చేసింది. ఈ నిధులతో తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు లక్షలాదిగా తరలివచ్చే భక్తుల సౌకర్యార్థం అనేక కార్యక్రమాలు ఇప్పటికే యుద్ధప్రాతిపదిక మీద జరుగుతున్నాయి.

ఈ సందర్భంగా, గోదావరి మహాపుష్కరాల కోసం ప్రభుత్వం ఒక ప్రత్యేక చిహ్నాన్ని రాష్ట్ర ప్రభుత్వం తయారు చేయించింది. హిందూ సంస్కృతిలో పవిత్రంగా పరిగణించే ఏడు అడుగులను తలపిస్తూ, ఏడు గీతలతో రూపొందిన గోదావరి మహా పుష్కరాల చిహ్నం, పారుతున్న నదీమ తల్లిని, ప్రణమిల్లుతున్న భక్త జనాన్ని గుర్తు చేస్తుంది. అంతేకాదు, గోదావరికి, తెలుగు ప్రజలకు తరతరాలుగా ఉన్న అనుబంధాన్ని తలపిస్తుంది.

ఈ పవిత్ర సందర్భాన్ని పురస్కరించుకొని, గోదావరి మహా పుష్కరాలలో పాల్గొనవలసిందిగా రాష్ట్రపతిని, ప్రధానిని, ఇతర రాష్ట్రాల ముఖ్యమంత్రులని ఆహ్వానించాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నిర్ణయించారు. నభూతోనభవిష్యతిగా నిర్వహించనున్న ఈ కార్యక్రమాన్ని కనులు విందు చేసే వీడియో డాక్యుమెంటరీగా తీయాలని ప్రపంచ ప్రసిద్ధిగాంచిన డిస్కవరి, నేషనల్ జాగ్రఫిక్ చానళ్లతో కూడా ప్రభుత్వం చర్చలు జరుపుతోంది. పుష్కరాల సందర్భంగా పెద్ద ఎత్తున జరగనున్న సాంస్కృతిక, కళా కార్యక్రమాలను ఈ డాక్యుమెంటరీలో పొందుపర్చాలని భావిస్తోంది. తెలుగు ప్రజలకు గోదావరితో పెనవేసుకుపోయిన బంధాన్ని, ఇక్కడి జీవన విధానాన్ని నది ప్రభావితం చేసిన వైనాన్ని తెలియజెప్పాలన్నది ఆలోచన.

గోదావరి మహా పుష్కరాలకు దేశం నలుమూలల నుంచీ దాదాపు మూడున్నర కోట్ల మంది తరలివస్తారని అంచనా. జూలై14 నుంచి 25 వరకూ జరిగే ఈ మహా పుష్కరాలను పురస్కరించుకొని, తెలుగు సాంప్రదాయిక సంగీత, కళారూపాల్ని ప్రదర్శించడానికి భారీ ఎత్తున ఏర్పాట్లు జరుగుతున్నాయి. రాష్ట్రానికి చెందిన వివిధ ప్రాంతాల వంటకాల రుచులను కూడా ఈ సందర్భంగా అందుబాటులో ఉంచుతారు. గంగానదికి జరిగే తరహాలో గోదావరి శోభాయాత్రను కూడా నిర్వహించాలని ప్రభుత్వం నిర్ణయించింది.



స్వర్ణాంధ్ర స్వప్నాన్ని నిజం చేయడానికి సర్వశక్తులూ ఒడ్డుతున్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఈ చారిత్రక సమయంలో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి దొరకడం తెలుగు ప్రజల సౌభాగ్యం.

ముఖ్యమంత్రిగా చంద్రబాబు నాయుడు అధికారం చేపట్టేనాటికి కొత్తగా ఏర్పడ్డ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అనాథ, అనారోగ్య శిశువు. విభజన పురిటినొప్పుల్లో అడ్డగోలు సిజేరియన్ ఆపరేషన్ వల్ల జన్యు లోపాలతో కళ్లు తెరిచిన బిడ్డ.

జన్మనిచ్చిన వాళ్లు రోడ్డుమీద వదిలేస్తే, భవిష్యత్తు అగమ్యగోచరంగా మిగిలిన దైన్యస్థితి.

పుండుమీద కారం చల్లినట్టు, సహజ న్యాయ సూత్రాలకు విరుద్ధంగా జరిగిన భాగహారంలో బండిసున్నాలు కూడా శేషంగా మిగలని దుస్థితి. అరవయ్యేళ్లు కలిసి చేసుకున్న అభివృద్ధిని వదులుకోవాల్సి రావడం ఒక ఎత్తు. చీలికలు పీలికలుగా మిగిలిన సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక జీవనాన్ని కలిపి కుట్టుకుని, మళ్లీ ఒక మనిషిగా తలెత్తుకు తిరగడానికి అవసరమైన సంకల్పాన్ని, విశ్వాసాన్ని కల్పించాల్సిన చారిత్రక అవసరం మరో ఎత్తు.

ఎన్నికలు జరిగి కొత్త ప్రభుత్వం ఏర్పడేనాటికి, అవశేష ఆంధ్రప్రదేశ్ పరిస్థితి మొసలితో జరిగిన పోరాటంలో గాయపడిన నిస్సహాయ గజం లాంటిది. అయితే, గజేంద్ర మోక్షంలో లాగా విష్ణువు ఇక్కడ ఆకాశం నుంచి ఊడిపడలేదు. ప్రజలు సోయతో ఎన్నుకున్న ప్రభుత్వం, దాని అధినాయకుడు చంద్రబాబు నాయుడు కష్టకాలంలో ఈ చారిత్రక అవసరాన్ని తీర్చడానికి ఉద్యమించారు.

వడ్డించిన విస్తరిలా ఉన్నప్పుడు ఇల్లలకడం సులువే. అడ్డగోలుగా వచ్చిన ఆస్తితోనో, వారసత్వంగా వచ్చిన సంపదతోనో కుషీ చేసే నాయకులకు కొదవలేదు. చంద్రబాబు నాయుడికి ఆ పరిస్థితి ఎప్పుడూ లేదు. తొమ్మిదేళ్ల స్వేదం చిందించి, రాష్ట్ర నిర్మాణానికి నాట్లు వేస్తే, పాదులు చేస్తే, చేతికొచ్చిన ఆ పంటని సొంతానికి కొంత, సొంత మనుషులకు మరికొంత ఊడ్చిపెట్టిన ఘనచరిత కొందరిది!

ఇప్పుడు మళ్లీ పలుగూ పార పట్టుకొని, అందరినీ కలగలుపుకొని మొదటినుంచీ మొదలుపెట్టాల్సిన పరిస్థితి. గాయపడ్డ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చంద్రబాబు 2014 జూన్‌లో ముఖ్యమంత్రి అయ్యేనాటికి రాజధాని అనబడే పాలనా కేంద్రం లేదు. యంత్రాంగం లేదు. జరుగుబాటు లేదు. ఆదాయ వనరులు లేవు. ఆస్తులు లేవు. ఆప్త మిత్రులు లేరు.

దాయాదుల పోరు, కటికదరిద్రం తప్ప, ఇంకేమీ మిగల్చని కుట్రకి పతాక శీర్షికలా మిగిలింది ఆంధ్ర ప్రదేశ్.

ఇప్పుడిక కావాల్సింది ఒక అలుపెరుగని నాయకుడు. ఒక విరామమెరుగని యోధుడు. ఓటమిని అంగీకరించని ధీరుడు. నిరాశానిస్పృహలని దరిజేరనీయని ఆశావహుడు.

ఇప్పుడిక కావాల్సింది ఒక అలుపెరుగని నాయకుడు. ఒక విరామమెరుగని యోధుడు. ఓటమిని అంగీకరించని ధీరుడు. నిరాశానిస్పృహలని దరిజేరనీయని ఆశావహుడు. సమస్యలని సానుకూలంగా మార్చుకొని, సవాళ్లని అవకాశాలుగా తీసుకొని, అడ్డంకులని ఎదిరించి, అవరోధాలని ఎదుర్కొని, ఆధునికతని పుణికిపుచ్చుకొని ముందుకు తీసుకుపోగల నాయకుడు. ఈ చారిత్రక పాత్రని, ఈ సమకాలిక అవసరాలని సమర్థంగా నిర్వహించగల ఏకైక నాయకుడిగా చంద్రబాబు నాయుడు ఈ ఏడాది కాలంలో రుజువు చేసుకున్నారు.

సమస్యలని సానుకూలంగా మార్చుకొని, సవాళ్లని అవకాశాలుగా తీసుకొని, అడ్డంకులని ఎదిరించి, అవరోధాలని ఎదుర్కొని, ఆధునికతని పుణికిపుచ్చుకొని ముందుకు తీసుకుపోగల నాయకుడు. ఈ చారిత్రక పాత్రని, ఈ సమకాలిక అవసరాలని సమర్థంగా నిర్వహించగల ఏకైక నాయకుడిగా చంద్రబాబు నాయుడు ఈ ఏడాది కాలంలో రుజువు చేసుకున్నారు.

కొత్త రాజధానికి పూనిక కావచ్చు, ఆదాయ వనరులని పెంచడానికి అవకాశాలని వెదకడం కావచ్చు, పెట్టుబడులని పెంచి ఉపాధి కల్పించాలన్న కాంక్ష కావచ్చు, ఉన్నత విద్యానిలయాలుగా అన్ని ప్రాంతాలని తీర్చిదిద్దే ప్రయత్నం కావచ్చు, ఐటిని ఉపయోగించి పాలనలో పారదర్శకతను పెంచే తపన కావచ్చు, వ్యవసాయాన్ని లాభసాటిగా మార్చాలన్న పట్టుదల కావచ్చు, నాగరికతకే ఆధారభూతంగా మారిన విద్యుత్ వెలుగులకు కరవు లేకుండా చేయాలన్న ఆత్రం కావచ్చు, ఎన్ని చేసినా సంక్షేమానికి పెద్దపీట వేయాలన్న గ్రహింపు కావచ్చు, ఆధునికతకు ఆలవాలంగా ఆంధ్రప్రదేశ్ రూపురేఖలు మారాలన్న దీక్ష కావచ్చు – ఈ సంవత్సర కాలంలో ముఖ్యమంత్రిగా చంద్రబాబు నాయుడు చూపిన చొరవ, పడిన కష్టం, సాధించిన ఫలితాలు చిన్నవి కావు.

ఈ ఏడాదిలో అవశేషంగా మిగిలిన ఆంధ్రప్రదేశ్‌ని ఒక ఉత్తుంగ తరంగంగా ఆయన మార్చగలిగారు. ఒక కొత్త ఉనికికి, ఒక కొత్త చైతన్యానికి, ఒక కొత్త ఆశకి శ్రీకారం చుట్టారు. సాంస్కృతిక ఉత్తేజంతో పాటు, సామాజిక మార్పులకు ఊతం ఇచ్చారు. ఆర్థిక జవసత్వాలని ఇనుమడింపజేయడానికి ప్రపంచం నలుమూలలూ చుట్టివచ్చారు. రాజధానికి ఒక రూపు కల్పించారు. పాలనా యంత్రాంగాన్ని గాడిలో పెట్టారు. పెట్టుబడులకు సన్నద్ధం చేశారు. పరిశ్రమలకు పెద్ద పీట వేశారు. ఆదరువు లేని రాయలసీమకు బాసటగా నిలిచారు. నిర్లక్ష్యపు నీడలో ఉన్న ఉత్తరాంధ్రకు కొత్త ఊపు తీసుకొచ్చారు. నిస్సత్తువ సోకిన కోస్తాను ఉరకలెత్తించారు. 2029 వరకూ రాష్ట్రభవిష్యత్తుకు ప్రణాళికలు రచించి, తెలుగు ప్రజలకు ఒక నవలోకాన్ని కలలు గనే ధైర్యాన్ని కల్పించారు.

## గాడిలో పడ్డ పాలన

దాదాపుగా నాలుగైదేళ్లు అనేకానేక కారణాల వల్ల అస్తవ్యస్తంగా మారిన పాలనా యంత్రాంగాన్ని గాడిలో పెట్టడానికే ముఖ్యమంత్రికి సమయం పట్టింది. ఉద్యోగుల విభజన ఎంతకీ తెగకపోవడం, ప్రజలకి దూరంగా పాలన సాగించాల్సి రావడం వంటి రకరకాల ఇబ్బందులను ముందు అధిగమించారు. పక్షవాతం సోకిన పాలన కారణంగా ఏళ్లూపూళ్లూ గడిచినా ఎక్కడవేసిన గొంగళి అక్కడే అన్నట్టు మిగిలి పోయిన వివిధ రంగాల దుస్థితిని కళ్లకు కట్టినట్టు ప్రజానీకానికి తెలియజెప్పేందుకు శ్వేతపత్రాలను విడుదల చేశారు. తొలి ఏడాదే 15 వేల కోట్ల లోటు వల్ల ఆర్థిక పరిస్థితి ఎంత దయనీయంగా ఉందో ఇటు రాష్ట్ర ప్రజలకూ, అటు కేంద్ర ప్రభుత్వానికి వివరించారు.

అప్పుడిక రంగంలోకి దిగి, కష్టాల ఊబిలో కూరుకుపోయిన రాష్ట్రాన్ని ఒడ్డున పడేయడానికి ఒక కర్మయోగిలా కార్యాచరణకి శ్రీకారం చుట్టారు. ఇందుకోసం ముందుగా ప్రణాళిక గీశారు. 2020 కల్లా దేశంలోనే అభివృద్ధి చెందిన మూడు రాష్ట్రాల్లో



ఒకటిగా, 2029 కల్లా దేశంలో అత్యంత అభివృద్ధి చెందిన రాష్ట్రంగా, 2050-51 కల్లా ప్రపంచంలో పెట్టుబడులకు అత్యంత అనుకూలమైన ప్రదేశంగా రాష్ట్రాన్ని తీర్చిదిద్దాలని నిర్ణయించారు.

అందుబాటులో ఉన్న వనరులను వినియోగించుకొని, సంపద సృష్టించాలంటే పెట్టుబడులు కావాలి. సాంకేతిక నైపుణ్యం, సామర్థ్యం కావాలి. అందుకే, పెట్టుబడుల కోసం చంద్రబాబు నాయుడు కాలికి బలపం కట్టుకొని తిరిగారు. ఆసియా టైగర్లుగా ఎదిగిన జపాన్, చైనా, సింగపూర్ దేశాలకు ప్రతినిధి బృందాలను తీసుకువెళ్లి, వ్యాపార ఒప్పందాలను కుదిర్చారు. ఒక్క ఏడాదిలో ఇంత విస్తృతంగా విదేశీ పర్యటనలు చేసి, ఇన్ని అవగాహనా ఒప్పందాలను కుదుర్చుకున్న ముఖ్యమంత్రి మన దేశంలో మరొకరు లేరంటే అతిశయోక్తి లేదు. జపాన్, చైనా దేశాల పర్యటనలో ఆ భాషల్లోనే తమ ప్రెజెంటేషన్లు, విజిటింగ్ కార్డులు కూడా తయారు చేయించడం చంద్రబాబు వ్యవహార దక్షతకి నిదర్శనం. ఆయన సంకల్ప దీక్షని, పట్టువదలని తత్వాన్ని చూసి ముగ్ధులైన సింగపూర్ ప్రభుత్వం మన రాష్ట్ర రాజధాని నిర్మాణానికి మాస్టర్ ప్లాన్‌ని పైసా ఖర్చు లేకుండా ఉచితంగా తయారు చేసి ఇవ్వడానికి సిద్ధపడింది. 'మీ ముఖ్యమంత్రి ఏదైనా అనుకుంటే సాధించేవరకూ నిద్రపోరు,' అని సింగపూర్ మంత్రి ఈశ్వరన్ కితాబిచ్చింది ఇందుకే.

హుద్ హుద్ పెను తుపాను కావచ్చు, చార్ ధామ్ వరద విపత్తు కావచ్చు, నేపాల్ భూకంప విలయం కావచ్చు, అమెరికాలో ప్రమాదం కావచ్చు, ఆండీస్ పర్వత శ్రేణుల్లో మస్తాన్ బాబు విషాదం కావచ్చు - ఎక్కడ తెలుగువారికి ఏ ఇబ్బంది వచ్చినా, ఏ ప్రమాదం ముంచుకొచ్చినా, చంద్రబాబు నాయుడు వెంటనే స్పందిస్తారని, యావత్తు ప్రభుత్వ యంత్రాగాన్ని అప్రమత్తం చేసి, సర్వశక్తులూ ఒడ్డి ఆదుకుంటారని ఇవాళ ప్రపంచవ్యాప్తంగా తెలుగువారు గుండెనిండా విశ్వాసంతో నిద్రపోగలుగుతున్నారు.

## బలమైన పునాదులకు శ్రీకారం

మౌలిక వసతుల కల్పన, పారిశ్రామికీకరణ ద్వారా మాత్రమే నవ్యాంధ్రప్రదేశ్ స్వర్ణాంధ్రప్రదేశ్ గా మారగలదని ముఖ్యమంత్రి గ్రహించారు. అందుకే ఈ రంగాల్లో చేపట్టాల్సిన ప్రాజెక్టులని ముందుగా గుర్తించారు. విద్యుత్తే అన్నిటికీ కీలకం అని తెలిసిన చంద్రబాబు ముందుగా ఆ రంగాన్ని సంస్కరించారు. పని తీరు మెరుగుపర్చుకోవడం ద్వారా 24 గంటలూ రాష్ట్రం యావత్తూ విద్యుత్ కాంతులు వెదజల్లే పరిస్థితి కల్పించారు. పంపిణీ నష్టాలను భారీగా తగ్గించి, కేంద్రంతోనే భేష్ అనిపించుకున్నారు. భవిష్యత్ అవసరాలను దృష్టిలోపెట్టుకొని, సౌర, పవన విద్యుత్ ఉత్పత్తికి ద్వారాలు తెరిచారు.

నిర్దేశించుకున్న ఏడు మిషన్లలో ఒకటైన మౌలిక వసతుల కల్పన మిషన్ కింద రాష్ట్ర సమగ్రాభివృద్ధికి నడుం బిగించారు. రాష్ట్రానికి ప్రకృతి వరంగా ప్రసాదించిన దాదాపు వెయ్యి కిలోమీటర్ల తీరాన్ని ఉపయోగించుకొని, నౌకాశ్రయాలను నిర్మించాలని తలపెట్టారు. పెద్ద ఎత్తున ప్రపంచ దేశాలకు సరకులను ఓడల ద్వారా రవాణా చేయడం ద్వారా సింగపూర్ ఆర్థికంగా బలపడిన అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని, ఆంధ్రప్రదేశ్ తీరాన్ని ఆగ్నేయాసియా దేశాలకు లాజిస్టిక్స్ హబ్ (సరకు రవాణా కేంద్రం) గా నిర్మించాలని ప్రతిపాదించారు. ఈ మేరకు, రాష్ట్రంలో ప్రభుత్వ, ప్రైవేటు రంగాల్లో 14 నౌకాశ్రయాల నిర్మాణానికి పూనుకున్నారు. విజయవాడ, విశాఖ, తిరుపతిలను మెగా సిటీలుగా అభివృద్ధి చేయాలని ప్రతిపాదించారు. వీటికి తోడుగా 11 పట్టణాలని స్మార్ట్ సిటీలుగా (ఆధునిక వసతులన్నీ ఉన్న పట్టణాలు), మూడు అంతర్జాతీయ విమానాశ్రయాలు, పది దేశీయ విమానాశ్రయాలు, జలరవాణా మార్గాలు, ఇంకా 28 ప్రత్యేక ఆర్థిక మండళ్లను ఏర్పాటు చేసి, ఆంధ్రప్రదేశ్‌ని వ్యాపార కేంద్రంగా, ఆర్థిక కార్యకలాపాలకు ఆలవాలంగా చేయాలని సంకల్పించారు.

## మనకొక మహానగరం

తమకంటూ ఒక సాంస్కృతిక, చారిత్రక, ఆర్థిక, పాలనా కేంద్రం లేని జాతి మనుగడ ప్రశ్నార్థకం. తెలుగు జాతికి ఒక గుర్తింపు అంటూ వచ్చిన తర్వాత కూడా రెండు సార్లు తమదైన నగరాన్ని నిర్మించుకునే విషయంలో ఆంధ్రులు భంగపడ్డారు. ఈ అనుభవాల నుంచి పాఠాలు నేర్చుకొని, నవ్యాంధ్రప్రదేశ్‌ని ప్రపంచ పటంలో సమున్నతంగా నిలిపే ఒక అద్భుత నగర నిర్మాణానికి ముఖ్యమంత్రి పూనుకున్నారు. ఇందుకోసం ఈ ఏడాది కాలంలో ఎన్నో అవరోధాలను అధిగమించి, ఎన్నో కుట్రలను ఛేదించి, చారిత్రక వారసత్వ నగరమైన అమరావతిని ఆంధ్రుల అజరామర రాజధానిగా ప్రకటించారు. ప్రభుత్వం మీద ఆర్థిక భారం పడకుండా, తొలిసారిగా భూసమీకరణ విధానాన్ని ప్రకటించి, నగర నిర్మాణంలో రైతులను భాగస్వాములను చేసి, అంతర్జాతీయ స్థాయిలో

తెలుగువారందరూ గర్వపడేలా రాజధాని నిర్మాణానికి ఒక్క ఏడాది కాలంలో అన్ని ఏర్పాట్లు పూర్తి చేశారు. ఇన్నినాళ్లకు వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలన్న చంద్రబాబు తపనకు రాష్ట్రంలో అన్ని వర్గాల నుండి అనూహ్య మద్దతు లభించింది.

## సంక్షేమ సవాళ్లు

పేదరికాన్ని తరిమి రాష్ట్రం సమృద్ధిని సాధించాలంటే, పారిశ్రామికీకరణ, పెట్టుబడులు అవసరమే. అయితే, వీటి ఫలాలు అందుబాటులోకి రావడానికి కొంత సమయం పడుతుంది. ఈలోగా, తక్షణం ఊరట కల్పించాల్సిన వర్గాలు చాలానే ఉన్నాయి. అందుకే, ప్రభుత్వం సంక్షేమానికి పెద్ద పీట వేసింది. ఎన్నికల్లో ఇచ్చిన హామీ మేరకు, రుణ మాఫీని దశల వారీగా ప్రారంభించింది. రిజర్వు బ్యాంకు సహకరించకపోయినా, ఆర్థికంగా వ్యవస్థ చితికిపోయి ఉన్నా, ఇచ్చిన మాటను నిలబెట్టుకోవాలనే తపనతో చంద్రబాబు నాయుడు ప్రభుత్వం చాలానే కసరత్తు చేసింది. శాస్త్రీయంగా అధ్యయన చేసిన తర్వాత, ప్రతి రైతు కుటుంబానికి లక్షా 50 వేల రూపాయల మేర రుణమాఫీ ప్రకటించింది. ఇందుకోసం, తొలివిడతగా 5 వేల కోట్ల రూపాయలను విడుదల చేసింది. డ్వాక్రా మహిళల రుణాలను పదివేల రూపాయల వరకు మాఫీ చేసేందుకు ప్రభుత్వం సంకల్పించింది. జీతాలు ఇవ్వడానికి వెతుక్కుంటున్న పరిస్థితుల్లో కూడా, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు, తాజాగా ఆర్టీసీ కార్మికులకు 43 శాతం ఫిట్‌మెంటును ప్రకటించి, రాష్ట్ర పునర్నిర్మాణంలో అందరూ కలిసివచ్చేందుకు అనువైన వాతావరణాన్ని కల్పించింది. ఇక వృద్ధులకు నెలవారీ పింఛన్లను ఐదురెట్లు పెంచి, వారికి భరోసా కల్పించింది.

అటు ఉపాధి కల్పనకు, పారిశ్రామికీకరణకు, సంపద సృష్టికి శ్రమిస్తూనే, ఇటు పేదలకు, అన్నార్తులకు, అణగారిన వర్గాలకు అంతే నిబద్ధతతో ఆసరా కల్పించడంలో చంద్రబాబు నాయుడి ప్రభుత్వం సమతుల్యంగా తీసుకున్న కార్యక్రమాలు, చేపట్టిన చర్యలు దేశానికే మార్గదర్శకంగా నిలిచాయని చెప్పుకోవాలి.

## భగీరథ యత్నం

పారిశ్రామిక ప్రగతి కోసం పాటు పడుతూనే, రాష్ట్రానికి తొలినుండీ ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక ఆలంబనగా ఉన్న వ్యవసాయం, నీటిపారుదల రంగాల మీద ముఖ్యమంత్రి ప్రత్యేక శ్రద్ధ పెట్టారు. వ్యవసాయ రంగ ఆధునీకరణ మీద, ఆధునిక సాగు పద్ధతుల మీద, యంత్రాల ద్వారా ఉత్పాదకత పెంపుదల మీద ఈ ప్రభుత్వం ప్రధానంగా దృష్టి పెట్టింది. వీటన్నిటితోపాటు, రాష్ట్రం నలుమూలలా నీటి పారుదల సౌకర్యాన్ని కల్పించి, రైతు బంగారం పండించాలన్న లక్ష్యంతో జల దీక్షను చేపట్టారు. ఇందుకోసం నదుల అనుసంధానం మీద దృష్టి పెట్టి, గోదావరి నీటిని కృష్ణకు మళ్లించి, వరద నీరు సముద్రంలోకి వృధాగా కలిసిపోకుండా ప్రాజెక్టులను చేపట్టారు. ఇచ్చిన మాటకు కట్టుబడి, ప్రాజెక్టుల దగ్గరే నిద్రచేసి, పనులను నిశితంగా పర్యవేక్షించి, కాంట్రాక్టర్లను పరుగులు పెట్టించి, పనిచేసే ముఖ్యమంత్రి అంటే ఏంటో తెలియజెప్పారు.

> ఈ రాష్ట్రం ఇప్పుడిప్పుడే ప్రగతికి దారులు వేసుకుంటోంది. సాధించింది కొంతే. చేయాల్సింది ఇంకా చాలా ఉంది. చరిత్రలో ఒక కీలక మలుపు తర్వాత ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర భవితలో ఏడాది కాలం బహుశా అత్యల్పం. అయినా, ఇప్పుడు పడే అడుగే, ముందు తరాలకు దారి చూపుతుంది. దానిని సరైన దిశలో, సరైన దశగా నడిపించగల సమర్థత చంద్రబాబు నాయుడికే ఉందని, ఆయన నాయకత్వంలో ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి పథంలో దూసుకువెళుతుందని ఇవాళ రాష్ట్రం యావత్తూ నమ్ముతోంది.

## అన్నిటికీ నేనున్నా

రాష్ట్రానికి గానీ, రాష్ట్ర ప్రజలకు గానీ ఎప్పుడు ఏ విపత్తు వచ్చినా, ఏ ఆపద సంభవించినా, ఏ కష్టం ఎదురైనా అప్పటికప్పుడు రాత్రి పగలూ అని లేకుండా స్వయంగా రంగంలోకి దూకి ఆదుకోవడంలో ముఖ్యమంత్రి చంద్రబాబుని మించిన నాయకుడు మరొకరు లేరని ఇప్పటికే రుజువైంది. కనీవిని ఎరుగని రీతిలో హుద్ హుద్ పెను తుపాను విశాఖను ధ్వంసం చేస్తే, ఆ చీకటిలో ఆ ప్రళయంలో కూడా అక్కడే మకాం వేసి, రోడ్డు మీద నిలబెట్టిన బస్సులో నిద్రలు చేసి, దగ్గరుండి సహాయ కార్యక్రమాలను పర్యవేక్షించి, మళ్లీ సాధారణ పరిస్థితి వచ్చేవరకు అందరికీ అందుబాటులో ఉన్న ఘనత మన ముఖ్యమంత్రిదే. చార్ ధామ్ వరద విపత్తు కావచ్చు, నేపాల్ భూకంప విలయం కావచ్చు, అమెరికాలో ప్రమాదం కావచ్చు, ఆండీస్ పర్వత శ్రేణుల్లో మస్తాన్ బాబు విషాదం కావచ్చు – ఎక్కడ తెలుగువారికి ఏ ఇబ్బంది వచ్చినా, ఏ ప్రమాదం ముంచుకొచ్చినా, చంద్రబాబు నాయుడు వెంటనే స్పందిస్తారని, యావత్తు ప్రభుత్వ యంత్రాగాన్ని

## అలుపెరుగని బాటసారి

కష్టపడే తత్వానికి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు మారుపేరు. రోజుకు 18 గంటలు కష్టపడే ముఖ్యమంత్రి ఎవరైనా ఉన్నారంటే అది చంద్రబాబేనని అందరికి తెలుసు. ఉదయం లేచిన దగ్గర నుంచి అలుపెరగకుండా, మధ్యలో విరామం లేకుండా ఆయన బాధ్యతానిర్వహణ చేస్తూనే ఉంటారు. అలసట అనేది ఆయన దరిదాపులకు రాదా అని చుట్టూ ఉన్నవాళ్లు ఆశ్చర్యపడాల్సిందే. పనిచేసుకుంటూ పోవడమే ఆయన నైజం. మితాహారం, మంచి అలవాట్లు, యోగాసనాలు, ధ్యానం, క్షణం కూడా తీరిక లేని దైనందిన విధులే ఆయన ఆరోగ్య రహస్యమని సన్నిహితులు చెబుతారు. చంద్రబాబు కుటుంబానికి వెచ్చించే సమయం కూడా చాలా తక్కువ. ఇటీవల కాలంలో ఆదివారం సాయంత్రం కుటుంబంతో గడపటానికి కేటాయించినా, అది కూడా ఒక్కోసారి గగనమే. ఉదయం హైదరాబాదులో బయలుదేరి, సుదూరంగా ఉన్న రెండు జిల్లాలు పర్యటించి, సాయంత్రానికి ఢిల్లీ వెళ్లి, మళ్లీ రాత్రికి హైదరాబాదు తిరిగివచ్చిన సందర్భాలు ఎన్నో. రాష్ట్రానికి వందల కిలోమీటర్ల దూరంలో ఉండవలసి వచ్చినా, వారంలో సగం రోజులు ఏదో ఒక జిల్లా పర్యటనలో చంద్రబాబు



అలుపు, సొలుపు లేకుండా గడుపుతారు. ఇక విదేశీ పర్యటనలో ఆయన ఒక్క నిమిషం కూడా వృధా చేయకుండా, కార్యక్రమం తర్వాత కార్యక్రమానికి సన్నద్ధమవుతారు. ఇవాళ పాలనా వ్యవహారాలు సంక్లిష్టంగా మారిన నేపథ్యంలో, శారీరక, మానసిక ధృఢత్వం ఉన్న నాయకుడు నవ్యాంధ్రప్రదేశ్ కి దొరకడం రాష్ట్ర ప్రజల అదృష్టం.




అటు ఉపాధి కల్పనకు, పారిశ్రామికీకరణకు, సంపద సృష్టికి శ్రమిస్తూనే, ఇటు పేదలకు, అన్నార్తులకు, అణగారిన వర్గాలకు అంతే నిబద్ధతతో ఆసరా కల్పించడంలో చంద్రబాబు నాయుడి ప్రభుత్వం సమతుల్యంగా తీసుకున్న కార్యక్రమాలు, చేపట్టిన చర్యలు దేశానికే మార్గదర్శకంగా నిలిచాయని చెప్పుకోవాలి.

అప్రమత్తం చేసి, సర్వశక్తులూ ఒడ్డి ఆదుకుంటారని ఇవాళ ప్రపంచవ్యాప్తంగా తెలుగువారు గుండెనిండా విశ్వాసంతో నిద్రపోగలుగుతున్నారు.

## సాంస్కృతిక చైతన్యం

కొత్త రాష్ట్రంలో సాంస్కృతిక చైతన్యం వెల్లివిరిసేందుకు, చంద్రబాబు ప్రభుత్వం ఈ ఏడాది కాలంలో అనేక కార్యక్రమాలు చేపట్టింది. తెలుగు పండుగ ఉగాదిని కొత్త రాజధాని ప్రాంతంలో ముఖ్యమంత్రే జరుపుకోవడం దగ్గర నుంచి, కడప జిల్లా ఒంటిమిట్ట కోదండరామస్వామి ఆలయంలో శ్రీరామనవమి వేడుకలను అధికారికంగా జరపడం వరకూ, ప్రతి అంశంలో తెలుగు సంస్కృతి ఉట్టిపడేలా కార్యక్రమాలు నిర్వహించింది. రాష్ట్రం నలుమూలలా, జిల్లాకొక సాంస్కృతిక కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని నిర్ణయించింది. ఇక నవ్యాంధ్ర రాజధాని అమరావతి నగరం తెలుగు సాంస్కృతిక కళా వైభవానికి ప్రతీక కానుంది. ఇందులో భాగంగా, సుప్రసిద్ధ సినీ దర్శకుడు బాపు, సినీ రచయిత ముళ్లపూడి వెంకటరమణల పేరిట ఒక కళా క్షేత్రాన్ని నిర్మించనున్నారు. కూచిపూడి నృత్య వైభవాన్ని పెంపొందించేందుకు, కృష్ణా జిల్లా కూచిపూడిలో కూచిపూడి నాట్యారామాన్ని 100 కోట్ల రూపాయలతో నిర్మించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. జూలైలో గోదావరి పుష్కరాలను అంతర్జాతీయ స్థాయిలో నిర్వహించేందుకు 1,470 కోట్ల రూపాయలతో సకల సౌకర్యాలు కల్పిస్తోంది. మనకు అద్భుతమైన సాంస్కృతిక వారసత్వం ఉంది, దీనికి సరైన ప్రోత్సాహం కల్పించి, తెలుగుదనాన్ని కాపాడుకోవడమే కాకుండా, ప్రపంచానికి చాటిచెప్పాలన్న తపన ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రతిమాటలో ద్యోతకమవుతోంది.

## కాలానికి ఎదురెళ్లి...

ఒక్క ఏడాదిలో ఒక ప్రభుత్వం, ఒక నాయకుడు ఎన్ని పనులు చేయగలరు, ఎన్ని సవాళ్లని ఎదుర్కోగలరు అని తెలుసుకోవాలంటే, చంద్రబాబు నాయుడు ఈ 365 రోజుల్లో సాధించినవి ఒక్కసారి అవలోకనం చేస్తే చాలు. కేంద్ర ప్రభుత్వంతో సమన్వయం చేసుకుంటూ, అన్ని ఇబ్బందులనూ సంయమనంతో ఎదుర్కొంటూ, రాష్ట్రానికి చేకూరాల్సిన ప్రయోజనాలను ఆయన పట్టు పట్టి సాధించుకుంటున్నారు. ఐఐటి, ఐఐఎం వంటి దాదాపు డజను జాతీయ స్థాయి విద్యాసంస్థలను మన రాష్ట్రానికి ఈ ఏడాదిలో తీసుకువచ్చారు. ప్రతి ఇంటికీ, ప్రతి పరిశ్రమకీ విద్యుత్తు అందించేందుకు, కేంద్ర ప్రభుత్వం చేపట్టిన పథకాన్ని ఆంధ్రప్రదేశ్‌కి తెచ్చారు. దేశంలో ఎవరు ఎక్కడ పరిశ్రమ పెడదామనుకున్నా, మా రాష్ట్రానికి రండి అని వారికి నచ్చజెప్పేందుకు మొహమాటపడలేదు. చిత్తూరు జిల్లా శ్రీసిటి పారిశ్రామిక మండలికి పెద్ద ఎత్తున తరలి వస్తున్న అంతర్జాతీయ పరిశ్రమల గురించి, అటు తమిళనాడు, ఇటు కర్ణాటక వంటి రాష్ట్రాలు చిర్రుబుర్రులాడుతున్నా, విభజన తర్వాత ఏర్పడ్డ రాష్ట్రం దాదాపు ప్రతి అంశంలో విరోధ వైఖరి అవలంబించినా, ఏ మాత్రం తొణకని వ్యక్తిత్వం ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడిది.

'ఎవరెన్ని అడ్డంకులు కల్పించినా, ఎన్ని ఇబ్బందులు ఎదురైనా, అనుకున్నవన్నీ అనుకున్నట్టు జరగకపోయినా, సానుకూల దృక్పథంతో ముందుకు వెళ్లడమే నా బలం,' అని ముఖ్యమంత్రి అన్న మాటలు అక్షరాలా నిజం.

అందుకే, ఇన్ని సమస్యల నడుమ కూడా ఆంధ్ర ప్రదేశ్ గత ఏడాది జాతీయ అభివృద్ధి రేటు (7.4) కంటే ఎక్కువగా 8.4 శాతం అభివృద్ధి సాధించింది. ముఖ్యమంత్రి పనితనానికి, సమర్థతకి ఇంతకంటే నిదర్శనం ఏముంది?

ఈ రాష్ట్రం ఇప్పుడిప్పుడే ప్రగతికి దారులు వేసుకుంటోంది. సాధించింది కొంతే. చేయాల్సింది ఇంకా చాలా ఉంది. చరిత్రలో ఒక కీలక మలుపు తర్వాత ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర భవితలో ఏడాది కాలం బహుశా అత్యల్పం. అయినా, ఇప్పుడు పడే అడుగే, ముందు తరాలకు దారి చూపుతుంది. దానిని సరైన దిశలో, సరైన దశగా నడిపించగల సమర్థత చంద్రబాబు నాయుడికే ఉందని, ఆయన నాయకత్వంలో ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి పథంలో దూసుకువెళుతుందని ఇవాళ రాష్ట్రం యావత్తూ నమ్ముతోంది. ఈ చారిత్రక సమయంలో ఆయన నాయకత్వం రాష్ట్రానికి దొరకడం సౌభాగ్యంగా భావిస్తోంది.

ఎవరో చేసిన పాపం వల్ల పుట్టుక వికటించినా, స్వయంశక్తితో ఎదిగివస్తున్న బిడ్డలాగా ఇవాళ ఆంధ్రప్రదేశ్ కొండంత ధైర్యంగా అడుగులు వేస్తోందంటే, దానికి కారణం గడిచిన ఏడాదిగా చంద్రబాబు నాయుడు ప్రదర్శించిన దార్శనికత, నాయకత్వ పటిమ, సంకల్పసిద్ధి తప్ప మరొకటి కాదు. స్వర్ణాంధ్ర ప్రస్థానంలో ఈ ముందడుగు అభివృద్ధి దిశగా మరిన్ని పెద్ద అంగలువేస్తుందని, ఆంధ్రప్రదేశ్ అక్షర క్రమంలోనే కాకుండా, అతి త్వరలోనే ప్రగతికి చిహ్నంగా నిలుస్తుందనే నమ్మకం ప్రజలకు కలిగిందంటే, ఆ క్రెడిట్ తప్పకుండా చంద్రబాబు నాయుడుదే.



కందుల రమేష్

# జన సుభిక్షమే చంద్రబాబు జలదీక్ష

ఖాళీగా కలలు కనడానికి కాదు, సస్యశ్యామలం, సతత హరితమూ అయిన కల నిజం కావడానికి నిద్రపోవడం గురించి మీకు తెలుసా? కొన్నేళ్లుగా నిద్రపోతున్న ఒక యంత్రాంగాన్ని, ఈ వ్యవస్థని మేల్కొలపడానికి నిద్రపోవడం గురించి మీరు విన్నారా? అదే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు చేపట్టిన జల దీక్ష- గట్టు నిద్ర కార్యక్రమం.

నవ్యాంధ్రలో ప్రతి పొలానికీ నీరు అందాలని, ప్రతి రైతు జీవితం పొలానికి లానే పచ్చగా ఉండాలన్న ఆశయంతో తాను జలదీక్ష చేపడుతున్నానని అన్నారు ముఖ్యమంత్రి. రైతన్నల శ్రేయస్సు అనే సామాజిక, సామూహిక స్వప్నాన్ని సాకారం చేయడమే జలదీక్ష పరమ లక్ష్యమని ఆయన ప్రకటించారు, ఆ లక్ష్య సాధన దిశగా సాగిపోతున్నారు.

### ఉప్పుసంద్రం పాలు కానివ్వం

సముద్రంలో కలిసే మిగులు జలాలను కృష్ణా డెల్టాకు తీసుకురావడం, రాయలసీమకు కృష్ణా నీటిని తరలించడమే చంద్రబాబు ధ్యేయంగా పెట్టుకున్నారు. గోదావరి మిగులు జలాల్లో మహారాష్ట్ర 30 టీఎంసీలను వినియోగించుకుంటోంది. 45 టీఎంసీలు మన రాష్ట్రం వినియోగించుకుంటోంది. చివరగా 3 వేల టీఎంసీలు వృథాగా సముద్రంలో కలుస్తున్నాయి. అందుకే వాటిని సమర్థవంతంగా వినియోగించుకోవాలని రాష్ట్రప్రభుత్వం భావిస్తోంది. గోదావరి నీటిని కృష్ణా-పెన్నాలకు తరలిస్తే మెరుగైన ఫలితాలు సాధించే అవకాశాలున్నాయి. గోదావరి నీటిని మనం ఎంతగా వినియోగించుకుంటే అంతగా రాష్ట్రంలోని కరవు పరిస్థితులను అధిగమించేందుకు అవకాశాలున్నాయి.

అలాగే ప్రాధాన్యక్రమంలో సాగునీటి ప్రాజెక్టులు పూర్తి చేయాలని లక్ష్యంతో ప్రభుత్వం చర్యలు తీసుకుంటోంది. పట్టిసీమ, హంద్రీనీవా, తోటపల్లి, నగరీ-గాలేరు, వంశధార, వెలుగొండ ప్రాజెక్టులను వేగవంతంగా పూర్తి చేయనున్నారు. ఫలితంగా లక్షలాది ఎకరాలకు సాగునీరు అందించనున్నారు. ఆ ప్రాజెక్టుల పూర్తికి అవసరమైన నిధులు కేటాయించడంతో పాటు నిర్ణీత వ్యవధిలో పనులు పూర్తి చేయాలని ప్రణాళికలు రూపొందించారు.

రాయలసీమలోని నాలుగు జిల్లాలకు నీటిని అందిస్తే బంగారం పండించుకోవచ్చు. గోదావరి మిగులు జలాలను కృష్ణా డెల్టాకు అందించడంలో భాగంగానే పట్టిసీమను నిర్మించతలపెట్టారు. పోలవరం ప్రాజెక్టు వచ్చేంతవరకు మాత్రమే పట్టిసీమ ఉంటుంది. తద్వారా రాయలసీమకు కృష్ణా జలాలను తరలించే వీలు చిక్కుతుంది. పుష్కలంగా నీరు అందితే అనంతపురం జిల్లాలో మరెక్కడా దొరకని పండ్లతోటలను పండించవచ్చు. కడప జిల్లాలో మేలైన అరటిని పండించవచ్చు. మొత్తానికి రాయలసీమను హార్టీకల్చర్ హబ్‌గా రూపొందించవచ్చు.

### పాతాళ గంగను పైకితోడే నీరు-చెట్టు

ప్రాధాన్యక్రమంలో ప్రాజెక్టుల నిర్మాణం పూర్తి చేసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని సస్యశ్యామలం చేయాలన్న సంకల్పంతో ముఖ్యమంత్రి చంద్రబాబునానాయుడు నీరు-చెట్టు కార్యక్రమానికి అధికప్రాధాన్యత ఇచ్చారు. రాయలసీమ జిల్లాలను కరువు రహిత జిల్లాగా తీర్చిదిద్దడానికి కార్యాచరణను రూపొందించి అమలు చేస్తున్నారు. రాష్ట్రంలోని ప్రతి గ్రామానికి ఓ చెరువు, నాలుగు చెక్ డ్యాంలు ఉంటే 2 వేల హెక్టార్లకు సాగునీరు అందించవచ్చన్నది నీటిపారుదల శాఖ నిపుణుల అంచనా. నీటితోనే సమగ్రాభివృద్ధి సాధ్యపడుతుంది. వర్షపు నీటిని సంరక్షించుకుంటే భూగర్భ జలాలు పెంచవచ్చు. తద్వారా అభివృద్ధి సాధ్యపడుతుంది. ప్రజలు వర్షపు నీటిని భూగర్భ జలాలుగా మార్చండి, ప్రభుత్వం నదుల అనుసంధానం చేస్తుందని ముఖ్యమంత్రి చంద్రబాబు పిలుపునివ్వడం నీటి సంరక్షణపై ప్రజల భాగస్వామ్యం పట్ల ప్రభుత్వానికున్న శ్రద్ధను సూచిస్తోంది.

### పోలవరంతో కరవు దూరం

నదుల అనుసంధానంతో నీటి ఎద్దడి లేకుండా చేయవచ్చు. పోలవరం ప్రాజెక్టు పూర్తవడానికి నాలుగేళ్లు పడుతుంది. అంతవరకు సముద్రంలోకి వృథాగా నీరు వెళ్ళనీయకుండా పట్టిసీమను కడుతున్నామని రాష్ట్ర ప్రభుత్వం స్పష్టం చేస్తోంది. మొన్నటి కేంద్ర బడ్జెట్‌లో పోలవరం ప్రాజెక్టుకు రూ.100 కోట్లు కేటాయించడంపై రాష్ట్రప్రజలు అసంతృప్తి వ్యక్తం చేయడం కేంద్రం దృష్టికి వెళ్ళింది. ఆర్థిక మంత్రి జైట్లీ సైతం ఈ విషయంలో స్పందించి పోలవరం ప్రాజెక్టు పూర్తికి తగిన సహాయసహకారం అందచేస్తామని భరోసానిచ్చారు. అందుకనుగుణంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పోలవరం ప్రాజెక్టు నిర్మాణాన్ని శరవేగంగా కొనసాగిస్తోంది. కేంద్రం సహకారంతో నాలుగేళ్ళలో పోలవరం ప్రాజెక్టును పూర్తి చేస్తామన్న ధీమా వ్యక్తమవుతోంది. పోలవరం పూర్తయితే నవ్యాంధ్రలో విశేషమైన మార్పులు సాధ్యమవుతాయి. ప్రత్యేకించి ఉభయగోదావరి జిల్లాల్లో శాశ్వతంగా తాగునీటికి కొరత ఉండదు.

### పట్టిసీమ- ప్రభుత్వ లక్ష్యం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం అత్యంత ప్రతిష్ఠాత్మకంగా చేపడుతున్న పోలవరానికి దిగువన, ధవళేశ్వరం కాటన్ బ్యారేజీకి ఎగువన పట్టిసీమ వద్ద గోదావరిపై ఎత్తిపోతల నిర్మిస్తారు. రోజుకు 8,500 క్యూసెక్కుల చొప్పున నీటిని సరఫరా చేస్తారు. పోలవరం కుడి ప్రధాన కాలువ ద్వారా నీటిని కృష్ణమ్మకు చేరుస్తారు. బుడమేరు మళ్లింపు పథకం ద్వారా నీరు కృష్ణాలో కలుస్తుంది. పట్టిసీమ ఎత్తిపోతల నుంచి పోలవరం కుడి ప్రధాన కాలువ వరకు నాలుగు కి.మీ.మేర పైప్‌లైన్ నిర్మిస్తారు. వరద కాలంలో 80 టీఎంసీల నీటిని గోదావరి నుంచి తీసుకువెళ్తారు. పట్టిసీమ పూర్తయితే కడప జిల్లాలో 70 టీఎంసీలు, కర్నూలు జిల్లాలో 60 టీఎంసీలు, నెల్లూరు జిల్లాలో 150 టీఎంసీలు నీటిని నిల్వ చేసుకునే అవకాశం కలుగుతుంది. హంద్రీనీవా పూర్తి చేస్తే చిత్తూరు జిల్లా వరకు నీటిని అందించే సౌలభ్యం ఉంటుంది. అలాగే గాలేరు-నగరి పూర్తి చేస్తే గండికోట వరకు నీటిని తీసుకువెళ్ళడానికి అవకాశాలుంటాయి. పట్టిసీమ ప్రాజెక్టు అందుబాటులోకి వస్తే జులైలోనే కృష్ణా డెల్టా ఆయకట్టుకు నీరందించే అవకాశం దక్కుతుంది. నవ్యాంధ్ర రాజధాని పొరుగునే ఉన్న ఏలూరు, విజయవాడ నగరాల్లో పరిశ్రమలు ఏర్పాటు చేయాల్సి ఉంది. ఇందుకు నీరు, విద్యుత్తు, ఇతర మౌలిక సదుపాయాలు అత్యవసరం. పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాల్లో గృహావసరాలకు, పారిశ్రామిక అవసరాలకు పది టీఎంసీల నీటిని సరఫరా చేయాల్సి ఉంది. వీటి అవసరాలకు సైతం పట్టిసీమ ఎత్తిపోతల పథకం సాయపడుతుంది.

### మత్తు వదిలించే నిద్ర

ఏళ్లకేళ్లుగా మత్తులో జోగుతున్న సాగునీటి ప్రాజెక్టుల స్థితిగతులను ఎప్పటికప్పుడు తెలుసుకొని పనుల వేగవంతంపై దృష్టి పెట్టాలన్న ఉద్దేశంతో మే 6 నుంచి ప్రాజెక్టుల వద్ద పనుల తీరును పర్యవేక్షిస్తూ ముఖ్యమంత్రి చంద్రబాబు అక్కడే నిద్ర కార్యక్రమాన్ని నిర్వహించారు. మంత్రులతో పాటు ఇతరులు ప్రాజెక్టుల నిద్రలో పాల్గొన్నారు.

– నీరుకొండ ప్రసాద్

❖

# వెలవెలల విద్యుత్ రంగానికి మళ్లీ వెలుగు

- ఏపీని విద్యుత్ సంక్షోభం నుంచి గట్టెక్కించిన చంద్రబాబు
- 2004 తర్వాత నిర్లక్ష్యానికి లోనైన విద్యుత్ రంగం
- మళ్ళీ చంద్రబాబు సీఎం కావడంతో కరెంటు కష్టాలకు చెక్
- వందరోజుల్లోనే ఏపీలో కరెంటు కోతలు ఎత్తివేత
- గృహావసరాలకు నిరంతర విద్యుత్

చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా కొత్త ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన వెంటనే రాష్ట్రం విద్యుత్ రంగ అభివృద్ధికి ఒక బృహత్తర ప్రణాళిక రూపొందించింది. విద్యుత్ ప్రాజెక్టుల పనితీరు మెరుగుపరచడంతో బాటు, విద్యుత్ నష్టాలను తగ్గించడం, విద్యుత్ ఆదాకు ప్రయత్నించడం, ప్రత్యామ్నాయ ఇంధన వనరులను వినియోగించుకోవడం వంటి ప్రణాళికాంశాలు అమలుతో రాష్ట్రం విద్యుత్ రంగంలో దూసుకు పోతోంది.

1994 నుంచి 2004 వరకు చంద్రబాబు నాయకత్వంలో తెచ్చిన సంస్కరణల వల్ల అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లో విద్యుత్ రంగం వెలుగులు విరజిమ్మింది. కానీ దశాబ్ద కాలం నుంచి రాష్ట్రంలో చీకట్లు కమ్ముకున్నాయి. విద్యుత్ రంగాన్ని నిర్వీర్యం చేశారు. 1994 నుంచి 2004 వరకు 5,634 మెగావాట్ల నుంచి 10,695 మె.వా. సామర్థ్యంతో 90 శాతం పెరుగుదల కనిపించింది. అదే 2004 నుంచి 2014 వరకు 10,695 మె.వా నుంచి 16,917 మె.వా. సామర్థ్యాన్ని మాత్రమే సాధించడంతో 56శాతం పెరుగుదల మాత్రమే చోటు చేసుకుంది. థర్మల్ ఉత్పత్తి కేంద్రాల్లో ప్లాంటు లోడు ఫ్యాక్టర్ చంద్రబాబు ప్రభుత్వ కాలంలో 86 శాతం ఉంటే ఆ తర్వాత 78 శాతానికి పడిపోయింది. థర్మల్ విద్యుత్ ఉత్పత్తి కేంద్రాల్లో బొగ్గు నిల్వలు 30 రోజుల నిల్వకు బదులు ఒక్క రోజుకు పడిపోయింది. ఆంధ్రప్రదేశ్ విభజన జరిగి తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాలుగా ఏర్పడడంతో మరికొన్ని కొత్త సమస్యలు తోడయ్యాయి. విభజనలో జనాభా ప్రాతిపదికన కాకుండా గత ఐదేళ్ళ వాడకం బట్టి విద్యుత్ కేటాయింపులు జరగడంతో ఆంధ్రప్రదేశ్‌కు విద్యుత్‌లో భారీ లోటు ఏర్పడింది.

విభజన జరిగిన నవ్యాంధ్రప్రదేశ్‌లో ముఖ్యమంత్రిగా చంద్రబాబు అధికారం చేపట్టే నాటికి రాష్ట్రంలో రోజువారి డిమాండ్ 151.21మిలియన్ యూనిట్లు ఉండగా, విద్యుత్ సరఫరా 134.36 మిలియన్ యూనిట్లు సరఫరా చేయగలుగుతున్నారు. లోటు 16.85 మిలియన్ యూనిట్లు. దాంతోపాటు ఆంధ్రప్రదేశ్ కేటాయింపుల్లో జల విద్యుత్ వాటా తక్కువగా వుండటం, థర్మల్ స్టేషన్లకు బొగ్గు కొరత ఏర్పడటం, గ్యాస్ సరఫరా లేకపోవడంతో విద్యుత్ ఉత్పత్తి యూనిట్లలో పూర్తి సామర్థ్యం కొరవడింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో విద్యుత్ లోటు తగ్గించేందుకు ముఖ్యమంత్రి చంద్రబాబు అధికారం చేపట్టిన నాటి నుంచి తీవ్ర స్థాయిలో ప్రయత్నాలు మొదలుపెట్టారు. విద్యుత్ లోటును ఎదుర్కొనేందుకు తీసుకోదగ్గ అన్ని మార్గాలపై అన్వేషణ ఆరంభించారు.

## తీసుకొన్న చర్యలేమిటి?

జులై 2014 నుండి మార్చి, 2015 వరకు ఎన్టీపీసీ జజ్జర్ నుండి 200 మె.వా. విద్యుత్తును పొందగలిగారు. 1,170 మె.వా. విద్యుత్తును కొనుగోలు చేశారు. రాష్ట్రంలోనున్న 10,648 విద్యుత్తు ఫీడర్లను పూర్తి పర్యవేక్షణలో ఉండేటట్లు చేయగలిగారు. ఫిబ్రవరి, 2015లో 800 మె.వా. కృష్ణ పట్నం-1 యూనిట్ కమర్షియల్ ఆపరేషన్ జరిగి, 300 నుంచి 400 మె.వా. ప్రయోగాత్మక విద్యుత్తు ఉత్పత్తి జరిగింది. జూన్ 2015 నుండి మే 2016 వరకు 2055 మె.వా. విద్యుత్తు కొనుగోలు నిమిత్తం ఉత్తర్వులు జారీ అయ్యాయి. రాష్ట్ర విద్యుత్ పంపిణీ సంస్థలు (డిస్కాంలు) దీర్ఘకాలిక ప్రాతిపదికన 2400 మె.వా. విద్యుత్తు కొనుగోలుకు టెండర్లను ఆహ్వానించాయి. మహానది బొగ్గు గనుల నుంచి బొగ్గు సరఫరా 49 శాతం నుంచి 67శాతానికి పెంచుకొని, విద్యుత్ కేంద్రాల ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంచగలిగారు. 619 మె.వా. సోలార్ విద్యుత్ ఉత్పత్తికి పవర్ పర్చేజ్ అగ్రిమెంట్లు జరిగాయి.

## ఈ స్కీము ప్రయోజనాలు

కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన 'అందరికీ విద్యుత్ (పవర్ టు ఆల్) స్కీములో మూడు రాష్ట్రాల్లో ఆంధ్రప్రదేశ్ ఒకటి. జనవరి 2015 నుండి ఎన్పీసీఐఎల్ కుడంకుళం అణువిద్యుత్ కేంద్రం నుండి 50 మె.వా. విద్యుత్‌ని సాధించింది. వెస్టర్న్ కోల్ ఫీల్డ్స్ (డబ్ల్యూ సీఎల్) నుండి 1 మి. టన్నుల బొగ్గు, మహానది కోల్ ఫీల్డ్స్ (ఎంసీఎల్) నుండి 49 శాతం నుండి 67 శాతానికి బొగ్గు సరఫరా వెసులుబాటును కేంద్రం కల్పించింది. పుడిమడక వద్ద ఎన్టీపీసీ ఆధ్వర్యంలో 4000 మె.వా. అల్ట్రా మెగా సూపర్ క్రిటికల్ పవర్ ప్రాజెక్టును నెలకొల్పనున్నారు. అనంతపురంలో ఎన్టీపీసీ ఆధ్వర్యంలో 1000 మె.వా., కర్నూలు జిల్లాలో మరో 1000 మె.వా. రెండు అల్ట్రా మెగా సోలార్ పార్కులను కేంద్ర ప్రభుత్వం మంజూరు చేసింది. కేంద్ర ప్రభుత్వం వీటి అమలు కోసం రూ 500 కోట్లు మంజూరు చేసి రూ 124 కోట్లు ఇప్పటికే అందజేసింది.

అనంతపురం సోలార్ పార్క్ నుండి ఉత్పత్తి అయ్యే విద్యుత్‌ను సరఫరా చేయడానికి సరఫరా వ్యవస్థను మరియు అంగుల్ నుండి వేమగిరికి 765 కె.వి. పవర్ సర్క్యూట్ లైన్‌ను పీజీసీఐఎల్ నిర్మిస్తోంది. వచ్చే ఐదేళ్లలో 50 వేల సోలార్ పంపుసెట్ల ఏర్పాటుకు ఏపీ డిస్కమ్స్ ప్రణాళికలు సిద్ధం చేసుకున్నాయి. వీటి అమలులో భాగంగా 6,725 సోలార్ పంపు సెట్లు అమర్చడానికి కేంద్రం రూ 110 కోట్లు మంజూరు చేసింది. ఇంటిగ్రేటెడ్ పవర్ డెవలప్‌మెంట్ స్కీమ్ (ఐపీడీఎస్), దీన్‌దయాళ్ ఉపాధ్యాయ్ గ్రామ్ జ్యోతి యోజన స్కీముల్లో భాగంగా రూ.750 కోట్లు మంజూరు చేసింది. రాష్ట్రంలో 2.6 కోట్ల ఇన్‌కాండిసెంట్ బల్బుల స్థానే ఎల్ఇడీ బల్బులు అమర్చే కార్యక్రమం చేపట్టింది. ఎనర్జీ ఎఫిషియన్సీ సర్వీసెస్ లిమిటెడ్ అన్న సంస్థ ఇప్పటికే అనంతపురం, గుంటూరు, శ్రీకాకుళం, పశ్చిమ గోదావరి జిల్లాలలో 47 లక్షల బల్బులు పంపిణీ జరిపింది. 2013-14లో 13.89 శాతంగా నున్న అగ్రిగేట్ ట్రాన్స్‌మిషన్ అండ్ కామన్ లాసెస్ (ఏటీ అండ్ సీ) ను ఫిబ్రవరి, 2015 నాటికి 12.60 శాతానికి తగ్గించడం జరిగింది. రాష్ట్ర ప్రజలకు నిరంతరాయ మెరుగైన విద్యుత్ సరఫరా వల్ల 2013-14లో సరఫరా అయిన విద్యుత్ కంటే ఇప్పుడు, అంటే 2014-15లో 13.56 శాతం విద్యుత్ వినియోగం పెరిగింది. రాష్ట్రంలో సాంప్రదాయేతర విద్యుత్ సామర్థ్యం పెంచడానికి 2018-19 నాటి కల్లా రాష్ట్రంలో 4150 మె.వా. పవన విద్యుత్తు, 5000 మె.వా. సౌర విద్యుత్తు సామర్థ్యం చెయ్యాలనే తలంపుతో రాష్ట్ర ప్రభుత్వం ఒక కొత్త సోలార్ అండ్ విండ్ పాలసీని ప్రవేశపెట్టింది.

## విద్యుత్ ఛార్జీలు పెంచలేదు

రాష్ట్రంలో 2010 నుండి 2014 వరకు రూ.13,105 కోట్లు (11శాతం) విద్యుత్ ఛార్జీలు పెంచారు. 2014-15లో అంటే మార్చి 2015 వరకు వినియోగదారులపైన విద్యుత్ ఛార్జీల భారం పడలేదు. బొగ్గు, గ్యాస్ లాంటి ఇంధన వ్యయం, వాటి రవాణా కయ్యే ఖర్చులు పెరగడం వల్ల తప్పని పరిస్థితుల్లో అత్యంత స్వల్పంగా 5 శాతం మేరకే, అంటే రూ.897 కోట్ల మేరకే విద్యుత్ ఛార్జీలను ఏప్రిల్, 2015 నుండి పెంచారు. మిగిలిన రూ.3186 కోట్ల రెవెన్యూలోటును రాష్ట్ర వ్యవసాయదారులకు ఉచిత విద్యుత్ సరఫరా ఇస్తున్నందున రాష్ట్ర ప్రభుత్వం సబ్సిడీ రూపేణ భరిస్తుంది. నెలకు 200 యూనిట్లకు లోబడి విద్యుత్తును వినియోగించే గృహ వినియోగదారులకు, నెలకు 100 యూనిట్లకు లోబడి వినియోగించే వాణిజ్య వినియోగదారులకు, వ్యవసాయ వినియోగదారులకు, రొయ్యలు, పౌల్ట్రీలు, కుటీర పరిశ్రమలు, కాటేజ్ ఇండస్ట్రీస్, షుగర్‌కేన్ క్రషింగ్, ధోబీఘాట్లు లాంటి పరిశ్రమలను, చిన్న చిన్న దేవాలయాలు, మసీదులకు ఈ ఛార్జీల భారం నుండి మినహాయించారు.



వి ఎస్ ఆర్ నాయుడు
విద్యుత్ రంగ నిపుణులు



# ఆచరణంలో ఆదర్శం

## మండు వేసవిలో నిండు చెరువు

విధాన నిర్ణేతల ఆదర్శాలు, పథకాలు చాలా వరకూ కాగితాల్లో, రికార్డుల్లో భద్రంగా ఉంటాయని ఎప్పుడూ వినిపించే ఒక జోక్. పథకాల్ని భూమార్గం పట్టించి ఆచరణ ఆవరణల్లోకి తీసుకు వెళ్లాల్సిన వారి చిత్తశుద్ధి మీద ఆ జోక్ ఒక విసురు. చంద్రబాబు నాయుడు రాష్ట్ర సారథిగా అధికారం చేపట్టినప్పటి నుంచి దృష్టిపెట్టిన ప్రధానాంశాలలో భూగర్భ జలాలు పెంపు ఒకటి. భూగర్భ జలాలు పెంచడం ద్వారా కరవు ఛాయలు రాష్ట్రంపై పడకుండా చూడాలన్నది ఆయన తపన. దాని ఫలితమే, నీరు–చెట్టు కార్యక్రమం. ఆ కార్యక్రమ ఆదర్శాల్ని కాగితాలకి పరిమితం చేయకుండా, ఆచరించి చూపింది విజయనగరం జిల్లా మెరకముడిదాం మండలంలోని బుదరాయవలస గ్రామం.

ఆ గ్రామంలో దాసరి చెరువు ఆరు ఎకరాల విస్తీర్ణంలో వుంది. ఎండాకాలంలో ఆ ఆరు ఎకరాల చెరువు నెర్రలిచ్చి నీటి చుక్కకోసం అంగలార్చుతుంది సహజంగానే. కానీ, అంతకంటే సహజంగా మరొక విచిత్రం జరిగింది. మండువేసవిలో నీటితో నిండి కళకళలాడుతోంది. ఈ చెరువు కింద రబీ పంటకు అసలు అవకాశమే లేదు. కానీ నేడు 50 ఎకరాల విస్తీర్ణానికి నీరందుతోంది. 30 అడుగుల లోతు నుంచి మూడు అడుగుల లోతుకు భూగర్భ జలమట్టం పెరిగింది. ఇదీ నీరు–చెట్టు విజయం, ఆదర్శాన్ని ఆచరణయోగ్యం చేసిన గ్రామస్థుల విజయం, అదే, దాని రూపకర్త చంద్రబాబు నిజమైన విజయం.

### చేయి చేయి కలిపి?

దాసరి చెరువు రిజిష్టరు ఆయకట్టు 20 ఎకరాలు అయినప్పటికీ 50 ఎకరాలకు పైగా దానికిందే ఆధారపడి వుంది. చిన్న నీటి వనరు కాబట్టి ఈ చెరువు మూడుసార్లు నిండితేనే వరి పండుతుంది.

నీరు–చెట్టు కార్యక్రమంలో 19 లక్షల అంచనా వ్యయంతో దాసరి చెరువు పనిని ఫిబ్రవరి 2015లో ప్రారంభించారు. 30 శ్రమశక్తి సంఘాల్లో 370మంది వేతనదారులు ఏడు వారాలు చేయిచేయి కలిపారు. మొత్తం 4996 పనిదినాలు. రూ. 9,61,857 వేతనంగా ఖర్చుచేయగా, జిల్లా నీటి యాజమాన్య సంస్థ, ఉపాధి హామీ పథకం సిబ్బంది ఈ పనిని పర్యవేక్షించారు.

ఈ చెరువు కింద రబీ పంటలకు అవకాశమే లేదు. అయితే చెరువు పరిధిలో మూడు బోర్లు, నాలుగు నూతుల సాయంతో పంటలు పండిస్తున్నారు. రబీ కాలంలో మొక్కజొన్న, కూరగాయల సాగు చేశారు. నీరు పనులు జరుగుతూ ఉండగానే, మార్చి 15న కురిసిన 20 మిల్లీమీటర్ల వర్షంతోనే చెరువులో బాగా నీరు చేరింది. చెరువు చుట్టుపక్కల ఉన్న బోర్లు, నూతులు నీటితో కళకళ లాడుతున్నాయి.



చెరువు పని 41 శాతం మాత్రమే జరిగింది. ప్రస్తుతం నీరుండటంతో పని ఆగింది. ప్రస్తుతం అక్కడ వేసవి పంటలైన నువ్వులు, వేరుశనగ, కూరగాయలు సాగు చేస్తున్నారు.

### అందరి కోసం ఒక్కడు నిలిచి ఒక్కడి కోసం అందరు కలిసి...

తమ అందరి సామూహిక ప్రయోజనం కోసం ముఖ్యమంత్రి అహర్నిశలు ఆలోచించి, పథకాల ఫలాల్ని అందించాలని ప్రయత్నిస్తుంటే, ఆ నాయకుడి కోసం మా వంతు కృషిచేశామని చెబుతున్నారు ఆయకట్టు రైతులు గొర్లి రామునాయుడు, కృష్ణమూర్తి, గిరిజాల భాస్కరరావు, సూరినాయుడు తదితరులు. తమ పశువులకు, పంటలకు నీటి ఆధారం దొరికినందుకు తమ చెరువు వేసవిలో కూడా నీటితో కళకళలాడుతున్నందుకు పట్టరాని ఆనందంగా వుందంటున్నారు.

– జానకమ్మ,
సహాయ ప్రజాసంబంధాల అధికారి
విజయనగరం

# శ్రమైక జీవన సౌందర్యానికి సంక్షేమ హారం!

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాభివృద్ధి కోసం పెట్టుబడుల పట్ల సానుకూల వైఖరి ఒక పక్క, అదే సమయంలో కార్మిక సంక్షేమ సాధన మరో పక్క- ఇదీ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు హయాంలోని రాష్ట్ర ప్రభుత్వ ప్రత్యేకత. ఒకదానికొకటి విరుద్ధాంశాలుగా తోచే పారిశ్రామికాభివృద్ధి- కార్మిక సంక్షేమం అనే జంట కార్యాలు విజయవంతంగా సాధించడానికి నాయకుడికి ముఖ్యంగా ఉండవల్సింది- దార్శనికత. రాష్ట్ర విభజన మూలంగా కొత్త రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నప్పటికీ, దార్శనికుడైన ముఖ్యమంత్రి కార్మిక సంక్షేమానికి పెద్దపీట వేశారు. వారి శ్రమైక జీవన సౌందర్యానికి ప్రతిఫలంగా, సంక్షేమ హారాన్ని బహూకరించారు.

అందులో భాగంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలో సంఘటిత, అసంఘటిత రంగాల్లో పని చేస్తున్న లక్షలాది మంది కార్మికుల సంక్షేమం కోసం ప్రత్యేక చర్యలు చేపట్టింది. ఇందుకుగాను రాష్ట్ర చరిత్రలో ఎన్నడూ లేని విధంగా వివిధ సంక్షేమ కార్యక్రమాలకు నిధులను అధికంగా కేటాయించింది. దీని వల్ల కార్మికులకు వారి కుటుంబ సభ్యులకు పెద్ద ఎత్తున లబ్ధి చేకూరుతోంది. ఏళ్ళకు తరబడి మార్పులు లేకుండా కార్మికులకు ప్రయోజనం చేకూర్చని చట్టాలకు సవరణలు చేయడం, తద్వారా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కార్మిక పక్షపాతిగా వ్యవహరించారు. ఆయన సూచనల మేరకు కార్మిక సంఘాల నేతలు అధికారులతో విస్తృత చర్చలు జరపడం ద్వారా కార్మిక మంత్రి అచ్చెన్నాయుడు కార్మిక చట్టాల సవరణకు కృషి చేశారు.

## అసంఘటిత కార్మికులకి బీమా అండ

అసంఘటిత కార్మికుల చట్టం 2008 ప్రకారం అసంఘటిత రంగంలో పని చేస్తున్న ఒక కోటి మంది కార్మికులకు రూ.5 లక్షల బీమా పథకానికి శ్రీకారం చుట్టారు. జీ.వో.నెం.10, లేబర్ డిపార్ట్‌మెంట్ తేది.25.04.2015 ద్వారా ఆదేశాలు జారీ చేసింది.

దేశంలోనే మొట్టమొదటిసారిగా ఆంధ్రప్రదేశ్‌లో డ్రైవర్లకు రూ.5 లక్షల ప్రమాద బీమా కల్పించడం ద్వారా సుమారు 8 లక్షల మంది డ్రైవర్లకు ప్రయోజనం చేకూరనుంది. ఆంధ్రప్రదేశ్ ట్రాన్స్‌పోర్టు డ్రైవర్ల సామాజిక భద్రత పథకం కింద ఈ కార్యక్రమం ముఖ్యమంత్రి చేతుల మీదుగా రాజమండ్రి పట్టణంలో మేడే - 2015 నాడు ప్రారంభమైంది. ప్రమాద బీమాతో పాటుగా ఇద్దరు చదువుకునే పిల్లలకు రూ.1200 స్కాలర్‌షిప్ కూడా ఇవ్వనున్నారు.

ఎన్నో ఏళ్ళుగా మగ్గుతున్న కార్మిక సంక్షేమ మండలి చట్టం 1987కు 2015చట్ట సవరణ ద్వారా మండలి బలోపేతానికి కృషి చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ కార్మిక సంక్షేమ నిధి చట్టం 2015 సవరణ ద్వారా కార్మికులు 10 కన్నా ఎక్కువ మంది పని చేస్తున్న ఆస్పత్రులు, నర్సింగ్ హోమ్‌లు, విద్యాసంస్థలు, వివిధ ప్రభుత్వ శాఖలలో పని చేస్తున్న కాంట్రాక్టు మరియు ఔట్ సోర్సింగ్ కార్మికులు ఈ చట్టం పరిధిలోకి వస్తారు. పైన తెలిపిన పథకాలన్నీ వీరికి కూడా వర్తిస్తాయి.

2010-11 నుంచి 2014-15వరకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కార్మిక సంక్షేమ మండలి ద్వారా అమలు జరుగుతున్న విద్య ప్రోత్సాహం, ప్రత్యేక విద్య ప్రోత్సాహం, వైద్య సహాయం, ప్రమాద మరణ ఆర్థిక సహాయం, సహజ మరణ ఆర్థిక సహాయం, ప్రసూతి సహాయం, వివాహ కానుక, అంగ వైకల్యానికి ఆర్థిక సహాయం వంటి వివిధ పథకాల ద్వారా 27,400 మంది కార్మికులు 900 కోట్ల రూపాయలు లబ్ధి పొందారు.

గతంలో కార్మికుడు, యాజమాన్యం మండలికి చెల్లించాల్సిన చందా రూ.2, రూ.5 గా వుండేది. ప్రస్తుత ప్రభుత్వం దాన్ని రూ.30, రూ.70 గా చేసింది. తద్వారా మండలి బలోపేతానికి ప్రభుత్వం నడుం బిగించింది. తద్వారా మండలికి ఆర్థిక పరిపుష్టి చేకూరడమే కాకుండా కార్మికులకు సంక్షేమ కార్యక్రమాలను పెద్ద ఎత్తున చేపట్టడానికి వీలవుతుంది.

### అంతకు అంత పెరిగిన సాయం

పైన తెలిపిన చందా పెంపుదల జనవరి, 2016 నుండి అమలులోనికి రానున్నందున దానికి అనుగుణంగా సంక్షేమ పథకాల లబ్ధి పెంపు కూడా ఏప్రిల్, 2016 నుండి అమలులోకి రానుంది. దానికి కొన్ని నియమ నిబంధనలు సూచించారు.

- కార్మికుడు ప్రమాదవశాత్తు మరణించినట్లయితే ప్రస్తుతమున్న రూ.30 వేల ఆర్థిక సాయాన్ని రూ.2.50 లక్షలకు పెంచారు. ఇందులో రూ.1 లక్ష తక్షణ సహాయంగానూ మిగతా రూ.1.50 లక్షలను నెలసరి పెన్షన్ రూపంలో (నెలకు రూ.1000 చొప్పున) వారి కుటుంబ సభ్యులకు అందిస్తారు.
- కార్మికుడు సహజంగా మరణించినట్లయితే ప్రస్తుతం రూ.10 వేల ఆర్థిక సహాయాన్ని రూ.50 వేలకు పెంచారు.
- కార్మికుడు ప్రమాదవశాత్తు పని చేస్తున్న చోట శాశ్వత అంగ వైకల్యానికి గురయితే ప్రస్తుతం రూ.25వేల ఆర్థిక సహాయం ఇస్తుండగా, దానిని రూ.2.50 లక్షలకు పెంచారు. వీటిలో రూ.1 లక్ష తక్షణ సహాయంగానూ, మిగతా రూ.1.50 లక్షలను నెలసరి పెన్షన్ రూపంలో (నెలకు రూ.1000 చొప్పున) అందిస్తారు.
- కార్మికుల వైద్య సహాయం ఖర్చును ప్రస్తుతం ఉన్న రూ.20 వేల నుండి 50 వేలకు పెంచారు.
- మరణించిన కార్మికులకి అంత్యక్రియల కోసం ఆర్థిక సహాయం రూ.5 వేల నుండి రూ.10 వేలుగా నిర్ణయించారు.
- ప్రసూతి సహాయం రూ.5 వేల నుండి రూ.15 వేలకు పెంపు అమలవుతుంది.
- కార్మికుల పిల్లల్లో ప్రతిభ గల 10వ తరగతి (లేదా) ఐటీఐ చదువుతున్న విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు రూ.1వేయి నుండి రూ.2వేల వరకు వుండగా, దీనిని జిల్లాకు 25 మంది (డిగ్రీ /బీటెక్ / ఎంబీబీఎస్ చదువుతున్న) విద్యార్థుల చొప్పున రూ.10 వేలకు పెంచుతారు.
- అంగవైకల్యం గల విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు రూ.2 వేల నుండి రూ.5 వేలకు పెంచుతారు.
- ఒక్క సంతానం కలిగిన కుటుంబాలకు కుటుంబ నియంత్రణ ప్రోత్సాహకం రూ.2 వేల నుండి రూ.5వేలకు పెంచుతారు.
- ప్రస్తుతం ఉన్న వివాహ బహుమతి కింద ఆర్థిక సహాయం రూ.10 వేల నుండి రూ.12 వేలకు పెంపు. దీనిని ఆడపిల్ల పుడితే ఇచ్చే ప్రోత్సాహక పథకంగా మార్చి రూ.12 వేలతో ఆమె పేర నిధి ఏర్పాటు చేయడం ద్వారా, రూ.1 లక్ష మెచ్యూరిటీ ఉండే విధంగా చేస్తారు.

### పాత చట్టాల బూజు దులిపి

పారిశ్రామిక ప్రగతికి, కార్మికుల సంక్షేమానికి, ఏళ్ళతరబడి బూజుపట్టిన వివిధ చట్టాలకు రాష్ట్ర ప్రభుత్వం పలు సవరణలను చేసింది.

సంక్షేమ నిధి చట్టం 1987కు సవరణ ద్వారా..

- సూపర్ వైజరీ కేటగిరి ఉద్యోగులకు వేతన పరిమితి లేదు.
- అన్ని ఫ్యాక్టరీలు ఈ చట్ట పరిధిలోకి వస్తాయి.
- వివాదాలు 2వ తరగతి న్యాయాధికారి కోర్టుకు తగ్గింపు

### పారిశ్రామిక వివాదాల చట్టం 1947కు సవరణ ద్వారా

- కార్మికుల తొలగింపునకు సంబంధించి 3 సంవత్సరాల లోపు కార్మిక శాఖ లేదా కోర్టు ముందు వివాదం దాఖలు చేయాలి.
- ఉద్యోగుల పరిమితి 100 నుండి 300కు పెంచారు.
- పని మందగింపునకు సంబంధించి వివరణ పొందుపరచారు .

### ఫ్యాక్టరీ చట్టం (1948)కు సవరణ ద్వారా

- విద్యుత్ పై ఆధారపడి కార్మికుల సంఖ్య 10 నుండి 20వరకు పెంచారు. విద్యుత్‌పై ఆధారపడకుండా 20 నుండి 40 కు పెంచారు.
- చట్టం ఉల్లంఘన జరిగితే యజమానిని ప్రాసిక్యూట్ చేయడానికి ప్రభుత్వం యొక్క లిఖిత పూర్వక అనుమతి తప్పనిసరి. కేసుల తక్షణ పరిష్కారం.
- చిన్న కేసులు సత్వర పరిష్కారానికి కాంపెండింగ్ చేయడం.

దేశంలోనే మొట్ట మొదటిసారిగా ఇంటిగ్రేటెడ్ చట్టం అనే నూతన చట్టం ద్వారా అన్ని కార్మిక చట్టాల కింద ఒకే లైసెన్సు 3 సంవత్సరాల కాల వ్యవధికి గాను ఇవ్వాలని, ఒకే రిటర్న్ సంవత్సరానికి ఫైల్ చేయాలనీ కొత్త చట్టం తెచ్చారు.

కాంట్రాక్టు రెగ్యులరైజేషన్ మరియు రద్దు చట్టంకు సవరణ ద్వారా కనీస కార్మికుల సంఖ్యను 20 నుండి 50 కు పెంచారు.

లక్షలాది అసంఘటిత భవన నిర్మాణ కార్మికుల సంక్షేమానికి ప్రయోజనం చేకూర్చడానికి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు నాయకత్వంలో పలుచర్యలు చేపట్టారు.

భవన మరియు నిర్మాణరంగ కార్మికుల సంక్షేమ మండలి ద్వారా అవిభక్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 15 లక్షల మంది కార్మికులు నమోదు చేసుకున్నారు. ఒక శాతం సెస్ విధించడం ద్వారా రూ.894 కోట్ల నిధిని సేకరించి, వారి యొక్క సంక్షేమానికి ఈ క్రింది పథకాల ద్వారా లబ్ధిని చేకూర్చుతున్నారు.

- ప్రమాదవశాత్తు మరణించినట్లయితే : రూ. 2 లక్షలు
- శాశ్వత అంగవైకల్యానికి గురైతే : రూ.25 వేల నుండి 2లక్షల వరకు
- సహజ మరణానికి : రూ. 30 వేలు
- ప్రసూతి సహాయం : రూ. 10 వేలు
- తాత్కాలిక అంగవైకల్యానికి గురైతే : రూ.,4,500 వరకు
- అంత్యక్రియల ఖర్చులకు : రూ. 10 వేలు
- సేఫ్టీ మరియు నైపుణ్య శిక్షణ కొరకు : రూ.8 వేలు (ఒక కార్మికుడికి)
- పెన్షన్ స్కీం : రూ. 3 వేలు (సంవత్సరానికి)
- వివాహ బహుమతి : రూ. 10 వేలు

నమోదు చేసుకోని కార్మికులకు అందిస్తున్న ఆర్థిక సహాయం వివరాలు :

- ప్రమాద మరణం : రూ. 50 వేలు
- శాశ్వత అంగవైకల్యం : రూ. 10 నుండి రూ.20 వేలు

పై పథకాలన్నింటిలోనూ అమలులో ఉన్న లబ్ధి మొత్తాలను తగు విధంగా పెంచేందుకు తగు చర్యలు తీసుకుంటుంది. తద్వారా రాష్ట్రంలోని కార్మికుల సంక్షేమానికి ఈ ప్రభుత్వం కట్టుబడి ఉంది.కార్మికుల స్వేదానికి ఖరీదు కట్టే షరాబులు లేరన్నది నిజమే గానీ, వెలలేని ఆ చెమట చుక్కే జాతి ప్రగతి రథానికి ఇంధనం అని గుర్తించి, గౌరవించిన కార్మికుల నవాబు– చంద్రబాబు.

– బందారుపల్లి మురళి
మీడియా లైజనింగ్ అధికారి, కార్మిక, ఉపాధి శాఖ



# కోనసీమ ఇక కొత్త బంగారు లోకం!

అక్కడక్కడా పిచ్చికగూళ్లలా ఊళ్లు, పల్లే పల్లేనా ఆలయాలు, వయ్యారి మెలికల పిల్లకాల్వలు, వడి వడి పరుగుల గౌతమి గోదారి ఆదరినీ... ఈదరినీ- వెరసి ఉభయగోదావరి జిల్లాలు మొత్తం చిగురాశపచ్చ తోట! ఇలాంటి ఆహ్లాదకర వాతావరణం ఉన్న గోదావరి జిల్లాల పరిసర ప్రాంతాలకు అంతర్జాతీయ పర్యాటకులు వెల్లువెత్తేలా, ఈ ప్రాంతాన్ని అభివృద్ధి చేసేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కంకణం కట్టుకుంది. ఇటువంటి ప్రయత్నాలతో రాబోయే ఐదేళ్లలో పర్యాటక రంగంలో రూ. 10 వేల కోట్ల ప్రైవేటు పెట్టుబడులను ఆకర్షించాలన్నదే ప్రభుత్వ లక్ష్యం



'కొబ్బరాకు గాలి మబ్బు కేసింది, ఉలికి పడ్డా మబ్బు ఉరిమి చూసింది..' అన్నాడొక సినీకవి. గోదావరి జిల్లాలు, ముఖ్యంగా కోనసీమ కవులకి, కళాకారులకీ ఎప్పటికీ ఓ పచ్చని ప్రేరణ. పావన గోదారి పాదాలు కడిగి, వెదురుతోపులన్నీ వేదాలు చదివి, ఏటిమీద పడవ పాట ఎదఎదను మీటుతుందని బాణీలు కడుతుంటాయి కోనసీమ కవి కోయిలలు. పాపికొండలు, కొల్లేరు, మారేడుమిల్లి అడవులు, మడ అడవులు.. ఇవన్నీ మోహరించి ఉన్న కోనసీమ ప్రాంతం మరిన్ని కొత్త అందాలు సంతరించుకుంటే పర్యాటకుల స్వర్గం అవుతుందనడంలో సందేహం లేదు.

రాష్ట్రంలో ప్రాచుర్యం పొందిన పిక్నిక్ కేంద్రాలలో ఒకటైన ఈ ప్రదేశానికి జాతీయ, అంతర్జాతీయ పర్యాటకులు వెల్లువలా తరలివచ్చేందుకు వీలుగా ఈ ప్రాంతాలను తీర్చిదిద్దాలని చంద్రబాబు నాయుడు ప్రభుత్వం ప్రణాళికలు సిద్ధం చేస్తోంది.

ఆంధ్రప్రదేశ్ పర్యాటక శాఖ ఇప్పటికే ఈ దిశగా అడుగులు వేస్తోంది. కాకినాడ సమీపంలోని హోప్ ఐలండ్ - కోనసీమ సర్క్యూట్ పర్యాటక ప్యాకేజి ఒకదాన్ని తన కొత్త ప్రాజెక్టుగా చేపడుతోంది. కాకినాడను ప్రముఖ పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దాలని తలపెట్టిన సీఎం చంద్రబాబు నాయుడు రూ. 70 కోట్ల పర్యాటక ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. ఇందులో కాకినాడ బీచ్, హోప్ ఐలండ్, కోనసీమ ప్రాంతం ఒక సర్క్యూట్‌గా పేర్కొన్నారు.

ఈ ప్రాజెక్టుకు కేంద్ర ప్రభుత్వం 'స్వదేశీ దర్శన్' పథకం కింద నిధులు సమకూర్చనుండటంతో, అంతర్జాతీయ బిడ్డర్ల నుంచి సమగ్ర ప్రాజెక్టు నివేదిక (డీపీఆర్) సిద్ధం చేయాల్సిందిగా కోరుతూ పర్యాటక శాఖ టెండర్లు పిలవనుంది.

"అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు ఉన్నవారిని డీపీఆర్ తయారీలో భాగస్వాములు చేయాలన్నది మా లక్ష్యం. వాళ్లకు అంతర్జాతీయ పర్యాటకం నుంచి వచ్చే ఆదాయం గురించి బాగా తెలుసు కాబట్టి, వాళ్లు రూపొందించే ప్రాజెక్టు వల్ల విదేశీ-యులు బాగా వస్తారు" అన్న విశ్వాసాన్ని ఆంధ్రప్రదేశ్ పర్యాటక, సాంస్కృతిక శాఖ ముఖ్య కార్యదర్శి నీరభ్ కుమార్ ప్రసాద్ వ్యక్తం చేశారు.

రాబోయే ఐదేళ్లలో పర్యాటక రంగానికి రూ. 10వేల కోట్ల పెట్టుబడులు రావాలని లక్ష్యంగా పెట్టుకున్న రాష్ట్ర ప్రభుత్వం, 2015-16 సంవత్సరంలో కనీసం రూ. వెయ్యి కోట్లతో ప్రారంభించాలని భావిస్తోంది. అయితే, అంతర్జాతీయ పర్యాటకులు భారీ సంఖ్యలో వస్తేనే ఇది సాధ్యమవుతుంది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో అంత పరిస్థితి లేదు.

"2013 సంవత్సరంలో స్వదేశీ పర్యాటక రంగంలో ఆంధ్రప్రదేశ్ మూడో స్థానంలో నిలిచింది. అంతర్జాతీయ పర్యాటకం విషయానికొస్తే, జాతీయస్థాయిలో 19వ స్థానంలో ఉన్నాం. ఈ లెక్కలను బట్టి చూస్తే, అంతర్జాతీయ పర్యాటకులను ఆకట్టుకోడానికి చాలా చేయాల్సి ఉంటుంది," అని నీరభ్ కుమార్ ప్రసాద్ తెలిపారు.

ప్రస్తుత పర్యాటక ప్రాజెక్టుకు రూ. 70 కోట్లు కేటాయించాలని ప్రభుత్వం నిర్ణయించినా, పర్యాటక శాఖ మాత్రం ప్రైవేటు భాగస్వాముల నుంచి ప్రభుత్వ- ప్రైవేటు భాగస్వామ్య పద్ధతిలో టెండర్లు

పిలిచి, రూ. 300 కోట్లతో ప్రాజెక్టు చేపట్టాలని భావిస్తోంది.

గతంలో అయితే పర్యాటకరంగంలోని కొన్ని ప్రధానమైన మౌలిక సదుపాయాల ప్రాజెక్టులకు ఏపీ పర్యాటకాభివృద్ధి కార్పొరేషన్ (ఏపీటీడీసీ) లేదా కేంద్ర ప్రభుత్వం నిధులు సమకూర్చేవి. కానీ కొత్త విధానంలో మాత్రం రాష్ట్ర ప్రభుత్వం కేవలం ఫెసిలిటేటర్ గానే వ్యవహరిస్తూ, ప్రైవేటు పెట్టుబడులను భారీస్థాయిలో తీసుకొచ్చేలా చూస్తుంది.

వ్యాట్ సహా మరికొన్ని రకాల రాయితీలు, ప్రోత్సాహకాలు ఇవ్వాలని ప్రభుత్వం భావిస్తుండటంతో ఈ రంగంలో వ్యాపారం చేయడం మరింత సులభతరం అవుతుందని ప్రభుత్వ వర్గాలు అంటున్నాయి. విశాఖ- భీమిలి కారిడార్ సహా మరికొన్ని ప్రాంతాల్లో రూ.18,000 కోట్లతో బీచ్ రిసార్టుల అభివృద్ధి, అందాల కోనసీమలో రివర్ సైడ్ రిసార్టులు, మొత్తం 13 జిల్లాల్లోను ఒక్కో చోట రోప్ వే ప్రాజెక్టు, ప్రతి జిల్లాలోను క్రూయిజ్/చిన్న బోట్లు, అత్యాధునిక సదుపాయాలతో కన్వెన్షన్ సెంటర్ల లాంటి కొన్ని ప్రాజెక్టులను రాష్ట్ర పర్యాటక కార్పొరేషన్ ఇప్పటికే గుర్తించింది. ఇంకా ఎమ్యూజ్ మెంట్ పార్కులు, హోటళ్లు, వాటర్ స్పోర్ట్స్, లైట్ అండ్ సౌండ్ షోలు, వారసత్వ ప్రదేశాల అభివృద్ధి, పుణ్యక్షేత్రాలు, బౌద్ధ సర్క్యూట్ లాంటివి కూడా అభివృద్ధి చేసే యోచనలో ఉన్నారు. స్విట్జర్లండ్ కు చెందిన ఓ కంపెనీ వాటర్ పార్కు అభివృద్ధికి ఆసక్తి చూపించగా, మరో భారతీయ సంస్థ వినోద రంగాన్ని ఎంచుకుంది. ప్రపంచంలోనే ప్రసిద్ధి చెందిన తిరుమల తిరుపతికి వచ్చేవారితో కలిపి ఆంధ్రప్రదేశ్‌కు ఏడాదికి సుమారు 9.8 కోట్ల మంది పర్యాటకులు వస్తుంటారు. 2020 నాటికి ఈ సంఖ్యను దాదాపు రెట్టింపు చేయాలని రాష్ట్ర పర్యాటక శాఖ లక్ష్యంగా పెట్టుకుంది. చిట్టచివరి ప్రాంతం వరకు సులభంగా వెళ్లగలిగేలా రోడ్లు, నీటి సరఫరా, విద్యుత్ సరఫరా లాంటి మౌలిక సదుపాయాలను కల్పిస్తామని రాష్ట్ర ప్రభుత్వం చెబుతోంది. దాంతోపాటు పర్యాటక ప్రాజెక్టులకు కేవలం 21 రోజుల్లోనే అన్ని రకాల అనుమతులు లభిస్తాయి. ఇందుకోసం పర్యాటక శాఖ ముందుగా పరిశ్రమల శాఖతో సమన్వయం చేసుకుని, 21 రోజుల్లోనే అనుమతులు పొందేందుకు అక్కడ అవలంబిస్తున్న సింగిల్ డెస్క్ మెకానిజంను తమవద్ద కూడా అమలుచేస్తుంది.

### పర్యాటక రంగ లక్ష్యాలు

- దేశం నలుమూలల నుంచి పర్యాటకుల్ని ఆకర్షించే రాష్ట్రంగా, అంతర్జాతీయ పర్యాటకులు అమితంగా ఇష్టపడే 12 అత్యుత్తమ రాష్ట్రాల్లో ఒకటిగా ఎపిని తీర్చిదిద్దడం.
- రూ 10,000 కోట్ల మేర పెట్టుబడులు ఆకర్షించాలని లక్ష్యం. తద్వారా 2020 నాటి రాష్ట్ర ఆదాయంలో 7 శాతం పర్యాటక రంగం నుంచే ఉండాలని కూడా మరో లక్ష్యం.
- పర్యాటక రంగంలో 5 లక్షల అదనపు ఉద్యోగాల కల్పన.

### బొటానికల్ గార్డెన్

చింతపల్లి మండలం లంబసింగిలోని తజ్జింగి కేంద్రంగా రాష్ట్రంలో మొదటి బొటానికల్ గార్డెన్‌ని ఏర్పాటు చేయాలని ప్రభుత్వం భావిస్తోంది. రుషికొండ హిల్స్, అరకు, పాడేరుల్లో రోప్ వే ప్రాజెక్టులను కూడా బొటానికల్ గార్డెన్ లో భాగంగా ఏర్పాటు చేయతలపెట్టారు. బొటానికల్ గార్డెన్‌కు సుమారు 500 – 1000 ఎకరాల స్థలం అవసరం ఉంటుందని ప్రతిపాదిస్తున్నారు. రాష్ట్రానికి ఇంత వరకూ ఓ బొటానికల్ గార్డెన్ లేకపోవడం, అరకులోని పద్మాపురం గార్డెన్ హుద్ హుద్ తుపానుకు పూర్తిగా దెబ్బతిన్న నేపథ్యంలో ఈ ప్రాజెక్టు మీద ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు.

వైజాగ్ నుంచి అండమాన్, నికోబార్ దీవులకు, చెన్నైకు కాకినాడ మీదుగా పర్యాటక సముద్ర ఓడ ప్రయాణం సేవలు, వాటర్ స్పోర్ట్స్, బీచ్ ఫ్రంట్ రిక్రియేషన్, బీచ్ రిసార్టులను ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదనలపై సైతం ప్రభుత్వం కసరత్తు చేస్తోంది.


నున్నా నరేష్

## విశాఖకు మరో మణిహారం అక్షరధామ్



అక్షరధామ్ అంటే ఒక ఆలయం.... స్మారక భవన సముదాయం... విద్యా ప్రభోధ కేంద్రం... జ్ఞాన ప్రకాశ నిలయం... వీటన్నింటితో పాటు ఓ కళాత్మక నిర్మాణ అద్భుతం. సంప్రదాయక కళ, భవన నిర్మాణ పరిజ్ఞానం, భారతీయ సంస్కృతీ నాగరికతలు, ప్రాచీన నైతిక విలువలు, విజ్ఞానాల్ని ఉత్తమ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో సృజనాత్మకంగా మేళవించిన అపురూప ఆలయం – అక్షరధామ్. ఒక అంగుళం మేరకైనా ఉక్కు వాడకుండా, రాజస్తాన్ లోని పింద్వారా, సికంద్రా పట్టణాల నుంచి సేకరించిబడిన వేలాది టన్నుల కెంపువన్నె ఇసుకరాళ్ళు , పాలరాళ్ళతో నిర్మితమైన అక్షరధామ్ గుజరాత్‌కు చెందిన గాంధీనగర్, ఢిల్లీ తర్వాత మన విశాఖపట్టణంలో నిర్మాణం కానుండటం మన అదృష్టం. విశాఖ ప్రతిష్ట పెంచే విధంగా సింహాచలంలో అక్షరధామ్ దేవాలయం నమూనా నిర్మాణం తలపెట్టడానికి రాష్ట్ర ప్రభుత్వం సంసిద్ధంగా ఉంది.

విశాఖ జిల్లాలోని వరాహ నరసింహ స్వామి దేవాలయ పుణ్యభూమిలో ప్రసిద్ధి చెందిన స్వామి నారాయణ్ అక్షరధామ్ అక్షరధామ్ దేవాలయం నిర్మాణం చోటుచేసుకోనుంది.

సింహాచలంలో అక్షరధామ్ దేవాలయం నెలకొల్పడంపై శ్రీ అక్షర్ పురుషోత్తం స్వామినారాయణ్ సంస్థ (బీఏపీఎస్), ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు దీని మీద చర్చలు జరుపుతున్నాయి. ఈ విషయంపై విశాఖ జిల్లా కలెక్టర్ డాక్టర్ ఎన్ యువరాజ్ మాట్లాడుతూ, స్వామినారాయణ్ ట్రస్ట్ ఆధ్వర్యంలో వైజాగ్‌లోని సింహాచలం దేవాలయం సమీపంలో ఓ దేవాలయాన్ని నిర్మించ తలపెట్టారని, అందుకోసం తగిన భూమిని గుర్తించే పనిలో ఉన్నామని తెలిపారు. ఈ దేవాలయం నిర్మాణానికి అవసరమైన భూమి, నిర్మాణ వ్యయంపై అంచనాలతో నివేదిక ఇవ్వమని కోరామని రాష్ట్ర మానవ వనరుల శాఖ మంత్రి గంటా శ్రీనివాసరావు తెలిపారు.

## స్మార్ట్ విలేజ్ – స్మార్ట్ వార్డు!

# పల్లెసీమ మన భాగ్యసీమరా...

**దేశానికి గుండెకాయవంటిదని మహాత్మాగాంధీ భావించిన గ్రామానికి నప్పని రంగులు పులిమి మారు పట్టణంగా మార్చడమే అభివృద్ధి అనే అపోహ తుడిచేసి, రుగ్మతల్లాంటి సమస్యలు తీర్చి, మెరుగైన సౌకర్యాలతో గ్రామాల స్ఫూర్తిని నిలబెట్టడమే నిజమైన ప్రగతి అని స్మార్ట్ విలేజ్- స్మార్ట్ వార్డ్ ద్వారా చంద్రబాబు చాటనున్నారు. జాస్తి గోపాల ప్రసాద్ ప్రత్యేక కథనం.**

అమెరికా నుంచి పదేళ్లకి స్వగ్రామం తిరిగొచ్చిన లక్ష్మీతులసి రామినేని ఆశ్చర్యానికి అంతులేదు. ఈ పల్లె అప్పుడు తాను పుట్టి, పెరిగినదేనా?

- అందరికీ ఇళ్లు, సురక్షితమైన నీరు, అంతరాయం లేని విద్యుత్.
- బహిరంగ మలమూత్ర విసర్జన మచ్చుకైనా లేదు, ప్రతి ఇంటికీ మరుగుదొడ్డి.
- ప్రసవ గండాలు లేవు, కాన్పులన్నీ ఆస్పత్రిలోనే, మాతాశిశు మరణాలు నిన్నటి మాటే.
- వైద్యం అందక ఏడాదిలోపు మ–రణించే శిశువులెవరూ లేరు.
- ఐదేళ్లలోపు పిల్లలందరికీ పౌష్టికాహారం.
- అర్థాంతరంగా ఆగే చదువులు లేవు. అబ్బాయిలే కాదు, అమ్మాయిలు కూడా ఇంటర్మీడియట్ లోపు చదువు మానేసిన వారు ఒక్కరంటే ఒక్కరు లేరు.
- అంగన్ వాడీ కేంద్రాల్లో, పాఠశాలల్లో, ఆరోగ్యకేంద్రాల్లో, గ్రామపంచాయతీ భవనాల్లో వాడుకలో ఉండేలా మరుగుదొడ్డి, తాగునీరు, విద్యుత్.
- వెల్లి విరుస్తున్న చైతన్యం– ఏడాదిలో నాలుగుసార్లు గ్రామ, వార్డు సభలు జరుగుతున్నాయి. హాజరు కూడా మూడింటికి రెండొంతుల పైమాటే.
- బ్యాంకు అంటేనే తెలియదు గతంలో. ఇప్పుడు ప్రతి కుటుంబానికి బ్యాంకు ఖాతా ఉ

ంది.

- ప్రతి పొలానికి కొత్తగా భూసారపరీక్ష కార్డు. పశుపోషణ, వైవిధ్యమైన చేల పెంపకం- అంతా ఒక కొత్త ఆకుపచ్చని జీవితం. ఊరు ఊరంతా పచ్చని చెట్లు.
- ప్రజలందరి భాగస్వామ్యంతో తయారుచేసిన వినూత్న గ్రామ, వార్డు అభివృద్ధి ప్రణాళికలు.
- నీటి సంరక్షణ, నీటినిల్వల నిర్మాణాలు.
- ఒక పద్ధతిగా పరిష్కారమౌతున్న వివాదాలు, సమస్యలు, ఫిర్యాదులు.
- ప్రపంచం మొత్తాన్ని ఒక గ్లోబల్ గ్రామాన్ని చేసే గ్రామ సమాచార కేంద్రం, కంప్యూటర్ లాబ్, మీ సేవా కేంద్రం. గ్రామం అంతటా ఇంటర్నెట్.
- ఏదీ వ్యర్థం కావడం లేదు. ఘన, ద్రవ వ్యర్థాల్ని తెలివిగా నిర్వహిస్తున్నారు.
- ప్రత్యామ్నాయ శక్తిగా సౌరశక్తి, ఎల్ఈడీ బల్బుల వాడకమే అంతటా.
- ప్రతి కుటుంబానికి జీవనభృతికి అవసరమైన పని ఉంది. కొందరు చిన్న చిన్న వ్యాపారాలు కూడా చేసే అదును ఉంది.

నెరవేరని కలవంటి ఆదర్శ ప్రపంచాన్ని ఉటోపియా అంటారు. అటువంటి స్వప్నసీమని చూసినట్టుంది లక్ష్మీతులసికి.

ఉటోపియాని స్మార్ట్ విలేజ్ పేరిట రేపటికి నిజం చేసి, ఆదర్శాన్ని ఆచరణ సాధ్యం చేసి చూపించడమే లక్ష్యంగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు చేపట్టిన కార్యక్రమమే - స్మార్ట్ విలేజ్- స్మార్ట్ వార్డు!

### ప్రవాసాంధ్రుల చేదోడు

విభజన నేపథ్యంలో నవ్యాంధ్రప్రదేశ్‌ను పునర్నిర్మించుకోవాల్సి ఉంది. రాష్ట్రాన్ని కింది స్థాయి నుంచి అన్ని రంగాల్లో అగ్రగామిగా తీర్చిదిద్దుకోవాలి. రాష్ట్రంలోని వనరుల సద్వినియోగంతోపాటు వివేకవంతులైన మానవ వనరులతో, ప్రజల భాగస్వామ్యంతో సకల సౌకర్యాలను సమకూర్చుకోవాలి. ప్రజలు, ఎన్ఆర్ఐలు, స్వచ్ఛంద సంస్థల భాగస్వామ్యం ఉన్నప్పుడు పాలనలో పారదర్శకత పెరిగి, ప్రభుత్వ కార్యక్రమాలు లక్ష్యాన్ని సాధిస్తాం, ఆ కోవలో ఇది వరకు జన్మభూమి, పచ్చదనం-పరిశుభ్రత లాంటి పథకాలు రాష్ట్ర ప్రగతికి దోహదం చేశాం. పల్లెలు బాగుపడితేనే రాష్ట్రాలు అభివృద్ధి చెందుతాయి. దేశం ప్రగతి మార్గంలో పయనిస్తుంది. దేశం అభివృద్ధి చెందాలంటే గ్రామీణ ప్రాంతాల అభివృద్ధే కీలకం. గాంధీజీ కలలుకన్న గ్రామస్వరాజ్యం స్థాపించేందుకు స్మార్ట్ విలేజ్/ స్మార్ట్ వార్డు కార్యక్రమాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేపట్టింది. జన్మభూమికి సేవ చేయడం ఒక వరం లాంటిది... పల్లెసీమను అభివృద్ధి చేయటం అదృష్టంగా భావిస్తూ దేశవిదేశాల్లోని ఎందరో ప్రముఖులు ముందుకు వస్తుండటం శుభసూచికం.

స్మార్ట్ వార్డు, స్మార్ట్ డివిజన్, స్మార్ట్ విలేజ్ లక్ష్యం కోసం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం www.smart. ap.govt.inను ప్రవేశపెట్టింది. పరిశుభ్రమైన, ఆరోగ్యకరమైన, ఆనందదాయకమైన, ఆర్థిక అసమానతలులేని సమాజాన్ని నిర్మించడమే ఆకర్షణీయ గ్రామం, వార్డుల లక్ష్యం. ప్రతి గ్రామం, వార్డుల్లో స్థానికంగా అందుబాటులో ఉన్న వనరులు, సమస్యలు, అవసరాలను దృష్టిలో పెట్టుకుని సూక్ష్మ ప్రణాళిక రూపొందించుకుంటారు.ఆ ప్రణాళిక ప్రకారం క్రమపద్ధతిలో ఆయా ప్రాంతాల్లో నెలకొన్న సమస్యలు పరిష్కరించడం, నూతన సదుపాయాలు కల్పించడం దీని ప్రధాన ఉద్దేశ్యం.

### కార్యాచరణకి గ్రామాల దత్తత

స్మార్ట్ వార్డు, స్మార్ట్ డివిజన్, స్మార్ట్ విలేజ్ కార్యక్రమాల అమలుకు రాష్ట్ర స్థాయిలో ముఖ్యమంత్రి అధ్యక్షతన ఒక స్టీరింగ్ కమిటీ ఏర్పాటైంది. పంచాయతీరాజ్, పురపాలకశాఖ, గ్రామీణ నీటి సరఫరా, గ్రామీణాభివృద్ధి, విద్య, పౌరసరఫరాలు, తదితరాలకు చెందిన యంత్రాంగం ఇందులో ఉంటాయి. జిల్లా స్థాయిలో కలెక్టర్ పర్యవేక్షిస్తారు. ప్రతి గ్రామంలో జన్మభూమి- మావూరు కమిటీలు ఉంటాం. మంత్రులు, ఎమ్మెల్యేలతోపాటు ఐఏఎస్, ఐపీఎస్, ఐఎఫ్ఎస్ గ్రూప్ అధికారులు ఒక్కో గ్రామాన్ని లేదా వార్డును దత్తత తీసుకుంటారు.సామాజిక బాధ్యత కింద పారిశ్రామికవేత్తలు, ప్రవాస భారతీయులు, గ్రామం బయట నివాసం ఉండేవారు గ్రామాలను దత్తత తీసుకునేందుకు ఇప్పటికే వందుకు వస్తున్నారు. ఆకర్షణీయ విలేజ్, ఆకర్షణీయ వార్డు కార్యక్రమ ఉద్యమం ద్వారా ఆంధ్రప్రదేశ్ చిత్రపటాన్ని సమూలంగా మార్చాలన్నది లక్ష్యంగా నిర్ణయించారు. రాష్ట్రంలో ప్రతి గ్రామం, వార్డును ఆకర్షణీయం (స్మార్ట్) గా రూపొందించడం ద్వారా వెత్తం ఆంధ్రప్రదేశ్‌ను స్మార్ట్‌గా చేయాలనే లక్ష్యంతో రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా చేపడుతున్న స్మార్ట్ విలేజ్, వార్డు పథకం అమలుతో అభివృద్ధివైపు నడిచేలా ప్రజల్లో చైతన్యం, వారి భాగస్వామ్యమే తారకమంత్రాలుగా ఈ పథకాన్ని అమలు చేస్తున్నారు. రాష్ట్రంలోని వెత్తం 12,918 గ్రామాలు, 3,465 వార్డులను ఐదేళ్లలో స్మార్ట్‌గా తయారుచేయాలని ఏపీ ప్రభుత్వం సంకల్పంగా పెట్టుకుంది. స్థానిక ప్రజల విజ్ఞానం, నైపుణ్యాలు, సమర్థతలను తక్కువగా చూడకూడదు. స్థానిక ప్రజల ఆలోచనలు, పద్ధతులు, స్థానిక నమ్మకాలను విమర్శించకూడదని నిర్ణయించారు.

ఇంకోవైపు ఈ పథకం అమలు తీరును మదింపు చేసేందుకు సూచికలు ఏర్పాటు చేశారు.

ఒక గ్రామం స్మార్ట్ అనేందుకు, ఒక వార్డు స్మార్ట్‌గా తయారైందని చెప్పేందుకు 20 సూచికల్ని ఏర్పాటు చేశారు. వీటన్నింటిలోను వందశాతం ఫలితాలు సాధిస్తే ఆ గ్రామం, వార్డు స్మార్టే.

### మోడల్ నియోజకవర్గాల అభివృద్ధి

ఏపీలో 60 మోడల్ నియోజకవర్గాల అభివృద్ధిపై ప్రణాళికలు సిద్ధం చేయండని కూడా ఎమ్మెల్యేలకు సీఎం చంద్రబాబు సూచించారు. సామాజిక బాధ్యత కింద పారిశ్రామికవేత్తలు, ప్రవాస భారతీయులు, ఔత్సాహికులు గ్రామాలను దత్తత తీసుకుంటున్నారు. ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు పాడేరులో రెండు గ్రామాలను, పలువురు కేంద్ర మంత్రులు వెంకయ్యానాయుడు, సుజనాచౌదరి, నిర్మలా సీతారామన్, రాష్ట్ర మంత్రులు, ఎమ్మెల్యేలు, ఇతర ప్రజా ప్రతినిధులు రాష్ట్రంలోని పలు గ్రామాల్లో స్మార్ట్ విలేజ్ సమర్థంగా అమలు పర్చడానికి ముందుకొచ్చారు. ఒక్క అమెరికాలోని ప్రవాసాంధ్రులు సుమారు 2,400 మంది స్మార్ట్ విలేజ్ కార్యక్రమం కింద దత్తత తీసుకుని జన్మభూమి రుణం తీర్చుకోవడానికి ముందుకు రావడం ఆహ్వానించదగ్గ పరిణామం.ఈ అత్యంత ప్రయోజనకరమైన స్మార్ట్ వార్డు/ స్మార్ట్ విలేజ్ కార్యక్రమాన్ని అమలు పరచడం ప్రతి ఒక్కరి బాధ్యతగా భావిస్తున్నారు. అదే విధంగా రాష్ట్రానికి చెందిన ఎంపీలు, ఎమ్మెల్యేలు ప్రజా జీవితంతో మమేకం అయిన ప్రతి ఒక్క నేత వారి వారి నచ్చిన గ్రామాల్లో, వార్డుల్లో స్మార్ట్ విలేజ్/ స్మార్ట్ వార్డు కార్యక్రమాన్ని చేపట్టాల్సిన అవశ్యకత ఎంతైనా ఉందని మున్సిపల్ శాఖ మంత్రి పి నారాయణ విజ్ఞప్తి చేస్తున్నారు.

అదనపు నిధులు సమకూర్చడమే కాకుండా ప్రభుత్వం నుండి లభించే వివిధ పథకాలను సమన్వయం చేసుకుని సమర్థంగా అమలు చేయగలిగితే సత్ఫలితాలు సత్వరంగా అందుతాయని అధికార వర్గాలు భావిస్తున్నాయి. ఈ ప్రక్రియలో దత్తత తీసుకునేవారు సమయం ఇచ్చి సమన్వయం చేసుకోవడం చాలా ము-ఖ్యం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలోని అన్ని విభాగాలు, అన్ని స్థాయిల్లో అధికారులు, సిబ్బంది ప్రజాభాగస్వామ్యానికి తోడ్పడినప్పుడు రాష్ట్రంలో స్మార్ట్ విలేజ్, స్మార్ట్ వార్డు కార్యక్రమం పరిపూర్ణ విజయం సాధించడం ఖాయమన్న భావన వ్యక్తమవుతోంది.



జాస్తి గోపాల ప్రసాద్

❖

# ఎన్టీఆర్‌తో నా అనుభవాలు



రావులపాటి సీతారామారావు

నేను తిరుపతిలో ఎడిషనల్ ఎస్.పి.గా వున్నప్పుడు మద్రాసుకు పోవటం తటస్థించింది. అక్కడ మేమున్న చోటికి దగ్గర్లోనే ఎన్టీఆర్ ఏదో సినిమా షూటింగ్‌లో వున్నారంటే కుతూహలం ఆపుకోలేక అక్కడికి వెళ్ళాం. ఎన్టీఆర్‌ను సినిమాల్లో గాకుండా మొదటిసారి నేను ఆ విధంగా చూశాను. షూటింగ్ ప్రాంతంల్లోకి ఎవరినీ దగ్గరికీ రానివ్వకపోవటం సహజమే! అందుకే దూరంగా వుండి చూస్తున్నాం. మాతో పాటు పోలీసు యూనిఫాంలో వున్న మా డ్రైవర్ కూడా అమితోత్సాహంతో షూటింగ్ చూస్తున్న తరుణంలో యూనిఫాంలో వున్న అతడు ఎవరో కనుక్కోవాల్సిందిగా ఎన్టీఆర్ పురమాయించటం దూరం నుంచే నేను గమనించాను.

నేను ఫలానా అని తెలవగానే అక్కడి వారు మమ్మల్ని ఎన్టీఆర్ దగ్గరకు తీసుకెళ్ళారు. నన్ను గురించి ప్రశ్నలు వేస్తే నేను ఆయనకు జవాబులు చెప్పాను. ఆ ప్రశ్నలు ఏం పని మీద వచ్చారులాంటివి. ఆయన ఎంతో ఆదర పూర్వకంగా మమ్మల్ని కూర్చోమనటమే కాకుండా కూల్‌డ్రింక్స్ కూడా తెప్పించారు. ఆ విధంగా నాకు ఆయనతో మొదటిసారి పరిచయమయింది. ఆరోజు, ఆయన ముఖ్యమంత్రి అవుతారని అధికారిగా నేను కొన్ని అమూల్యమైన అనుభవాలు సమకూర్చుకుంటానని అసలు ఊహించలేదు.

ఆయన పార్టీ స్థాపించిన తర్వాత, తిరుపతి నుంచి కూడా అసెంబ్లీకి పోటీ చేయాలనుకోవటం వల్ల మా పోలీసులకు మరింత పనిభారం పెరిగింది. అనూహ్య రీతిలో జనం ఆయన సభలకు, ర్యాలీలకు వచ్చేవారు. బందోబస్తు చేయటం చాలా కష్టంగా వుండేది. అలాంటి పరిస్థితుల్లోనే మేము 'మొబైల్ బారికేడ్స్' లాగా 'రోప్ పార్టీస్'ను పెట్టి జనాన్ని కంట్రోల్ చేసే అనుభవాన్ని పొందాం. ఆ తర్వాత ఓ అధికార పర్యటనలో ఆ రోప్ పార్టీలను చూసిన అప్పటి డీజీపీ ఆనందరాం మెచ్చుకోవటమేగాకుండా, ఎన్టీఆర్ పర్యటనలకు రోప్ పార్టీలను వాడాలనే సర్క్యులర్‌ను ఇచ్చినట్లు జ్ఞాపకం. తిరుపతి రోప్ పార్టీ ఎక్స్‌పర్‌మెంట్ ఆ విధంగా అమిత ప్రాచుర్యాన్ని పొందటమేగాకుండా పోలీసు బందోబస్తు టెక్నిక్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది.

ప్రజాకర్షక శక్తిగల నాయకుడిగా ముందరి వరుసలో ఎన్టీఆర్ నిస్సందేహంగా నిలుస్తారు. ఆయనకోసం, వేల కొద్దీ వచ్చే జనాన్ని అదుపు చేసేందుకు ఏర్పడిన మొబైల్ బారికేడ్స్ అంటే రోప్ పార్టీస్ ఏర్పాటు చేయటానికి తనకు తెలియకుండానే ఎన్టీఆర్ కారణభూతుడు కావటం చరిత్రలో నిలిచిపోయిన సత్యం!

*ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పోలీసు శాఖలో ఉన్నతాధికారిగా బాధ్యతలు నిర్వహించిన రావులపాటి సీతారామారావు అప్పటి ముఖ్యమంత్రి ఎన్టీ రామారావుతో కలిసి పనిచేసినప్పటి అనుభవాలను ఇక్కడ గుర్తుకుతెచ్చుకుంటున్నారు. రావులపాటి ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ పోలీసు గృహనిర్మాణ సంస్థ చైర్మన్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.*

❖ ❖ ❖

ఎన్టీఆర్ స్థాపించిన తెలుగుదేశం పార్టీ అంత త్వరగా ప్రజల్లో చొచ్చుకొని పోతుందని ఎవరూ ఊహించలేదు. ఎన్నికలలో చివరిపోరు (జనవరి 3, 1983) కూడా తిరుపతిలోనే జరగటం పోలీసులకు ఊపిరి ఆడనివ్వకుండా చేసింది. ఎన్టీఆర్ తిరుపతి నుంచి కూడా పోటీ చేయడానికి సిద్ధపడటంతో మా పరిస్థితి మరింత కష్టతరంగా మారింది. రెండు పార్టీల ప్రచారానికి తెరదించబోయే ముందు క్లైమాక్స్ అంకం తిరుపతిలో చోటు చేసుకుంటుందని చాలా తక్కువ మంది ఊహించారు. అటు ఎన్టీఆర్, యిటు ఇందిరాగాంధీ తమ పార్టీల తరపున రాజీలేని పోరాటానికి సిద్ధపడటంతో తిరుపతిలో ఎటు చూసినా ఎన్నికల సంరంభమే! కురుక్షేత్రాన్ని తలపించే రీతిలో ఇరుపక్షాలు రణరంగానికి సిద్ధపడటంతో పోలీసులకు పగలూ రాత్రులకు తేడా లేకుండా పని చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది.

ఎన్టీఆర్ మీటింగ్‌కు జనం విరగబడి వచ్చారు. ఎటుచూసిన ఆయన చెప్పిన రీతిలో 'నేల యీనిందా' అన్నట్లుగా ప్రజలు కనపడ్డారు. సినిమా స్టయిల్‌లో చెప్పిన డైలాగులతో పట్టణం అంతా హోరెత్తిపోయింది. 'ఆత్మగౌరవం, ఎవడబ్బ సొమ్ము, కుక్కమూతి పిందెలు' ఎవరిని పలకరించినా అవే మాటలు! రా కదలిరా అనే నినాదమే!

ఎన్టీఆర్ మీటింగ్‌కు, ర్యాలీకి ఎలాంటి అభ్యంతరాలు లేకుండా మేము అనుమతి యివ్వటంతో తెలుగుదేశం పార్టీ వారు చాలా సంతోషాన్ని వ్యక్తపరిచారు. ప్రధానమంత్రి పబ్లిక్ మీటింగ్ దృష్ట్యా పోలీసులు యింకా ఏ యితర మీటింగ్‌నూ అనుమతించరని వాళ్ళను చాలా మంది భయపెట్టడంతో చివరి వరకూ వాళ్ళు సందేహంతోనే వున్నారు. 'పోలీసులు అనుమతి యివ్వరని నూటికి నూరుపాళ్ళు మాతో చెప్పిన వాళ్ళు వున్నారు. చివరకు ఆ సందేహాన్ని ఎన్టీఆర్‌కు గూడా చేరవేశారు. తిరుపతి రాబోయే ముందు గూడా ఎన్టీఆర్ అడిగారు. 'పోలీసుల అనుమతి లభించిందా' అని, కాంగ్రెస్ వాళ్ళు పోలీసుల మీద వొత్తిడి తెస్తారేమోనని మా భయం" ఒకాయన నాతో అన్నాడు కూడా.

ఎన్టీఆర్ గెల్చిన తర్వాత ప్రమాణ స్వీకారం చేసిన రెండు, మూడు రోజుల్లోనే ఎలక్షన్ ఘటన జరిగిన పొదిరి కుప్పం సందర్శించటానికి తిరుపతి విమానంలో వచ్చారు. ఎయిర్‌పోర్టులో ఆయన వెంట వచ్చిన డీజీపీ ఆనందరాం మమ్మల్ని అందర్నీ పరిచయం చేశాడు. నన్ను పరిచయం చేసిన తరువాత నన్ను ఎగాదిగా చూస్తూ 'మీరేనా ఎడిషనల్ ఎస్పీ సీతారాంరావు! థాంక్ యూ బ్రదర్' అన్నారు. పోలీసులు నిష్పక్షపాత్రంగా వ్యవహరించారని ఆయన చెప్పకనే చెప్పారు.

ఎన్టీఆర్ థాంక్స్ చెప్పటం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నేను అనుకొనేది ఒక్కటే! బాగా ఎత్తుకు వెళ్ళిన వారి ఆలోచనలు ఉన్నతంగా వుంటాయని, ఆ ఎత్తుకు సామాన్యుడు ఎదగలేక పోవటానికి కారణం అంత హృదయ వైశాల్యాన్ని సాధించలేక పోవటం వల్లనే అని!.

❖ ❖ ❖

ముఖ్యమంత్రి ఎన్టీఆర్ తిరుపతి పర్యటనలో ఉన్నారు. తిరుమల నుంచి కాన్వాయి కిందకి దిగగానే 'పాన్ షాప్' లాంటి ఆ 'స్ట్రక్చర్' ఆయన్ను అమితంగా ఆకర్షించింది. 'ప్రజా పోలీసు' కొట్టొచ్చేట్లు ఆ కట్టడం మీద కనబడుతున్న అక్షరాలను ఆయన పెద్దగానే చదివారు. వెనక టాప్‌లెస్ జీప్‌లో ఉన్న వున్న కలెక్టర్ శ్రీధర్ శర్మ, ఎస్పీగా వున్న నేను వింటుండగా 'ఏమిటిది ఎస్పీ గారూ" అన్నాడు నన్ను ఉద్దేశించి వెనక్కు తిరగకుండానే బారులు తీరివున్న జనానికి చేతులు ఊపుతూ, అభివాదం చేస్తూ.

నేను జవాబివ్వటానికి సందేహించాను. కానీ కలెక్టర్ శ్రీధర్‌శర్మ అందుకున్నాడు. 'ఇది మా ఎస్పీగారి ఇన్నోవేషన్ సార్!". అప్పుడు ఎన్టీఆర్ వెనక్కు తిరిగి నన్ను చూస్తూ 'ఏమిటో వివరించండి' అన్నాడు.

'సార్.. మీ ధ్యేయం ప్రజల వద్దకు ప్రభుత్వం. అయితే నేను అనుకుంటున్నది 'ప్రజల ముంగిట పోలీసు' (***POLICE AT YOUR DOORSTEP***) అన్న భావన ప్రజలకు ఏర్పడితే ప్రజలు పోలీసులతో సహకరిస్తారు. ప్రజలకు పోలీసుల జ్యూరిడిక్షన్‌తో సంబంధం లేదు. ఏ ఏరియా పోలీసు స్టేషన్ ఇలాకాలోకి వస్తుందో వాళ్ళకు తెలియాల్సిన అవసరం లేదు. వాళ్ళకు కావాల్సిందల్లా నేరం జరిగినప్పుడు కష్టం కలిగినప్పుడు పోలీసు దగ్గరలో వున్నాడా లేడా ఫిర్యాదు చేయటానికి అందుబాటులో పోలీసులు వున్నారా లేరా అనేదే! పోలీసు స్టేషన్ అంటే భయం పోగొట్టాలని నా ఉద్దేశ్యం. సామాన్యుడు ఒక పాన్‌షాప్‌కు తన అవసరం కోసం ఎంత సులభంగా పోతాడో అంత సులభంగా పోలీసుల దగ్గరకుపోయే ఏర్పాట్లు చేయాలని నా తాపత్రయం. ఎర్రగా పెయింట్ వేసిన పోలీస్‌స్టేషన్‌లోకి ప్రజలు అవసరార్థం రావాలంటేనే భయపడ్డారు. ప్రయోగంగా తిరుపతిలో నేరాలు జరిగే ప్రాంతాలను గుర్తించి పాన్‌షాప్ లాంటి కట్టడాలను ఏర్పాటు చేశాం. ప్రజా పోలీసు కేంద్రాలని పేరు పెట్టాం. పోలీస్ స్టేషన్‌లోనే వున్న సిబ్బంది లోంచే ఒక్కో కానిస్టేబుల్‌ను జనరల్ డైరీతో సహా నియమించాం. ఈ కేంద్రం కూడా ఫోన్ సౌకర్యం వున్న దగ్గర ప్రాంతంలో వుంచాం. చిన్న సమస్య అయితే కేంద్రంలోని పోలీసు తీర్చగలడు. పెద్దదయితే పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసి సిబ్బందిని రప్పించుకోగలడు. ప్రజల్లో యీ కేంద్రాలకు గుర్తింపు వస్తున్నది. అందుకే మాకు సంతోషంగా వుంది" గుక్క తిప్పుకోకుండా చెప్పాను.

"మంచి ఆలోచన" సావధానంగా వింటూ ప్రజలకు చేతులూపుతూ ఎన్టీఆర్ అన్నారు.

❖ ❖ ❖

దాదాపు ఏడెనిమిది నెలల తర్వాత హైదరాబాద్‌లో సీనియర్ పోలీసు ఆఫీసర్స్ కాన్ఫరెన్స్ జరుగుతున్న సందర్భం. ముఖ్యమంత్రి ఎన్టీఆర్‌తో సహా అందరూ పాల్గొంటున్నారు.

ఒక అధికారి లేచి బడ్జెట్ తక్కువవటం వల్ల పోలీస్‌శాఖ విజయాన్ని సాధించటంలో కుంటుపడుతున్న వైనాన్ని సోదాహరణంగా వివరిస్తున్నారు.

అప్పటిదాకా అసహనంగా వింటున్న ఎన్టీఆర్ విసురుగా అన్నారు '***WHERE THERE IS A WILL THERE IS A WAY***, ఆ చిత్తూరు జిల్లా ఎస్పీని చూడండి. ఒక్క పైసా అడగకుండానే పోలీసు వ్యవస్థను ప్రజల దగ్గరకు తీసుకొని వెళ్ళాలని ప్రయత్నం చేస్తున్నాడు. డబ్బులు ముఖ్యం కాదు, ప్రభుత్వం అనుకుంటే అవ్వీ వస్తాయి! కానీ కావాల్సింది ఆలోచన, చిత్తశుద్ధి, అంకితభావం!.

ఆ సమావేశంలో నేనూ వున్నారు. ముఖ్యమంత్రి అన్ని నెలల తర్వాత 'ప్రజా పోలీసు ప్రయోగాన్ని జ్ఞాపకం వుంచుకొని, ప్రత్యేకంగా ఆ విషయాన్ని ఉటంకించటం నాకు ఆశ్చర్యంతో పాటు సంతోషాన్ని కలిగించింది.

❖ ❖ ❖

నేను నిఘా విభాగంలో ఎస్పీగా ఉన్నప్పుడు రిజర్వేషన్ల సమస్య ఎన్టీఆర్ ప్రభుత్వానికి పెద్ద సవాలుగా మారటంతో మాకు పని బాగా పెరిగింది. సమాజంలో వెనకబడిన వర్గాల వారికి 44శాతం పెంచుతూ ఎన్టీఆర్ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం కొత్త సమస్యను తెచ్చిపెట్టింది. రిజర్వేషన్లకు వ్యతిరేకంగా విద్యార్థులు 'నవ సంఘర్షణ సమితి' పేరుతో ఒక ఉద్యమాన్ని మొదలుపెట్టారు. మెడికల్ స్టూడెంట్స్ అగ్రభాగాన నిలబడి వినూత్న రీతిలో ధర్నాలు, రాస్తారోకోలు, ప్రదర్శనలు చేస్తూ ముఖ్యంగా హైదరాబాద్ నగరాన్ని బంధించినంత పని చేశారు. మరో వైపు 'సమసంఘర్షణ సమితి' పేరుతో రిజర్వేషన్లకు అనుకూలంగా వెనుకబడిన వర్గాల విద్యార్థులు అగ్రవర్ణ విద్యార్థుల ఉద్యమాన్ని తిప్పికొట్టడానికి సమాయత్తమయ్యారు. రాజకీయ పార్టీలు అటు,యిటూ కొమ్ము కాస్తూ అగ్నికి ఆజ్యాన్ని యథావిధిగా సరఫరా చేశాయి.

'నవ సంఘర్షణ సమితి' యాక్షన్ కమిటీ మొదటిసారిగా అనంతపురంలో సమావేశమయింది. నిఘావిభాగం పనితీరు చిత్రంగా వుంటుంది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా తలెత్తే ఏ సమస్యనైనా అధ్యయనం చేయటంతో బాటు తగ్గరీతిలో ప్రభుత్వం స్పందించే విధంగా సమాచారాన్ని సేకరించి, సమస్యను పరిష్కరించటానికి దోహదపడాలి. నిఘా విభాగానికి అధిపతిగా వున్న హెచ్.జె.దొర నన్ను ప్రత్యేకంగా అనంతపురం పంపటం వెనక పరమార్థం

వుంది. ఉద్యమానికి తలపడ్డ విద్యార్థులతో మమేకమై వాళ్ళ ఆనుపానులు, సంబంధాలు తెలుసుకోవటంతో పాటు అవసరమైనప్పుడు, అంటే సమస్య చేజారే పరిస్థితి ఉత్పన్నమయినప్పుడు ప్రభుత్వపరంగా నియంత్రణ చర్యలు చేపట్టటానికి వీలుగా సమాచారాన్ని అందించాలి. ఎప్పటికప్పుడు విషయ సేకరణ చేస్తూ సమాచారాన్ని అందించటంలోనే నిఘా విభాగం ప్రతిభ ద్యోతకమవుతుంది.

నిఘా విభాగానికి ఆ మాటకొస్తే పోలీసు డిపార్టుమెంటుకు సంబంధించినంతవరకూ ఒక నిబంధన వుంది. సమాచార సేకరణకు సంబంధించిన 'సోర్సు' వ్యక్తుల గుట్టు బయట పెట్టాల్సిన అవసరం లేదని, న్యాయస్థానాల్లో గూడా యీ పద్ధతిని గౌరవిస్తారు. అనంతపురంలో విద్యార్థుల మీటింగ్‌కు సంబంధించినంతవరకు నాకు మంచి 'సోర్స్' అందుబాటులోకి వచ్చింది. నాతో కలిసి పనిచేసిన ఓ పోలీసు అధికారికి దగ్గర బంధువయిన ఓ విద్యార్థి నాయకుడు ఉద్యమంలో కీలకపాత్ర పోషించటం మాకు కలిసి వచ్చింది. ఎవరినుంచయితే రహస్య సమాచార సేకరణ సేకరిస్తున్నామో, ఆ వ్యక్తికి గూడా ఆ విషయం తెలియదు. నిఘా కార్యక్రమాలు అంతగుట్టుచప్పుడు కాకుండా జరుగుతాయి. చాపకింద నీరులా నిఘా విభాగం పనిచేస్తుంది. అలా పనిచేయకపోతే అది నిఘా విభాగమే కాదు. అనంతపూర్ యాక్షన్ కమిటీలో వున్న విద్యార్థి నాయకుల్లో చాలా మంది వాళ్ళకు తెలియకుండానే మాకు దగ్గరయ్యారు. ఏ ఏ కార్యక్రమాలు తలపెడ్తున్నదీ, ఒకటేమిటీ మాకు అన్ని విషయాలు, రహస్యాలు, కొన్ని గంటల ముందే తెలిసిపోయేవి. ఇంటెలిజెన్సు **NEED TO KNOW BASIS** మీద పని చేస్తుంది. నిఘా విభాగంలో పనిచేసేవారందరికీ అన్ని విషయాలు తెలుస్తాయని చాలా మంది అనుకుంటారు. కానీ ఆ శాఖలో పని విధానం అలా వుండదు. ఒక సమస్యను చేపట్టిన ఒకరిద్దరు అధికారులకే అసలు విషయాలు అవగతమవుతాయి. నిఘా విభాగం అధిపతుల సామర్థ్యం మీద యీ విభాగం పనితీరు ఆధారపడి వుంటుంది.

ఎంత ఉధృతంగా విద్యార్థుల ఉద్యమం ప్రారంభమయిందో, అంత ఉధృతంగానే సంఘటనలు చోటు చేసుకోసాగాయి. మీడియా గూడా సంచలన వార్తలకు ప్రాముఖ్యానిస్తూ తమవంతు పాత్రను పోషించసాగాయి. ఎన్టీఆర్ ప్రభుత్వానికి అనుకోని రీతిలో యీ సమస్య పెద్ద యిబ్బందిగా మారిన తరుణంలో కోర్టు తీర్పు ఊరట కలిగించింది. ప్రభుత్వం యిచ్చిన రిజర్వేషను ఆర్డరును కోర్టు కొట్టివేసింది. ఆ సందర్భంగా విద్యార్థుల ఉద్యమం అగమ్యగోచర పరిస్థితుల్లో పడిపోయింది. గుంటూరులో ఏర్పాటు చేసుకున్న మీటింగ్ నిట్టనిలువుగా చీలిపోయి విద్యార్థుల్లో తగాదాలకు దారితీసింది. విద్యార్థుల నైతిక స్థయిర్యం దెబ్బతినకుండా, నిఘా విభాగం ముఖ్య నాయకులను ముఖ్యమంత్రి ఎన్టీఆర్‌కు కలిపి ఒక ఒడంబడిక పత్రాన్ని వెలువరించటంతో కథ సుఖాంతం అయింది.

ఆ సందర్భంగా ఎన్టీఆర్ నిఘా విభాగం పనితీరుపై సంతోషం వ్యక్తపరిచారు. హెచ్.జె.దొర ద్వారా నాలాంటి అధికారులకు కబురుచేసి ప్రత్యేకంగా ప్రశంసల జల్లు కురిపించారు. ఎన్టీఆర్ మనస్తత్వం, ఆటుపోట్లకు లోనైన సందర్భాల్లోనూ సున్నితత్వాన్ని కోల్పోకపోవటం ఒక విశేషమే! సినిమా అనుభవం వల్ల జయాపజయాలను సమాన దృష్టితో చూడటానికి ఆయన అలవాటు పడి వుండొచ్చు!

ప్రజల వద్దకు పాలనను తీసుకొని వెళ్ళటానికి మండల వ్యవస్థను ఏర్పాటు చేసి 1987లో పంచాయతీ ఎన్నికలు జరపటానికి ప్రభుత్వం నిశ్చయించింది. గ్రామ పంచాయతీ, మండల ప్రజాపరిషత్, జిల్లా ప్రజా పరిషత్‌గా పంచాయతీ వ్యవస్థలు నామాంతరం చెంది, రాష్ట్రవ్యాప్తంగా 1100పైగా మండలాలు వెలిశాయి. ఆ ఎన్నికల సందడితో ఆంధ్రప్రదేశ్ వేడెక్కింది. చైతన్యరథంలో ఎన్టీఆర్ ప్రచారానికి మళ్ళీ రోడ్డెక్కారు. చాలా రోజులు ముఖ్యమంత్రి హైదరాబాద్ వదిలి వెళ్ళాల్సిన పరిస్థితి కాబట్టి, నిఘా విభాగం తరపున ఒక అధికారిని ఆయన వెంబడి పంపాల్సి వచ్చింది. ఆ భారం నామీద పడుతుందని మొదట నేను అనుకోలేదు.

> ఎన్టీఆర్‌తో వెళ్ళబోయే ముందు నేను ఏ విధంగా మసులుకోవాలో అన్నీ సవిస్తరంగా దొర నాకు చెప్పటం వల్ల పరిస్థితి సులభమయింది. మొదట్లో అలా అనుకున్నాను. కానీ తర్వాత నాకు తెలిసింది, విషయం అంత సులభమైంది కాదని!

ఒక అధికారి ముఖ్యమంత్రితో మెలగటానికి కొన్ని నిబంధనలూ, నియంత్రణలూ వుంటాయి. ముఖ్యమంత్రి పేషీలో వుండే అధికారులకు ఆ రకంగా చూస్తే కొంత వెసులుబాటు వుంటుంది. హద్దులూ గీతలు స్పష్టంగా గీయబడి వుంటాయి. నిఘా విభాగంలో వుండి ప్రత్యేక పరిస్థితుల్లో ముఖ్యమంత్రి వెంట వుండటం అంటే కత్తిమీద సామే! మొదట్లో ఒకటి రెండు రోజులు నామీద నాకే జాలి కలిగేది. మిగతా వారు అంటే నా సహచరులు జిల్లాల్లోనో, హైదరాబాద్‌లోనో వాళ్ళ ఉద్యోగాలు వాళ్ళు చేస్తూ సుఖంగా గడుపుతూ వుంటే నాకేమిటీ చిత్రమైన ఉద్యోగపు అవస్థలు అనిపించేది!

తెల్లవారు ఝామున అయిదు గంటలకల్లా రెడీ కావాలి. ఆరోజు ఏఏ ప్రదేశాలకు వెళ్తున్నదీ జ్ఞాపకం చేయటంతోపాటు, రాష్ట్రంలో ఉత్పన్నమయిన శాంతి భద్రతల పరిస్థితీ, ప్రత్యేక ఘటనలూ, సంఘటనలూ ఒకటేమిటీ, అన్ని విషయాలు క్లుప్తంగా సీఎంకు వివరించాలి. ఆ తర్వాత సీఎంను ఫాలో అవుతూ ఎస్పీలతో సమన్వయం చేసుకోవాలి. మళ్ళీ హైదరాబాద్‌కు యిక్కడి వివరాలు, విషయాలు చెప్పాలి. సాయంత్రం ఒక చోటికి చేరింతర్వాత మళ్ళీ సీఎంతో పరిస్థితులు సమీక్షించే ధోరణిలో వివరాలు అందివ్వాలి. ఇలా దినచర్య పట్టిక వుండేది! ఆ రోజుల్లో సెల్‌ఫోన్లు లేవు, ఎస్‌టీడీపీ ఫోన్లు ఉండేవి. కానీ మార్గమధ్యంలో సీఎం కాన్వాయ్ వదిలి ఫోన్లు చేసుకొనే వెసులుబాటు వుండేది కాదు. ఎన్టీఆర్ నిముషాల మీద పని కావాలని అనేవారు. ఒకసారి ఏలూరు వదిలి వెళుతున్నప్పుడు ఒక వ్యక్తి పేరు చెప్పి మధ్యాహ్నం జంగారెడ్డి గూడెం చేరే సరికి ఆయన హాజరుగా వుండాలి. ఆయనతో అత్యవసరమైన పని వుంది అని చెప్పారు. ఆయన ఎవరో కాదు రావుగోపాలరావు! సినిమా నటుడే కాదు. ఆయన అప్పటికే రాజ్యసభ మెంబర్. పాలనాపరంగా ఢిల్లీలో ఏదో అంశానికి సంబంధించిన విషయాన్ని ఆయనతో ప్రస్తావించాలని ఎన్టీఆర్ అనుకున్నారు. తీరా వాకబుచేస్తే ఆయన శ్రీకాకుళంలో వున్నాడని తెలిసింది. ఆయనతో మాట్లాడి ఏదో విధంగా రాత్రికల్లా రాజమండ్రి, మేము అక్కడికి చేరే సమయానికి వుండాలని చెప్పాను. మధ్యాహ్నం లంచ్ సమయానికి జంగారెడ్డిగూడెం చేరుకోగానే ఎన్టీఆర్ అడిగిన మొదటి ప్రశ్న రావుగోపాలరావు ఎక్కడ అని? నేను వివరాలు చెప్పకుండా "సాయంత్రం రాజమండ్రిలో ఆయన కలుస్తాడు" అని చెప్పాను. ప్రచార సందర్భంగా చైతన్య రథంపైన, ఎండలో వుండటం ఎన్టీఆర్‌కు గూడా అప్పుడప్పుడు చిరాకు తెప్పించేది. కోపాన్ని 'ఐ యామ్ సారీ' అనే ఒకే ఒక్కమాటతో వ్యక్తపరిచేవారు. నేను ఆ విధంగా జవాబిచ్చినప్పుడు నన్ను చురుగ్గా చూస్తూ ఆమాటే అన్నారు. ఆ రాత్రి రావుగోపాలరావు వచ్చాడు కానీ ఎందుకనో ఎన్టీఆర్ చూడలేదు. తెల్లవారిన తరువాత ఆయనతో మాట్లాడింతర్వాత ప్రశాంతంగా 'శ్రీకాకుళం నుంచి వచ్చాడటగా! దగ్గర్లో వున్నాడనుకొని రమ్మన్నాను' అన్నారు. దొర నాకు చెప్పిన ఒక మార్గదర్శక సూత్రం ఏమిటంటే ఎన్టీఆర్ కోపంలో వున్నప్పుడు సహేతుకమైన విషయమైనా సరే చెప్పకుండా దాటేయటమే మంచిదని!

> ప్రచార ఒత్తిడి, ఏకధాటి ప్రసంగాలూ, చైతన్యరథం మీద గంటల తరబడి కూర్చోని వుండటం, యివన్నీ గూడా ఆయనకు చిరాకును తెప్పించేవి కానీ, చాలా దగ్గరి వాళ్ళ దగ్గర్నే చిరాకునూ, కోపాన్ని ప్రదర్శించేవాడు. ఇతరుల ముందు బయట పడక పోవడం ఆయన ఓపికకు తన మీద తనకు వున్న కంట్రోల్‌కు నిదర్శనంగా వుండేది.



మొదట్లో ఎన్టీఆర్‌తో ఎలా మెలగాల్నో సరిగ్గా నిర్ణయించుకోలేక నేను యిబ్బంది పడ్డాను. విషయాలను విడమర్చి చెప్పేటప్పుడు కానీ, సంఘటనలు విశదీకరించేటప్పుడు గానీ నాకు ఆయన రియాక్షన్స్ అర్థం గాకపోయేవి. చాలా చిన్న విషయంలో తప్పుపట్టేవారు. నేను చాలా ప్రాముఖ్యం గల విషయం అనుకున్న దాన్ని పట్టించుకోక పోయేవారు. ఒకరోజు ఉదయం చైతన్యరథంలో నేను ఒక విషయాన్ని చాలా సీరియస్‌గా ముందుకు వంగి ఆయనతో చెపుతున్నప్పుడు నన్ను నిశితంగా చూస్తూ ఆ విషయాన్ని వదిలేసి " యూ ఆర్ ఏ పోలీసు ఆఫీసర్, నిటారుగా కూర్చొని చెప్పండి" అన్నారు. నేను షాక్ తిన్నాను. నా పరిస్థితిని గమనించి తేలిగ్గా నవ్వుతూ " ఎస్. పోలీస్ మాన్ ఈజ్ ఆల్‌వేస్ ఏ పోలీసు మాన్" అని భుజం తట్టారు. నేను గూడా నవ్వుతూ తలూపక తప్పలేదు.

ఎన్టీఆర్ రాజకీయాల్లోకి సుడిగాలిలా వచ్చి ఎలక్షన్లలో గెలిచి ముఖ్యమంత్రిగా వ్యవహరిస్తున్నా నాకెందుకనో ఆయన సామాన్యంగా తారసిల్లే రాజకీయ నటుడిగా కనిపించలేదు. సినిమాల్లో చూడటం వల్ల బాగా తెలిసిన వ్యక్తిగా యింట్లో ఎప్పుడూ తిరుగాడుతూ యిది చేయి, అది వద్దు అని సరిదిద్దే పెద్దదిక్కుగా గోచరించేవారు. ఆ భావన నాలో బలపడిన తర్వాత నేను ఆయనతో సహజధోరణిలో ఎలాంటి పట్టింపులు

లేకుండా వ్యవహరించ సాగాను. ఏది చెప్పదలుచుకున్నా 'క్యాప్సూల్' తరహాలో క్లుప్తంగా చెప్పటం మొదలెట్టాను. బ్రీఫింగ్‌కు టైమ్ చాలా తక్కువగా వుండేది. తెల్లవారగానే మొదట వెంబడి వచ్చిన డాక్టరు ఆయన ఆరోగ్య పరిస్థితి రొటీన్‌గా చెకప్ చేసేవాడు. ఆ తర్వాత నా బ్రీఫింగ్ పది నిముషాలకంటే మించక పోయేది. అటు తర్వాత రాజకీయ నాయకులు, కంటెస్టు చేస్తున్నవాళ్ళు ఆ ఏరియాలోని పెద్ద మనుషులు, తెలిసినవారు ఆయన్ను కలుస్తుండటంతో బిజీబిజీగా సమయం గడిచిపోయేది. ప్రతిరోజూ అర్జెంట్ ఫైల్స్ మీద సంతకాలు తీసుకోవడంతోపాటు, పాలనా వ్యవహారాలను గురించి ఐఏయస్ ఆఫీసర్ చక్రపాణి ఏదో టైమ్‌లో తెలియజేస్తుండేవాడు. ప్రెస్‌కు సంబంధించిన విషయాలు గోటేటి రామచంద్రరావు వివరించేవాడు. ఉదయం ఎనిమిదిగంటల కల్లా చైతన్యరథం ఆయనతో ముందుకు కదిలేది. మేము ఊపిరిపీల్చుకొని ఎన్టీఆర్ ఒప్పచెప్పిన పనులు ఒకచోట కూర్చొని చక్కపెట్టే ప్రయత్నం చేసి, మళ్ళీ కాన్వాయిని ఎక్కడో ఒకచోట కలిసేవాళ్ళం.

ఒక్కొక్కప్పుడు బసచేసిన చోటి నుంచి కదలటం ఆలస్యమయ్యేది. విజిటర్లను త్వరగా చూడటంతో పాటు ఆలస్యం కాకుండా బయలుదేర తీయించే ప్రయత్నంలో 'సార్ మనం యివ్వాళ ఆలస్యం అయ్యాం, త్వరగా స్టార్ట్ కావాలి' అని ఓ రోజు ఉదయం చిన్నగా చెప్పాను. ఆయన ఒక్కడు వున్నప్పుడు కాకుండా కొందరితో వున్నప్పుడు ఆ విధంగా నేను చెప్పటం ఆయనకు నచ్చినట్లు లేదు. 'మొదట మీరు తొందరగా రావటం నేర్చుకోండి. తర్వాత నా సంగతి గురించి చెప్పండి' అన్నారు. ఆ ఉదయం ఎన్నడు లేనిది నేను కొంచెం ఆలస్యం అయ్యాను ఆయన బ్రీఫింగ్‌కు. ఇది గమనించిన ఆయన నాకు ఆ విధంగా చురక అంటించారు!.

నేను ఆయనకు విషయాలు 'బ్రీఫ్' చేస్తున్న సమయంలో ఒకసారి ఏదో రాసుకోటానికి పెన్ను అడిగారు. ఆ పెన్ను రాయటానికి మొరాయించింది.

"ఏం పెన్ను యిది" అని విసుగ్గా అన్నప్పుడు "ఏం చేయను సార్ రోజుకో పెన్ను పోతున్నది. అందుకే రూపాయి పెన్నులు పెట్టాను" అని అనగానే ఫక్కున నవ్వి ఓ మంచి ఖరీదైన ఫారిన్ పెన్ను ఆయన బ్రీఫ్ కేసులోంచి తీసి 'ఇది వుంచుకోండి' అని యిచ్చారు. తీసుకోటానికి నేను మొహమాట పడుతుంటే 'ద టీజ్ మై గిఫ్ట్. టేకిట్' అని అన్నారు.



నేను అవినీతి నిరోధక శాఖలోనే ప్రమోషన్ మీద పని చేస్తున్న కొద్ది కాలానికే 1994లో అసెంబ్లీ ఎన్నికలొచ్చాయి. ఎన్టీఆర్ ఆధ్వర్యంలో తెలుగుదేశం విజయ దుందుభి మోగించింది. మళ్ళీ ప్రభుత్వం మారటంతోనే అధికారుల ట్రాన్స్‌ఫర్ హడావిడి మొదలయింది. మొదటి విడత మార్పుల్లో నేను లేనందుకు హమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నాను. ఏసీబీ ఉద్యోగం వల్ల నా రచనా వ్యాసాంగాన్ని కొనసాగించే అవకాశం కలిగింది. వృత్తిలో తృప్తి, ప్రవృత్తిలో తృప్తి కలగటంతో ఏసీబీలోనే కొన్నాళ్ళు వుంటే బాగుంటుందని అనుకున్నాను.

అనుకోకుండా ఒకరోజు సీఎం ఆఫీసునుంచి నన్ను రమ్మని కబురు వచ్చింది. కలవటానికి వెళ్ళాను. అంతా సందడిగా ఉంది. మినిష్టర్లు, ఎక్స్‌మినిష్టర్లు విజిటర్స్ కోలాహలంగా వున్న వాతావరణాన్ని గమనిస్తూ వున్నా, 'సార్ రమ్మంటున్నారు' అని ఎవరో వచ్చి చెప్పారు. నెమ్మదిగా ఆ గదిలోకి వెళ్ళాను. నన్ను చూస్తూనే 'ఐయామ్ యాంగ్రీ విత్ యూ' అన్నారు ఎన్టీఆర్. నేను గతుక్కుమని "ఎందుకు సార్? నేనేమైనా తప్పుచేశానా?" అని నెమ్మదిగా అడిగాను.

"యస్. ఎందుకు మీరు నన్ను ఇన్నాళ్ళు చూడటానికి రాలేదు?" "సార్ నేను అధికారులతో పాటు వచ్చి మిమ్మల్ని గ్రీట్ చేశాను..." నా మాట కట్‌చేస్తూ "అలా చూడటం గాదు, ప్రత్యేకంగా ఎందుకు రాలేదు?" అన్నారు. దానికి నేనేం జవాబు చెప్పగలను? మాట్లాడకుండా నిల్చొనే వున్నాను. 'కూర్చోండి' గంభీరంగా చెప్పారు. ఈ ఇంటర్వ్యూ ఎలాంటి పరిణామాలకు దారితీస్తుందో అని భయపడుతూ కూర్చున్నాను. "ఇప్పుడు ఎక్కడ పని చేస్తున్నారు?" చెప్పాను. 'ర్యాంక్ ఏమిటీ?' అదీ చెప్పాను.

ఆ తర్వాత కాసేపు ఎంతో ఆత్మీయతతో అవీ యివీ మాట్లాడారు. "మీరు మళ్ళీ యాక్టివ్ పోస్టులోకి రావాలి. ఏది బెటర్ అని ఆలోచిస్తున్నాను" సాలోచనగా అన్నారు. 'నాకిది బాగానే వుంది సార్! సాహిత్యంలో నాకు ఇంట్రెస్ట్..." "పుస్తకాలు చదువుకోండి ఎవరు వద్దన్నారు?" "అప్పుడప్పుడు రాస్తుంటాను గూడా! అందుకని".. నసిగాను. "ఏవీవే మీ డీజీపీ, ఐటీ ఇంటెలిజెన్సు ఆర్పీతో మాట్లాడి నిర్ణయిస్తాం. యూ ఆర్ ఇన్ ఫర్ ఏ ఛేంజ్. మీకు బెస్ట్ పోస్టింగ్ ఇస్తాం" ఆయన లేస్తూ చెప్పారు.



నన్ను హైదరాబాద్ రేంజికి డీఐజీగా వేస్తారని నేను కలలో గూడా ఊహించని విషయం. సీఎం నాతో చెప్పిన నెలరోజుల తర్వాత ఆ పోస్టింగ్ వచ్చినట్లు జ్ఞాపకం. అప్పట్లో హైదరాబాద్ రేంజిలో రంగారెడ్డి, మహబూబ్‌నగర్, మెదక్, నిజామాబాద్, నల్గొండ జిల్లాలు వుండేవి. చాలా పెద్ద రేంజి. చాలా మంది ముక్కున వేలేసుకున్నారు. నాకు ఎన్టీఆర్‌తో అంతటి సాన్నిహిత్యం వుందా అని ఆశ్చర్యపోతూ ఆరా తీయసాగారు. నేను ఛార్జి తీసుకున్న తర్వాత ఒక మినిష్టర్ అడిగారు.

" ఏవిధంగా మానేజ్ చేశారు ఈ పోస్టింగ్?" అని. "సీఎం". నన్ను చెప్పనివ్వకుండా "ఓహ్! సీఎంని మానేజ్ చేశారా?" అన్నాడు విస్మయంతో.

నేను నవ్వి వూరుకున్నాను. అలాంటి ఇంప్రెషన్ వుండటం గూడా ఒక విధంగా మంచిదే! ఒత్తిడి వుండదు అనుకొని గుంభనంగా వుండ సాగాను.

నా పోస్టింగ్‌తోపాటు మరో విషయం కూడా నా పరపతిని అనుకోకుండా పెంచింది. నేను ఛార్జి తీసుకున్న సాయంకాలమే సీఎం ఆఫీసు నుంచి కొన్ని రోజుల క్రిందట వచ్చిన ఒక లెటర్ నాకు ఛార్జి ఇచ్చిన ఆఫీసర్ వెళుతూ, వెళుతూ ఇచ్చారు. ఆ కాన్ఫిడెన్షియల్ లెటర్ విప్పి చూశాను. దాదాపు 24మంది అధికారులను అనేక కారణాల వల్ల ఫలానా తారీఖు లోపు ట్రాన్స్‌ఫర్ చేయాలని అందులో వుంది. నా అదృష్టమో, దురదృష్టమో కానీ ఆ ఫలానా తారీఖు మర్నాడే అయింది. అంటే తక్షణం నేను దాన్ని అమలుపర్చాలన్నమాట. ఒకవేళ తొందరపడి ఆఫీసర్లు ఎవరో ఏమిటో తెలియకుండానే ఆ ఆర్డర్ అమలు పరుస్తే నన్ను గురించీ, నా పనితీరు గురించి రకరకాల ఊహాగానాలతో పాటు అనేక సందేహాలు వచ్చే అవకాశాలున్నాయి. ఎట్టి పరిస్థితిలోను తక్షణం ఆ ఉత్తర్వును అమలు చేయలేని పరిస్థితి. కాసేపు గట్టిగా ఆలోచించి నిర్ణయం తీసుకున్నాను. ఐజీపీ ఇంటెలిజెన్సు, డీజీపీతో నా ఇరకాటం ప్రస్తావించి "నేను సీఎం గారితో ఈ విషయం చర్చించే వెసులుబాటు కల్పించండి' అని అడిగాను. 'ఓయస్, ఆ ఆర్డర్ ప్రక్కన పడేయిస్తే అంతకంటే కావాల్సింది ఏముంది. నింపాదిగా మీరు వాళ్ళ పనితీరును సమీక్షించి నిర్ణయాలు తీసుకుంటేనే బాగుంటుంది" అన్నారు ఇద్దరు.

రెండో రోజు ఆదివారం. మామూలుగా సీఎం ఎవర్నీ చూసే అవకాశం లేదు. నేను ఆదివారం ఉదయం ధైర్యం చేసి సీఎం ఇంటికి ఫోన్ చేసి అపాయింట్‌మెంట్ అడిగాను. పదినిముషాల్లో ఫోన్ వచ్చింది. 'అర్జెంటుగా రమ్మంటున్నారు, ఆయనకు ఏదో టూర్ ప్రోగ్రాం గూడా వుంది' అని చెప్పారు. ఆలస్యం చేయకుండా వెళ్ళాను. నన్ను యూనిఫాంలో చూడగానే "హాపీ టు సీ యూ ఇన్ యూనిఫాం" అని నా సెల్యూట్‌ను స్వీకరించారు. నేను ధైర్యం చేసి టూకీగా ఆ లెటర్ సంగతి చెప్పాను.

సరిగ్గా విన్నట్లు అన్పించలేదు కానీ నాకు సూటిగానే జవాబొచ్చింది. "అది మీ రేంజి! మీ హెడేక్! మీమీద విశ్వాసం వుంది. ఏదైనా చేయండి కానీ మంచైనా, చెడు అయినా మీరే బాధ్యులు" అంటూనే విసావిసా టూర్ హడావిడిలో గది బయటకు నడిచారు. బాధ్యత నామీద పెట్టినా, నిర్ణయం నాదయ్యేసరికి నాలో విశ్వాసం పెరిగింది. ఆర్డర్ విత్ డ్రా కావటంతో నా 'స్టాక్' పెరిగింది!



అంతే! ఆ తర్వాత రెండు మూడుసార్లు అఫీషియల్ డ్యూటీలో ఎన్టీఆర్‌ను చూశాను. కానీ ప్రత్యేకంగా మాట్లాడే అవకాశం దొరకలేదు. మహబూబ్‌నగర్ జిల్లాలో ఎర్రసత్యం హత్య జరిగినప్పుడు ఆయన వచ్చారు. తిరిగి వెళ్తున్నప్పుడు అనుకోకుండా సీఎం ఒక పెట్రోల్ బంక్ దగ్గర ఆగాల్సి వచ్చింది. ఎడిషనల్ డీజీ దొరతో మాట్లాడుతూ నావైపు చూసి కారు దగ్గరికి రమ్మన్నారు. "ఈ కేసు జాగ్రత్తగా దర్యాప్తు చేయాలి, కారకులను వెంటనే అరెస్టు చేయాలి! అది మీ బాధ్యత" అన్నారు. నేను "యస్. సార్" అన్నాను. ఆ కేసు కొద్దిరోజుల్లోనే డిటెక్ట్ అయింది గూడా!

ఆ తర్వాత కొన్ని రోజులకే ఆయన మృతిచెందారు. ఆయన భౌతిక కాయాన్ని చూసినప్పుడు హృదయం ద్రవించి ఆయన నాపట్ల చూపిన అభిమానం సినిమా రీల్ లా కళ్ళముందు సంఘటనల దొంతరను కూర్చి కదలాడింది. ఎన్టీఆర్‌లాంటి అసామాన్య వ్యక్తితో నాలాంటి సామాన్యుడికి అనుభవాలు ఏర్పడటం కేవలం అదృష్టంగా భావిస్తున్నాను. నా జీవితాన్ని ఆ అమూల్యానుభవాలు సుసంపన్నం చేశాయనటంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు.



కునారిల్లుతున్న వ్యవసాయ రంగానికి కొత్త ఊపిరిలూది, ఆంధ్ర రాష్ట్రాన్ని మళ్లీ అన్నపూర్ణను చేసే ఆకుపచ్చని కార్యాచరణే చంద్రబాబు ఏడాది పాలన అంటూ నీరుకొండ ప్రసాద్ ప్రత్యేక కథనం



# ఏరువాక సాగారో రన్నో రైతన్న!

ప్రపంచంలోనే గొప్ప వ్యవసాయ దేశంగా పేరొందిన భారతదేశానికే అన్నపూర్ణ – ఆంధ్రప్రదేశ్. అటువంటి ఆంధ్రరాష్ట్రం ఆర్థిక వ్యవస్థకి వ్యవసాయం వెన్నెముక మాత్రమే కాదు, ఒక సాంస్కృతిక చిహ్నం కూడా. అక్షయపాత్రగా పేరొందిన రాష్ట్రంలో రైతన్న 'పంట విరామం' (క్రాప్ హాలిడే) ప్రకటించడం కంటే విషాదం మరొకటి ఉంటుందా? కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలు ఆంధ్రప్రదేశ్ ధాన్యాగారం; అందులో కోనసీమ ఒక సతత హరిత సీమ. అటువంటి చోట, అమలాపురం నియోజకవర్గంలోని బెండమూరు లంక – క్రాప్ హాలిడే ప్రకటించిన తొలి గ్రామం. తరతరాలుగా సాగుని తమ శ్వాసగా భావించిన బెండమూరు లంక రైతన్న 'పంట విరామం' ప్రకటించడానికి పడిన క్షోభ– రాష్ట్ర విభజన నాటి వ్యవసాయ రంగం దుస్థితికి ఒక ప్రతీక వంటిది. ఒక విలయం వంటి, విధ్వంసంలా జరిగిన రాష్ట్ర విభజన తర్వాత నెత్తురు పిండంలా మిగిలిన శేషాంధ్రప్రదేశ్ లోని 13 జిల్లాల్లో 'పంట విరామం' లాంటి విషాదమే తాండవించింది.

## వెన్ను విరిగిన వ్యవసాయ రంగం

కర్ణుడి చావుకి సవాలక్ష కారణాలన్నట్టు, రాష్ట్ర వ్యవసాయం గత పదేళ్లలో కోలుకోలేనంతగా దెబ్బతింది. అవినీతి, అసమర్థ, అసంబద్ధ విధానాలతో వ్యవసాయరంగం సంక్షోభంలో పడింది. సాగు ఖర్చులు విపరీతంగా పెరిగిపోయి, ఆసరా కరవై వరుస నష్టాలతో రైతులు అప్పుల ఊబిలో కూరుకుపోయారు. రైతు ఆత్మహత్యలు రోజువారీ వార్తలైపోయాయి. ఆదర్శ రైతు పథకం ద్వారా ఏడాదికి రూ28 కోట్లు, మేధోమధనం ద్వారా రూ. 127కోట్లు ఖర్చు చేసినా రైతుకి మేలు జరగలేదు. ఎరువుల ధరలు 14 సార్లు పెరిగాయి డిఏపి బస్తా రూ. 362 నుండి 1155కి, కాంప్లెక్స్ ఎరువుల బస్తా రూ 485 నుండి రూ 1193కి పెరిగి రైతుకి సాగు మోయలేని భారమైంది. సాగు నీటి కల్పనకు ఎకరానికి ఖర్చు నాలుగింతలై రూ. 4,06,772 లక్షలు ఖర్చుచేయాల్సి వచ్చినా ఫలితం లేకుండా పోయింది. సాగునీటి రంగానికి 80వేల కోట్లు ఖర్చు చేసినా 80వేల ఎకరాలకు కూడా నీరు చేరలేదు . వివిధ విపత్తుల వల్ల నష్ట పోయిన రైతులకు సాయంగా రూ.43,838 కోట్లు కేంద్రాన్ని అడగగా కేంద్రం విదిల్చింది రూ.7,895 కోట్లు మాత్రమే.

ప్రతి ఏటా ఐదు నుండి 10 లక్షల టన్నుల ఎరువుల కొరత ఏర్పడి ఎరువుల కోసం రైతులు రోడ్డెక్కితే రైతులను లాఠీలతో చితకబాదిన సంఘటనలు ఎన్నో. కనీస మద్దతు ధర దక్కక వ్యాపారులు, దళారుల బారిన పడి రైతులు విలవిలలాడారు. వ్యవసాయాన్ని సంక్షోభం నుండి గట్టెక్కించేందుకు వేసిన అనేక కమిటీలు చేసిన సిఫార్సులు చెత్త బుట్ట దాఖలయ్యాయి. 23,500 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకోగా, సేద్యాన్ని నమ్ముకొని బ్రతకలేమని నిర్ధారణకి వచ్చిన రైతులు దాదాపు 80 వేల మంది కాడి, మేడి వదిలేశారు.

## ఆపత్కాలంలో ఆపద్బాంధవుడు

అటువంటి దుర్భర పరిస్థితుల్లో సంక్షోభంలో ఉన్న వ్యవసాయ రంగాన్ని ఏ విధంగానైనా గట్టెక్కించాలని, రైతు కన్నీళ్లు తుడవాలని చంద్రబాబునాయుడు కంకణం కట్టుకున్నారు. ప్రతిపక్ష నాయకునిగా తన సుదీర్ఘ పాదయాత్రలో రైతుల కష్టాలు, కన్నీళ్లు, వ్యవసాయ సంక్షోభం ప్రత్యక్షంగా చూసి చలించిపోయారు. జాతికి పట్టెడన్నం పెడుతున్న రైతన్న సేద్యాన్ని వదిలేస్తే దేశానికి దిక్కేది? అందుకే ప్రమాదాన్ని నివారించడానికి రైతు సంక్షేమానికి ప్రణాళికలు రచించి పట్టాలెక్కిస్తున్నారు ముఖ్యమంత్రి చంద్రబాబు. ఉన్నత చదువులు చదివి ఉద్యోగాలు మాత్రమే చెయ్యాలని ఆలోచించే నేటి యువత వ్యవసాయం గురించి ఆలోచన చేసే విధంగా వ్యవసాయాన్ని లాభసాటిగా మార్చాలని ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రధానంగా వ్యవసాయ రంగంపైనే దృష్టి పెట్టారు.

రైతు పచ్చగా ఉంటేనే రాష్ట్రం పచ్చగా ఉంటుందని గ్రహించి సాగుని బాగుచేయడానికి తన ఏడాది

పాలనలో ఎన్నో సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకున్నారు. సాగు ఖర్చులు తగ్గించి,దిగుబడి పెంచి రైతు ఆదాయం పెంచడం వ్యవసాయాన్ని లాభసాటిగా మార్చడానికి చంద్రబాబు నేతృత్వంలోని రాష్ట్ర ప్రభుత్వం అధిక ప్రాధాన్యత ఇస్తుంది. రాష్ట్రం ఆర్థిక సంక్షోభంలో కునారిల్లుతున్న రైతు శ్రేయమే ధ్యేయంగా రూ. 14,183 కోట్లతో ప్రత్యేక వ్యవసాయ బడ్జెట్ పెట్టి, సంక్షోభంలో ఉన్న వ్యవసాయ రంగానికి ప్రాధాన్యత ఇచ్చింది రాష్ట్ర ప్రభుత్వం. వ్యవసాయ బడ్జెట్ ప్రణాళిక వ్యయం రూ. 4513 కోట్లు, వ్యవసాయ ప్రణాళికేతర వ్యయం రూ. 9670 కోట్లు కేటాయించి రాష్ట్ర రైతాంగం పట్ల ప్రభుత్వం తన ఉదారత చూపింది.

రైతు సాధికార సంస్థ(ఫార్మర్ ఎంపవర్మెంట్ కార్పొరేషన్)ను ఏర్పాటు చేశారు ముఖ్యమంత్రి. రైతుల రుణ విముక్తితో పాటు రైతు సంక్షేమం, అభివృద్ధి, సాధికారత లక్ష్యంగా ఈ సంస్థ పనిచేస్తుంది. వ్యవసాయ అనుబంధ రంగాలకు చెందిన కార్యక్రమాలు, పథకాలు ఈ సంస్థ ద్వారానే అమలు జరగనున్నాయి. ప్రభుత్వ, ప్రైవేటు భాగస్వామ్యంతో రూ. లక్ష కోట్ల నిధులు సమీకరిస్తుంది ఈ వ్యవస్థ. తక్కువ పెట్టుబడితో అధిక దిగుబడులు సాధించడం, వ్యవసాయ శాఖలో అంతర్భాగంగా ఈ కార్పొరేషన్ పనిచేస్తుంది. వ్యవసాయం,ఉద్యానవనం, సెరీ కల్చర్, పశుసంవర్ధకం, పాడి పరిశ్రమలను అభివృద్ధి చేసి వ్యవసాయ వృద్ధిరేటును 6 శాతం పెంచాలని ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకున్నది. ఇక్రీశాట్ సేవలను వినియోగించుకొని వాన నీటి సంరక్షణ, సూక్ష్మ సేద్యం ద్వారా కరువును ఎదుర్కొని వ్యవసాయ అనుబంధ రంగాల ఉత్పత్తి పెంచాలని ప్రభుత్వం తీవ్రంగా కృషి చేస్తోంది. వ్యవసాయ అనుబంధ రంగాల అభివృద్ధి కోసం ప్రైమరీ సెక్టార్ మిషన్ ను అనంతపురంలో మాజీ రాష్ట్రపతి అబ్దుల్ కలామ్ చేతుల మీదుగా ప్రారంభించింది రాష్ట్ర ప్రభుత్వం.

## పొలం పిలుస్తుంది

ప్రతివారంలో రెండు రోజులు ప్రభుత్వ అధికారులు వ్యవసాయ సిబ్బంది గ్రామాలను సందర్శించి రైతులకు మెరుగైన వ్యవసాయ సూచనలు, సలహాలు అందించేందుకు రాష్ట్ర ప్రభుత్వం 'పొలం పిలుస్తుంది' అనే కార్యక్రమం చేపట్టింది. ఇందులో మైక్రో న్యూట్రియంట్స్, డెఫిషీట్ పై రైతుల్లో అవగాహన, జిప్సం జింక్ సల్పేట్ , బోరాన్ శాతం పెంచడం వంటి చర్యలు ఈ కార్యక్రమం ద్వారా చేపట్టారు.

## నీరు-చెట్టు

వృక్ష సంపద అంతకంతకూ హరించుకుపోయి నేల, నీరు , వాయు కాలుష్యం ఉష్ణోగ్రతల్లోనూ మార్పులు వస్తున్నాయి. పర్యావరణంలో వాయు కాలుష్యాన్ని తగ్గించి ప్రాణ వాయువు అందించేందుకు వృక్ష జాతికి మించిన ఉత్తమ మార్గం మరొకటి లేదు . వాతావరణంలోకి ఆవిరి ని విడుదల చేసి వర్షాలుగా మార్చే శక్తి కూడా చెట్లకే ఉంది. అందుకే వృక్ష సంపద పెరగనిదే వాతావరణ పరిస్థితులు చక్కబడవు. రాష్ట్రాన్ని కరువు రహిత ఆంధ్రప్రదేశ్ గా మార్చేందుకు చెరువుల పూడికతీత, చెక్ డ్యాంల నిర్మాణం భూగర్భ జలాలు పెంచి జల సంరక్షణ చేపట్టి, చెట్ల పెంపకం ద్వారా నీటి నిర్వహణతో పాటు పర్యావరణాన్ని కాపాడటానికి 'నీరు-చెట్టు' అనే బృహత్తర కార్యక్రమాన్ని ప్రభుత్వం చేపట్టింది.

రాబోయే రెండేళ్లలో అనంతపురం, పశ్చిమ గోదావరి జిల్లాల్లోని మెట్ట మండలాలలో ఎస్‌సి, ఎస్‌టి రైతులకు 90 శాతం సబ్సిడీపై డ్రిప్ ఇరిగేషన్ పరికరాలను అందించనున్నారు. 'ఏ నేలలో ఏ పంటలు వెయ్యాలి? ఏ మోతాదులో ఎరువులు వెయ్యాలి? పంటలను చీడ పీడల నుండి కాపాడుకునేందుకు ఏ రకమైన చర్యలు తీసుకోవాలి? మంచి దిగుబడులు రాబట్టేందుకు మార్గాలు ఏమిటి?' ఇలాంటి విషయాల్లో రైతులకు మార్గ నిర్దేశం చేసి పంట పొలాల్లో సిరులు పండించేందుకు విస్తరణ వ్యవస్థను విస్తరించబోతుంది రాష్ట్ర ప్రభుత్వం.

## మట్టికి మరో పరిమళం

మొత్తం 18 వేల గ్రామాలలో 60 లక్షల మంది రైతులకు సాయిల్ హెల్త్ కార్డులు అందచెయ్యాలని నిర్ణయించారు చంద్రబాబు. 2018-19 నాటికి ఉద్యానవనం పంటలు విస్తీర్ణం 16 లక్షల హెక్టార్ల నుంచి 21 లక్షల హెక్టార్లకు పెంచాలని ఉత్పాదకతను 256 లక్షల టన్నుల నుంచి 330 టన్నులకు పెంచాలని, సూక్ష్మ సేద్యాన్ని 5.63 లక్షల హెక్టార్ల నుంచి 9.7 లక్షల హెక్టార్లకు పెంచాలని లక్ష్యంగా పెట్టుకున్నది రాష్ట్ర ప్రభుత్వం.

పాడి పరిశ్రమ ద్వారా రూ. 60వేల కోట్లు ఆదాయం సాధించాలని మత్స్య పరిశ్రమ ద్వారా 63వేల కోట్ల ఆదాయం పొందాలని లక్ష్యాన్ని నిర్దేశించుకున్నారు. రాష్ట్ర బడ్జెట్‌లో వ్యవసాయ అనుబంధ రంగాలకు ప్రణాళిక వ్యయాన్ని రాబోయే మూడేళ్లలో రూ.50వేల కోట్లకు పెంచాలని ప్రభుత్వం భావిస్తుంది.

వ్యవసాయ మార్కెట్ కమిటీలను ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి కేంద్రాలుగా మార్చి 10 వాణిజ్య పంటల మార్కెట్ కమిటీలు, 19 పండ్ల మార్కెట్ మార్కెటింగ్ కమిటీలు, 22 కూరగాయ మార్కెట్ కమిటీలు, 29 పశువుల మార్కెటింగ్ కమిటీలు అభివృద్ధి చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. రైతు బంధు పథకం కింద రుణ పరిమితిని రూ. లక్ష నుంచి 2 లక్షలకు పెంచి 180 రోజుల వరకు వడ్డీ రాయితీ ఇవ్వనున్నారు. రైతులకు రాబోయే ఐదు ఏళ్లలో వ్యవసాయ అనుబంధ రంగాలలో 10 లక్షల ఉద్యోగాలు సృష్టించాలని మొదటి ఏడాదిలో లక్ష మందికి శిక్షణ ఇవ్వాలని నిర్ణయించారు. రాబోయే ఐదు ఏళ్లలో డ్రిప్ ఇరిగేషన్ ద్వారా 9.5 లక్షల హెక్టార్ల సాగు విస్తీర్ణం పెంచాలని నిర్ణయించారు. విపత్తు బాధితులకు పరిహారం 250శాతం పెంచింది రాష్ట్ర ప్రభుత్వం. మృతుల కుటుంబాలకు రూ. 1,50,000 నుండి రూ. 5లక్షలకు పెంచడం జరిగింది.

## యంత్రభూతాల మెడలు వంచి...

వ్యవసాయ అనుబంధ రంగాలలో పెద్ద ఎత్తున యంత్రాలను ప్రవేశ పెట్టడం ద్వారానే రెండంకెల అభివృద్ధి సాధ్యమని ప్రాథమిక సెక్టార్ల వ్యవసాయ రంగంలో రూ. 1.38 లక్షల కోట్లుగా ఉన్న అభివృద్ధిని ఈ ఏడాది రూ. 1.64 లక్షల కోట్లకు చేర్చాలని లక్ష్యంగా పెట్టుకున్నది ప్రభుత్వం. వ్యవసాయ వృద్ధి రేటు పెంచే అంశాల్లో సుమిటోమో , కంబోర్తా, మహేంద్ర అండ్ మహీంద్ర సంస్థల సహకారాన్ని తీసుకోవాలని నిర్ణయించింది. అధునాతన పద్ధతులు వ్యవసాయ విస్తరణ పద్ధతులు అవలంబించబోతున్నారు. 70 లక్షల మంది రైతులను చేరుకోవడానికి శాఖాపరంగా సిబ్బంది, విస్తరణ పద్ధతులను మెరుగుపరచడానికి ఐ.సి.టి ఆధారిత సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించాలని ప్రతి వెయ్యి మంది రైతులకు బహుళ ప్రయోజనకర విస్తరణ అధికారులను నియమించబోతున్నారు. భూసార గుర్తింపులను మాపింగ్‌ల ద్వారా గుర్తించి రైతు తన భూమిలో ఎటువంటి పంటలు పండించాలో ఏ ఎరువులు వెయ్యాలో ఇతర సలహాలు తెలిపే కార్డులను ప్రతి రైతుకు అందించాలని ప్రభుత్వం నిర్ణయించింది.

## కరువును తరిమేసి...

సముద్రంలోకి వృధాగా పోయే గోదావరి జలాలను కృష్ణా ఆయకట్టుకు మళ్లించి తద్వారా కృష్ణా ఆయకట్టులో మిగిలే 80 శతకోటి ఘనపుటడుగుల (టీఎంసీ) ల నీటిని రాయలసీమకు తరలించి కరువుతో అల్లాడుతున్న రాయలసీమ రైతాంగాన్ని ఆదుకోవాలన్నదే ముఖ్యమంత్రి ధృఢ నిర్ణయం. పోలవరం పూర్తి చేయాలన్న లక్ష్యంతో ముఖ్యమంత్రిగా ప్రమాణం చేయకుండానే ఢిల్లీ వెళ్ళి ప్రధాని నరేంద్ర మోడిని కలిసి మొట్ట మొదటి కాబినెట్ మీటింగ్ లో పోలవరంపై ఆర్డినెన్స్ తీసుకొచ్చి ముంపు మండలాలను ఆంధ్రప్రదేశ్‌లో కలిసే విధంగా చేసి పోలవరానికి అడ్డంకులు తొలగించింది ముఖ్యమంత్రి చంద్రబాబే.

# రుణపాశం మిగిలున్నా... రుణశేషం సున్నా!

రైతులకి రుణమాఫి చేయడానికి చంద్రబాబు సంకల్పించడం వెనక ఉన్నవేవో జనాకర్షణ సూత్రాలు కావు. అభివృద్ధి, సంక్షేమం... వంటి విభాగాలకి ఎగువున, లాభనష్టాల బేరీజులకి అతీతంగా ఉన్నదే మానవత్వం. దేశానికి అన్నం పెట్టే రైతన్నను ఆదుకునే యత్నం గొప్పదని న్యాయధర్మాసనాలు కూడా సమర్థించిన మానవత్వ మహాయజ్ఞమే ముఖ్యమంత్రి చేపట్టిన రుణ మాఫీ. రైతు రుణమాఫీ అన్నది ఆర్థికభారం కాదని, రైతులకు ఆర్థిక భరోసాగా భావించి రైతు రుణమాఫీ బాధ్యతను తన భుజానికి ఎత్తుకున్నారు ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు.

**అప్పుల ఊబిలో ఆంధ్ర రైతు**

నేషనల్ శ్యాంపిల్ ఆర్గనైజేషన్ లెక్కల ప్రకారం దేశంలో అత్యధికంగా అప్పుల్లో ఉన్న రైతుల్లో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ మొదటి స్థానంలో ఉంది. దేశంలో సగటున 48.5 శాతం మంది రైతులు అప్పుల్లో ఉండగా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 82 శాతం రైతులు అప్పుల్లో ఉన్నారు. ప్రతి ఏటా విపత్తులు, విధ్వంసానికి నష్టపోతూ సాగు ఖర్చులు పెరిగిపోయి మద్దతు ధరలు లేక, పెట్టుబడులకు తెచ్చిన అప్పులు తీర్చే మార్గం లేక అప్పుల ఊబిలో కూరుకుపోయి కన్నీరు మున్నీరవుతూ, కొందరు ఆత్మహత్యలు చేసుకుంటూ, మరికొందరు సేద్యాన్ని నమ్ముకొని బ్రతకలేమని నిర్ధారణకు వచ్చిన రైతులు కాడీ, మేడీ వదిలేస్తూ వ్యవసాయం నుండి వైదొలుగుతున్నారు.

ఈ పరిస్థితుల్లో రైతుల రుణమాఫీ చేసి వారిని రుణవిముక్తులను చేసి వ్యవసాయాన్ని లాభసాటిగా మారుస్తానంటూ చంద్రబాబు నాయుడు హామీ ఇవ్వడం జరిగింది. సమైక్య రాష్ట్రంలో ఉన్న ఆదాయాన్ని దృష్టిలో పెట్టుకొని రుణమాఫీ హామీ ఇచ్చారు. తర్వాత రాష్ట్ర విభజన జరిగింది. అయినా, పాదయాత్రలో ఇచ్చిన హామీ ప్రకారం రుణమాఫీ వాగ్దానంపై వెనుకంజ వేయకుండా, 2014 లో జరిగిన ఎన్నికల మేనిఫెస్టోలో రుణమాఫీని చేర్చారు. ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన వెంటనే రుణమాఫీ ఫైలుపై సంతకం చేసి రుణమాఫీకి విధివిధానాలు రూపొందించడానికి కోటయ్య కమిటీని నియమించారు. ఇచ్చిన గడువులోగా అన్ని అంశాలు చర్చించి రాష్ట్ర ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా ఒక్కో కుటుంబానికి రూ.లక్ష వరకే రుణమాఫీ చేయాలని కోటయ్య కమిటీ సూచించినా, అందరికి న్యాయం చేయాలనే ఉద్దేశంతో ప్రతి కుటుంబానికి రూ.లక్షన్నర వరకు రుణమాఫీ చేయాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సాహసోపేతమైన నిర్ణయం తీసుకున్నారు. రుణమాఫీకి కేంద్రం సహకరించకపోయినా, హుద్‌హుద్ తుఫాన్ రాష్ట్రాన్ని అతలాకుతలం చేసినా, రూ.16 వేల కోట్ల ఆర్థికలోటు ఏర్పడినా, రిజర్వ్ బ్యాంక్ కనీసం రుణాలు రీషెడ్యూల్ చేయడానికి అంగీకరించకపోయినా, ఇచ్చిన మాటకు కట్టుబడి మానవతా దృక్పథంతో నిర్ణయం తీసుకున్నారు.

**బ్యాంకుల్లో రైతుల ఖాతాల వివరాలు:**

- బ్యాంకులు సమర్పించిన రైతుల ఖాతాల సంఖ్య : 83.28లక్షలు
- మొదటి & రెండవ విడత రుణ ఉపశమనం పొందిన ఖాతాల సంఖ్య : 51.45 లక్షలు
- తొలి & రెండవ విడతలో రైతులు ప్రయోజనం పొందిన సంఖ్య : 33.19 లక్షలు
- లబ్ధిపొందిన రైతు కుటుంబాల సంఖ్య : 27.87 లక్షలు
- పూర్తిగా మాఫీ అయిన కుటుంబాల సంఖ్య : 15.14 లక్షలు
- రూ.లక్షన్నర ఉపశమనం పొందే కుటుంబాల సంఖ్య : 3.96 లక్షలు
- లబ్ధిపొందిన ఎస్సీ, ఎస్టీ రైతు కుటుంబాల సంఖ్య : 3.56 లక్షలు
- లబ్ధిపొందిన చిన్న, సన్నకారు రైతు ఖాతాల సంఖ్య : 32.44 లక్షలు

| | | |
|---|---|---|
| రాష్ట్ర ప్రభుత్వంపై పడే భారం | : | రూ.25,000 కోట్లు |
| 2014-15లో ప్రభుత్వం విడుదల చేసిన మొత్తం | : | రూ.6,800 కోట్లు |
| మొదటి విడతలో విడుదల చేసిన మొత్తం | : | రూ. 4,624 కోట్లు |
| రెండవ విడతలో విడుదల చేయాల్సిన మొత్తం | : | రూ. 2,176 కోట్లు |

రైతులకు జారీ చేయబడుతున్న బాండ్లపై ప్రభుత్వానికి పడుతున్న వడ్డీ భారం రూ.2,561 కోట్లు

రూ.50 వేల రుణం వరకు ఏకమొత్తంలో చెల్లిస్తున్నారు. అంతకు మించి రుణం ఎక్కువ ఉన్న వారికి మొదటి విడతగా 20శాతం బ్యాంకు ఖాతాల్లో జమచేసి, మిగిలిన 80శాతానికి షూరిటీ పత్రాలు అందజేసి మిగిలిన మొత్తాన్ని 10శాతం వడ్డీతో నాలుగేళ్ళలో చెల్లించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఏపీలో 96.27 శాతం మంది రైతుల రుణాలు మాఫీ కానున్నాయి.

అదేవిధంగా, ఈ ఏడాది అనంతపురం జిల్లాకు 6 టీఎంసీల నీరు ఇచ్చే ఏర్పాటు చేయడంతో ఎండిపోయిన 20 వేల బోరు బావులు ఊరి, రైతులు రెండో పంట వేసుకున్నారు. పులివెందులకు 1.5 టీఎంసీల నీరు ఇచ్చి నారింజ ఇతర ఉద్యాన రైతులను ఆదుకుంది ప్రభుత్వం.

ప్రాధాన్యత క్రమంలో నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం పూర్తి చేసి పట్టిసీమ ఎత్తిపోతల పథకం, తాటిపూడి ఎత్తిపోతలతో పాటు, హంద్రీ-నీవా, గాలేరు-నగరి, వెలుగొండ ప్రాజెక్టులను వచ్చే ఏడాదిలోగా పూర్తి చెయ్యడంతోపాటు 2019 నాటికి పోలవరం ప్రాజెక్ట్ పూర్తి చెయ్యడం ద్వారా రాష్ట్రాన్ని కరువు రహిత రాష్ట్రంగా చేయాలని ప్రభుత్వం దృఢ సంకల్పంతో పని చేస్తుంది. అట్లాగే హంద్రీ-నీవా గాలేరు నదుల ప్రాజెక్టులు పూర్తి చేసి కడపలో 40 టీఎంసీలు, నెల్లూరు లో 140 టీఎంసీలు, చిత్తూరులో 50 టీఎంసీలు మొత్తం 230 టీఎంసీ ల నీరు నిలవ చేయాలని ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకున్నది.

ప్రజలకు నిత్యవస్తువులైన కూరగాయలు పండించే రైతులకు విత్తనాలలో 50శాతం రాయితీతో అందించాలని ప్రభుత్వం నిర్ణయించింది. దీనితో పాటు, విత్తన మార్పిడి కోసం రూ.50 కోట్లు, భూసార పరీక్ష కేంద్రాల పటిష్ఠతకు రూ. 90.59 కోట్లు, వ్యవసాయ యాంత్రీకరణ కొరకు రూ.141 కోట్లు, ఎరువుల కొనుగోలు పంపిణీ మార్క్‌ఫెడ్‌కు రూ. 60 కోట్లు, వడ్డీలేని రుణాలకు రూ.172 కోట్లు, వ్యవసాయ విశ్వవిద్యాలయానికి రూ. 124.48 కోట్లు కేటాయింపులు చేశారు.

కునారిల్లుతున్న వ్యవసాయ రంగానికి ఊతమిచ్చి, కొత్త ఊపిరి పోసి రైతన్నకి, వ్యవసాయ రంగానికీ పూర్వవైభవం తెచ్చి మళ్లీ రాష్ట్రాన్ని దేశ ధాన్యాగారంగా మార్చగలిగే మహానాయకుడు చంద్రబాబు నేతృత్వంలో మహా యజ్ఞం మొదలయ్యింది.



నీరుకొండ ప్రసాద్

❖

## మాతాశిశు మరణాలు

# పురిటి నవ్వులు పూయిస్తాం

ఏ జాతి పురోగతినైనా అంచనా వేయాలంటే ఆ సమాజంలో మాతాశిశు మరణాల నియంత్రణే ఆధారమంటారు. చావుపుట్టుకల పొలిమేరని తొక్కి వచ్చే ఏ ఒక్క తల్లినైనా కాపాడుకోలేకపోయినా, పసిగుడ్డు మాయ తుడిచి పొత్తిళ్లలో పదిలంగా పొదువుకోలేక పోయినా అది సమాజం మొత్తం బాధ్యత తీసుకోవల్సిన సామూహిక నేరమేనన్న అవగాహన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానిది.



పొరుగు రాష్ట్రాలైన కేరళ, తమిళనాడు చేసి చూపిన బాటలో అంతకంటే మెరుగైన పరిస్థితులు కల్పించి, మాతాశిశు మరణాలను పూర్తిగా లేకుండా చేయాలని సంకల్పించారు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు.

### పౌష్టికాహారం పంపిణీ – కాల్ సెంటర్లు

ఆంధ్రప్రదేశ్ 13 జిల్లాలలో గర్భిణులు, బాలింతలు, చిన్నారులకిచ్చే పౌష్టికాహార వివరాలను నమోదు చేసేలా కాల్ సెంటర్లు ఏర్పాటు చేయాలని ఇటీవలి మహిళా శిశు సంక్షేమ శాఖ సమీక్షలో ముఖ్యమంత్రి అధికారులకు సూచించారు. సమాచార వ్యవస్థలో ఆ వివరాలను ఎప్పటికప్పుడు తాజా సమాచారాన్ని పొందుపరచటం ముఖ్యమని చంద్రబాబు తెలిపారు. రాష్ట్రంలో అంబులెన్స్‌లపై కూడా తాజా సమాచారాన్ని కూడా ఇందులో జతచేసి ఒక్కో కేసు ప్రాతిపదికన వాటి వినియోగం అందుబాటుపై విశ్లేషించాలి అన్నారు. దీనికి అవసరమైతే 108 సర్వీసుల అంబులెన్స్ లను మరిన్ని సేకరించవచ్చు అన్నారు. గర్భవతులను అంబులెన్స్‌ల ద్వారా ఆస్పత్రులకు తీసుకెళ్లిన వివరాలను ఆయా కాల్ సెంటర్‌లలో నమోదు చేయడం ద్వారా వారికి అందే వైద్యం ,ఆహార వివరాలను ఎప్పటికప్పుడు తనిఖీ చేయడం సులభం అవుతుందని ముఖ్యమంత్రి అన్నారు. దీని వలన ఆస్పత్రులలో ప్రసవాల సంఖ్యను పెంచవచ్చుని, గర్భిణీల మరణాల రేటును తగ్గించవచ్చని ఆయన సూచించారు.

### పిల్లలే పెన్నిధి

దేవుడి ప్రతిరూపాలైన పిల్లల్ని ఏ వివక్షకీ తావులేని విధంగా పెంచి పెద్ద చేయాలని ముఖ్యమంత్రి హితవు చెప్పారు. ఐదేళ్ల లోపు పిల్లల వివరాలను, వారిలో పౌష్టికాహార లోపంపై సమాచారాన్ని ప్రతి ఏడాది నమోదు చేసి వ్యక్తిగత ఆరోగ్య సమాచారం నిర్వహించాలని అధికారులను ఆయన ఆదేశించారు. బాలికలకు ఫోలిక్ యాసిడ్, ఐరన్ ట్యాబ్ లెట్లు సక్రమంగా అందజేసి రక్త హీనత లేకుండా చూడాలన్నారు. మహిళలలో అవగాహన పెంచి బాల్య వివాహాలు జరగకుండా నిరోధించేలా చైతన్యం తీసుకురావాలని కోరారు. అంగన్ వాడీ మహిళలకు ఈ సమాచార సేకరణతో తగిన శిక్షణ ఇవ్వటం ద్వారా సమర్ధంగా విధులు నిర్వహించేలా చూడాలన్నారు.

### ఇలా మొదలైంది

ఈ-గవర్నెన్స్ లో భాగంగా రాష్ట్ర వ్యాప్తంగా గర్భిణులు, బాలింతలు, పోషకాహార లోపం ఉన్న చిన్నారులు ఇతర వివరాలను మహిళా శిశు సంక్షేమ శాఖ డిజిటలైజ్ చేసినట్లుగా ఈ సందర్భంగా అధికారులు ముఖ్యమంత్రికి తెలిపారు. రాష్ట్రంలో మొత్తం 4.5 లక్షల గర్భిణులలో 3.9 లక్షల మంది వివరాలను నమోదు చేశామని మిగిలిన వారి వివరాలు గ్రామాలు నుంచి ఇంకా రాలేదన్నారు . సిఎం కోర్ డ్యాష్ బోర్డులో పొందుపరిచిన 'హెల్త్ అండ్ ట్రాకింగ్ సిస్టమ్'లో గ్రామాలలో ఉన్న ప్రతి చూలాలు వివరాలను ఫోన్ నంబర్లతో సహా నమోదు చేసినట్లు ముఖ్యమంత్రికి వివరించారు.

❖



చారిత్రక వారసత్వానికి ఆధునికతను జోడిస్తూ, కొత్త రాజధానికి అమరావతి పేరు పెట్టడం ద్వారా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నవ్యాంధ్ర ప్రజల చిరకాల వాంఛను నెరవేర్చారు.

# అజరామరం అమరావతి

తెలుగు సంస్కృతితో పెనవేసుకుపోయిన పేరు. మన చారిత్రక వైభవాన్ని స్ఫురణకు తెచ్చే పేరు. కొత్త రాజధానికి అమరావతి పేరుని నిర్ణయించి, ఆంధ్రప్రదేశ్ కి కొంగొత్త భవిష్యత్తు ని నిర్మించబూనుకున్నారు ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు.

కొత్త రాజధానికొక కొత్తపేరు కావాలి. ప్రజల ఆశలకూ ఆశయాలకూ ఊపిరి పోయగల పేరు. రాష్ట్రం మూలమూలల్లోని ప్రతి పౌరుడూ తనదేనని భావించే పేరు. రాష్ట్ర సాంస్కృతిక వారసత్వానికి ప్రతీకగా నిలిచే పేరు, ఒక గొప్ప పేరు.

అనుకోడానికి బాగుందిగానీ ఆచరణలో అటువంటి పేరు దొరకడం సాధ్యమా?

అదృష్టవశాత్తూ మనవద్ద అలాంటి పేరొకటి ఉంది. చరిత్రలో పేరెన్నిక గాంచిన పేరు. మానవజాతి మూలాలనుండీ నేటివరకూ మన సంస్కృతితో పెనవేసుకుపోయిన పేరు. మన చారిత్రక వైభవాన్ని స్ఫురణకు తెచ్చే పేరు. సగానికి పైగా ప్రపంచానికి నాగరికతను నేర్పిన పేరు.

## ఆ పేరే అమరావతి

ఆ పేరు తలుచుకుంటే చాలు ప్రజాజీవనంలోనూ సాంస్కృతిక రంగంలోనూ, భారతీయ చరిత్రలోనే సర్వోత్కృష్టమైన ఒక మహాయుగం మన కనులముందు మెదుల్తుంది. అదొక సామ్రాజ్యానికి రాజధాని. విస్తీర్ణంలో రోమన్ సామ్రాజ్యానికి సరితూగినా, సంపన్నతలో సాటిలేనిది. అయితే రోమ్ ఐశ్వర్యమంతా అధికారవర్గానికి చెందిన ఏ కొద్దిమందికో గుత్తమైతే, ఇక్కడ సమాజంలో సామాన్య పౌరులైన వ్యవసాయదారులూ, పశు పాలకులూ, చేతి పనివాళ్లూ, వర్తకులూ ఆ సంపదకు సమాన భాగస్వాములయ్యారు. అందంలో పరిమాణంలో ప్రపంచంలోనే అద్వితీయమైన కట్టడాలు నిర్మించారు. వారి జీవన వైవిధ్యాన్నీ, వైభవాన్నీ కనులకుకట్టే అపారమైన శిల్పసంపదనీ సాహిత్యాన్నీ భావితరాలకు అందించారు. జీవనవిధానంలో, ఆహార్యంలో సరికొత్త పోకడలకు శ్రీకారం చుట్టారు. శిష్ట సంప్రదాయాలనూ, జానపదుల నమ్మకాలనూ సరిసమానంగా పోషించారు. కొత్త దేవుళ్లను సృష్టించారు. కొత్త మతాలను సృజించారు.

## వారెవరో కారు...

వాళ్లు మన తాతముత్తాతలు. మనలాగే సామాన్య స్త్రీపురుషులు, వేర్వేరు మతాలూ, వృత్తులూ, వారసత్వాలకు చెందినా తమనుతాము 'ఆంధ్రులు'అని పిలుచుకొన్నారు. వారి తలనగరం



అమరావతి. అది వారి పరిపాలనా కేంద్రమే కాదు వారి నాగరికతకే మూలస్థానం. ఒక చారిత్రకుని దృక్కోణంలో చూస్తే, ప్రాచీన నాగరికతకి బీజప్రాయమైన ఇనుపయుగం ఛాయలు దక్షిణభారతదేశంలోనే మొట్టమొదటిసారిగా అమరావతి ప్రాంతంలో వెలుగుచూసాయి. 'నేటికీ చెట్లకూ పుట్టలకు పూజలుచేసే సామాన్య గ్రామీణ జానపదులే ఆనాటి ప్రాచీన ఇనుపయుగ నాగరికతకు కావల్సిన పరికరాలనూ, పరిజ్ఞానాన్నీ తమ భుజస్కంధాలపై మోసి భరత ద్వీపకల్పానికంతటికీ పంచిపెట్టారు' అనే వాదన అక్షరసత్యం.

ఇది గతంలోకి ప్రయాణం... చరిత్రపొత్తంలోని తొలిపుటల్లోకి, నాగరికత మొలకలెత్తిన కాలానికి...

## తొలిమొలకలు - క్రీపూ. 500

అమరావతిలో పురాతత్వవేత్తలు జరిపిన తవ్వకాల్లో, లోతైన తొలిస్తరాల్లో గంగామైదానానికి చెందిన మెరుగుపెట్టిన నల్లని పాత్రలు (ఔఖ) వెలుగుచూసాయి. ఇది ప్రాచీన చారిత్రక యుగారంభంలో గంగాసింధుమైదానాల నాగరికతకూ, ఆంధ్రప్రాంతానికీ మధ్య సాంస్కృతిక సంబంధాలను ఋజువు చేస్తుంది. నేటి అమరావతి దగ్గర కృష్ణాతీరానికి కాస్త దూరంగా 'వడ్డమాను' అనే గ్రామం ఉంది. అక్కడ అతి ప్రాచీనమైన మట్టి స్తూపం, జైన సంస్కృతికి చెందిన కొన్ని నిర్మాణాలూ పురాతత్వ గవేషణల్లో వెలుగుచూసాయి.

> పురాణాల కాలానికే 'ఆంధ్రులు' అనే పేరు వారికి స్థిరపడింది. ఆ ఆంధ్రుల తలనగరమైన అమరావతి 'ఆంధ్రనగరి' అయింది. మహావీరుడు, బుద్ధుడి కాలాలకే ఆ నగరం ఒక గమ్యస్థానంగా రూపొందింది. మధ్యయుగ జైన సాహిత్యంలో, 'ఆవశ్యకసూత్ర' అనే గ్రంథం జైనుల ఆఖరి తీర్థంకరుడైన వర్ధమానమహావీరుడు కృష్ణాతీరాన్ని సందర్శించాడని చెబుతుంది. బౌద్ధ వాఙ్మయంలో కూడా గౌతమబుద్ధుడు అమరావతి వచ్చిన సూచనలు కనిపిస్తాయి.

అసలు గుట్టంతా ఆ వడ్డమాను పేరులోనే ఉంది. ఇనుప నాగలి రాకతో దిగువ కృష్ణా మైదానంలో వ్యవసాయం రూపురేఖలే మారిపోయాయి. కృష్ణాతీరం వరిసాగుకి కేంద్రమయింది. గ్రామాలు మిగులు ధాన్యానికి నెలవులయ్యాయి. వాటిలో ఒకదానికి వడ్ల-మాను అనే పేరు సంతరించింది. (మాను పదానికి చెట్టు అనే అర్థం చెప్పినా, దానిలో మణుగు, మానికె, మాళిగ, మాన్యం అనే పదాల మూలాలు వెదకవచ్చు). అమరావతిలోని మిగులు సంపద ఒక అయస్కాంతంలా చుట్టుపక్కల జనజాతులనే కాక దూరప్రాంతాల ప్రజలను కూడా తనవైపు ఆకర్షించింది. జనాభా పెరిగింది. కొత్త ప్రజల వలసలతో కొత్త భాషలూ, మతాచారాలూ, వాస్తు సామగ్రులూ ఆ సాంస్కృతిక మిశ్రణంలో వచ్చి చేరాయి. కొంతకాలానికి వడ్లమాను సంస్కృతీకరించబడి 'ధాన్యకటకం'గా మారింది. టిబెట్ బౌద్ధ గ్రంథాల్లో ధాన్యకటకం మూలాలపై ఈ ప్రక్రియను సూచించే కథనాలు కథలూ ఉన్నాయి.

ప్రాచీన వాఙ్మయం అమరావతి ప్రజలను నాగులు, అంధకులు, ఆంధ్రులు అనే పదాలతో సంబోధించింది. పురాణాల కాలానికే 'ఆంధ్రులు' అనే పేరు వారికి స్థిరపడింది. ఆ ఆంధ్రుల తలనగరమైన అమరావతి 'ఆంధ్రనగరి' అయింది. మహావీరుడు, బుద్ధుడి కాలాలకే ఆ నగరం ఒక గమ్యస్థానంగా రూపొందింది. మధ్యయుగ జైన సాహిత్యంలో, 'ఆవశ్యకసూత్ర' అనే గ్రంథం జైనుల ఆఖరి తీర్థంకరుడైన వర్ధమానమహావీరుడు కృష్ణాతీరాన్ని సందర్శించాడని చెబుతుంది. బౌద్ధ వాఙ్మయంలో కూడా గౌతమబుద్ధుడు అమరావతి వచ్చిన సూచనలు కనిపిస్తాయి. ఈ ప్రస్తావనలు అమరావతి ప్రాచీనతను క్రీపూ. 6వ శతాబ్దిలో చూపడమేగాక, అమరావతిని దక్షిణభారతదేశ నాగరికతకి కేంద్రబిందువుగా నిరూపిస్తాయి.

క్రీపూ 3వ శతాబ్దిలో అశోకుని కాలానికి



అమరావతి ప్రాంతంలో 7 వేలకు పైగా వెండీ బంగారు రోమన్ నాణాల నిధులు వెలుగుచూసాయి. చిన్నచిన్న నిక్షేపాలు దక్షిణభారతదేశంలోని తెలుగు మాట్లాడే ప్రజలున్న ప్రాంతాలంతటా కనిపించాయి. ఇది ధాన్యకటకం కేంద్రంగా రోమా వాణిజ్యంలో ఆంధ్ర వణిజులూ హస్తకళాకారులూ పోషించిన ముఖ్యపాత్రను ఋజువుచేస్తుంది. అంతేకాదు, ఆంధ్రరాజుల ప్రోత్సాహంతో తెలుగు వణిజులు తూర్పు సముద్రాంతర సీమలంతటా వలస రాజ్యాలు స్థాపించారు.



అమరావతి ఒక అభివృద్ధి చెందిన పట్టణం. ప్రఖ్యాతిగాంచిన అమరావతి మహాచైత్యం మరింత గొప్పతనం సంతరించుకుంది. కానీ ఆ నగరం, ఆ స్తూపం యొక్క నిండు వైభవాన్ని కళ్లజూడాలంటే ఆంధ్రశాతవాహనుల సామ్రాజ్యావిష్కరణం వరకూ ఆగక తప్పదు.

## వైభవం : క్రీపూ. 230 – క్రీశ. 225

ముప్పై తరాల ఆంధ్ర రాజులు 450 యేళ్ళ కాలం మగధను పాలించారని ఏకకంఠంతో చెప్తాయి పురాణాలు. ఇందులో అతిశయోక్తి లేదు. ఇది ఆనాటి భారతదేశంలో అత్యంత విస్తీర్ణం, ప్రాముఖ్యం కలిగిన ఏకైక సామ్రాజ్యం ఆంధ్రశాతవాహనులదేనన్న చారిత్రక వాస్తవాన్ని సూచిస్తుంది. రాజకీయ వడిదుడుకులను అనుసరించి, శాతవాహనులు అనేక పట్టణాలను కేంద్రాలుగా చేసుకొనితమ వ్యవహారాలను నడిపారు. కానీ వారి పాలనాయంత్రాంగానికీ, ఆర్థిక వాణిజ్యవ్యవస్థకూ, ఆధ్యాత్మిక ఉనికికీ రాజధాని అమరావతి మాత్రమే. అదే సాహిత్యంలో, శాసనాల్లో శ్రీధాన్యం, సిరితన, ధనకడ, తనకచెక, ధాన్యకటకం అనే అనేక పేర్లతో పిలువబడింది. ఈ పేర్లలో కనిపించే తేడాలు ఆనాటి మహానగరంలో నివసించిన ప్రజల్లోని భాషా, సంస్కృతుల వైవిధ్యానికి అద్దంపడతాయి.

శాతవాహన వంశంలో అత్యంత ప్రముఖుడైన శాతకర్ణి చక్రవర్తి తల్లి, గౌతమీ బాలశ్రీ వేయించిన నాసిక్ శాసనం, శాతవాహన సామ్రాజ్యం పూర్తి దక్షిణ భారతదేశాన్నేగాక ఉత్తరదేశంలోని ఆరావళీ శ్రేణిని దాటి విస్తరించిందని ఋజువుచేస్తుంది. ఆ రాజ్యానికి తలనగరమైన అమరావతిలో వివిధ భాషలకూ, సంస్కృతులకూ చెందిన ప్రజలు సహజీవనం చేసారనడం ఆశ్చర్యజనకం కాదు.

అమరావతి ప్రాంతంలో 7వేలకు పైగా వెండీ బంగారు రోమన్ నాణాల నిధులు వెలుగుచూసాయి. చిన్నచిన్న నిక్షేపాలు దక్షిణభారతదేశంలోని తెలుగు మాట్లాడే ప్రజలున్న ప్రాంతాలంతటా కనిపించాయి. ఇది ధాన్యకటకం కేంద్రంగా రోమా వాణిజ్యంలో ఆంధ్ర వణిజులూ హస్తకళాకారులూ పోషించిన ముఖ్యపాత్రను ఋజువుచేస్తుంది. అంతేకాదు, ఆంధ్రరాజుల ప్రోత్సాహంతో తెలుగు వణిజులు తూర్పు సముద్రాంతర సీమలంతటా వలస రాజ్యాలు స్థాపించారు. ఒకప్పటి ఆ రాజ్యాల పేర్లు త్రిలింగ (మ్యాన్మార్), కళింగ (థాయ్‌లాండ్), ఆందర (జావా ద్వీపంలోని పాలెంబాగ్). అన్నింటికన్నా ముఖ్యమైనదీ ఆశ్చర్యజనకమైనదీ 'ఇండోచైనాలోని అమరావతి రాజ్యం'. ఆ రాజ్యంలోని ముఖ్య నగరాల పేర్లు కుద్దూర, పాండర, విజయ. ఇవి దిగువ కృష్ణా మైదానంలోని సమకాలీన నగరాల మారుపేర్లే. ఈ పేర్లు మాత్రమే కాదు, ఆయా దేశాల్లో వెలుగుచూసిన అమారావతి శిల్పాల నమూనాలు, వారి సాంస్కృతిక వారసత్వంలో జానపద కళల్లో ఈనాటికీ కనిపించే తెలుగుతనం, ఆగ్నేయాసియా దేశాల నాగరికత విస్తరణ ప్రక్రియలో ఆంధ్రుల ప్రభావాన్ని సూచిస్తాయి. అలా దేశదేశాల నుంచీ వచ్చి చేరిన సంపద అమరావతిని ప్రపంచంలోనే ఆనాటి అత్యంత సంపన్నవంతమైన నగరాన్ని చేసాయి.

ఆనాటి అమరావతీ నగర వైభవాన్ని కనులజూడాలంటే, తెలుగువారి కన్నతల్లియైన కృష్ణవేణి ఒడ్డున నిల్చొని, కనులు మూసుకుంటే చాలు. ఆ కిష్టమ్మ గలగలల్లో, ఆనాటి గాథలు వినిపిస్తాయి, ఆ నల్లేటి లోతుల్లోంచి ఆనాటి ఆంధ్రుల వైభవం ఎగిసివచ్చి మనముందు నిలుస్తుంది. పురాతత్వ ఆధారాలూ, సాహిత్యంలోని వర్ణనలూ, చిత్రవిచిత్రమైన అమరావతి శిల్పాల్లో కనిపించే ఆనాటి జీవనసరళీ ఆ ఊహలకు బాసటగా నిలుస్తాయి.

చైనావారి ప్రమాణాలను బట్టి ఆనాటి మహానగరం కృష్ణానది కుడిగట్టున 5లీ, అంటే నేటి లెక్కల ప్రకారం, 12కిమీ. పొడవున విస్తరించింది. రెండు మూడు అంతస్తులతో కిటికీలతో గట్టు వెంట గుమికూడినట్లు అనేక కట్టడాలు. నగరం పడమటి అంచున కోట, చుట్టూ తోటలతో, కృష్ణానది నీటితో నింపిన అగడ్తతో అన్నివిధాలా కట్టుదిట్టమైనది. చరిత్ర గమనంలో ఆంధ్రదేశంలో ఎన్నెన్నో కోటలు కట్టబడినా 'కోట' అనే పదానికి చిరునామాగా నిలిచిన ధరణికోట అదే. అది చక్రవర్తి ప్రాసాదం.



కోటనుండి ఉత్తర దక్షిణాలుగా విశాలమైన రాజమార్గం, దానిని 'మహాపథం' అని పిలిచారు. పరిపాలనా వ్యవస్థకి చెందిన వివిధ కార్యాలయాలూ, నిగమాలూగోష్ఠి అనబడే సభాభవనాలూ ఆ మార్గంలో ఉండేవి. ఆ మహాపథం కోట నుండి సంప్రతివిహారమనే జైన ఉపనగరం ద్వారా నగరం వెలుపల నిలిచిన సైనిక స్కంధావారాల వరకూ సాగివుండవచ్చని ఊహించవచ్చు.

నౌకాశ్రయం నుండి ఉత్తరదక్షిణాలుగా సాగిన మరో ముఖ్యమార్గం పేరు 'తోరణమార్గం'. ఇది ముఖ్యమైన విపణివీధి కావచ్చు. ముఖ్యనౌకాశ్రయం సాంకేతికపరంగా ఒక అద్భుతమైన నిర్మాణమని చెప్పవచ్చు. కోటకు తూర్పున సముద్రయానం చేసే పెద్దపెద్ద నావలుకూడా నిలబడేందుకు అనువుగా నదిలో తవ్విన లోతైన రేవుకి ఇరుపక్కలా ఇటుకలూ, రాళ్లతో తాపడంచేసారు. మూడంతస్తుల రోమన్ వర్తక నౌకలూ, చైనాదేశపు జోంగు ఓడలకు అదొక ముఖ్యమజిలీగా ఉండివుండవచ్చు అనడంలో అతిశయోక్తి లేదు. పశ్చిమాన్నుంచి యవన, పారశీక, రోమాదేశపు వర్తకులూ, తూర్పు సముద్రం ఆవలి తీరలనుండి, చీనీ, మలయ, సువర్ణద్వీపాల వర్తకులతో ఆ విపణివీధి కళకళలాడేది. ఇరువైపులా అంగళ్లలో దేవదారు, చందనం, పాలరాయి, కంచు; ముడిపదార్థం ఏదైనాసరే దానిని అద్భుతమైన కళాఖండాలుగా తీర్చిదిద్దిన ఆంధ్ర వర్ధంకుల, హస్తకళాకారుల నైపుణ్యం దర్శనమిస్తుంది. రోమ్ నగరంలోని మహళ్లను అలంకరించేదుకు, చైనానుండి దిగుమతి చేసుకొన్న ముడిపట్టును అద్భుతమైన పట్టుబట్టగా నేసి పదిరెట్లు లాభం ఆర్జించిన ఆంధ్ర నేతగాళ్ల వ్యాపారకుశలత అసమానం. కృష్ణాతీరంలో కలంకారీ అద్దకాలతో మెరిసే రంగురంగుల నేతబట్టలూ, ఉల్లిపొరకన్నా సన్నగా నేసిన రవపట్టం రోమా స్త్రీలకు ఎంత ప్రియమంటే, వాటి దిగుమతుల కొరకై యేటా కొన్ని కోట్ల విదేశీమారకం వ్యయమౌతుందని ప్రఖ్యాత రోమన్ రచయిత ప్లైనీ వాపోయాడు. వివిధ పరిశ్రమలకు చెందిన చేతిపనివాళ్లూవర్తకులూ, నిగమాలు గోష్టులు అనే సంఘాలుగా ఏర్పడ్డారు. ఈ సంఘాలు నగర పాలనా వ్యవస్థలో పాలుపంచుకునడమేగాక వృత్తి విద్యల్లో నైపుణ్యాన్ని సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసే కార్యక్రమాలు కూడా చేపట్టాయి.

ఆ విపణివీధినుండి అనేక పక్కవీధులు వివిధ నిగమాలకు చెందిన ఉపనగరాలకు దారితీసేవి. నివాసగృహాలు, చుట్టూ పెరడుతో తోటలతో, కంచె లేదా పెరటి గోడలతో విశాలంగా నిర్మించుకున్నారు. ఐశ్వర్యవంతుల ఇళ్లు గచ్చునేలలతో, ఇటుకలూ లేదా రాళ్ళతో, పైపెంకులతో చుట్టూ గదులతో నిర్మించిన మండువా లోగిళ్లు. సామాన్యుల ఇళ్ళు తడికలపై గారసున్నం అలికిన గోడలూ, కలప దూలాలపై రెల్లు లేదా తాటాకు కప్పుతో కట్టినా, విశాలంగా నిర్మించారు. కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, చర్మకార, నేత వంటి వృత్తిపనులన్నీ కుటీరపరిశ్రమల్లా ఇంటివద్దనుండే సాగేవి. పురాతత్వవేత్తలు అమరావతి, సాతానికోట, నాగార్జునికొండ, ధూలికట్ట వంటి ఆనాటి శిధిల నగరాల తవ్వకాల్లో చేతి పనిముట్లు, మగ్గాలు, కొలిముల ఆనవాళ్లను బట్టి ఆనాటి వృత్తి పనివాళ్ల గృహసముదాయాలు వేరువేరు వాడలుగా విభజింపబడ్డాయని ప్రతిపాదించారు. తరువాతి సమాజాల్లోని జాతి, ఉపకులాలవ్యవస్థ మూలాలను ఆ నగర ప్రణాళికలోచూడవచ్చు.

ఆ నగరంలో సహజీవనం చేసిన వివిధ నేపధ్యాలకు చెందిన ప్రజలు వేర్వేరు మతాలనూ ఆచారాలనూ పోషించారు. అధికారికంగా ఆనాటి రాజులది పురాణ సంప్రదాయానికి చెందిన భాగవత మతం, అది నేటి హిందూ సంప్రదాయానికి తొలుత రూపం. శాతవాహన వంశానికి చెందిన రాణుల శాసనాలు వాసుదేవ, సంకర్షణుల ప్రశస్తితో మొదలౌతాయి. అమరావతి శిల్పరచనలో గణపతీ, లక్ష్మీ వంటి దేవతల తొలిరూపాలు కనిపిస్తాయి. ఆనాటి ధాన్యకటకపు ఉపనగరమైన వడ్డమానులోని సంప్రతివిహారం ఒక జైన నిర్మాణమని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. అయితే ఆనాటి మహానగరంలో అత్యంత ప్రజాదరణ పొందినది మహాయాన బౌద్ధం. ధాన్యకటకానికి రెండు దిక్కులా పూర్వశైల, అవరశైల ఆరామాలు శ్రమణ సంప్రదాయానికి చెందిన ఉన్నత విద్యాలయాలు. ప్రపంచపు

**రోమ్ నగరంలోని మహళ్లను అలంకరించేదుకు, చైనానుండి దిగుమతి చేసుకొన్న ముడిపట్టును అద్భుతమైన పట్టుబట్టగా నేసి పదిరెట్లు లాభం ఆర్జించిన ఆంధ్ర నేతగాళ్ల వ్యాపారకుశలత అసమానం. కృష్ణాతీరంలో కలంకారీ అద్దకాలతో మెరిసే రంగురంగుల నేతబట్టలూ, ఉల్లిపొరకన్నా సన్నగా నేసిన రవపట్టం రోమా స్త్రీలకు ఎంత ప్రియమంటే, వాటి దిగుమతుల కొరకై యేటా కొన్ని కోట్ల విదేశీమారకం వ్యయమౌతుందని ప్రఖ్యాత రోమన్ రచయిత ప్లైనీ వాపోయాడు.**





మూలమూలల్లో బౌద్ధ ప్రవచనాలను చాటిచెప్పిన అధ్యాపకులూ, విద్యావేత్తలూ ఆ ఆరామాల్లో నివసించారు. మహాయాన బౌద్ధం ఆనాటి తెలుగు ప్రాంతమంతటా ఒక వెలుగువెలిగింది. ఈనాటికీ తెలుగు భాషపైనా, తెలుగువారి ఆచార వ్యవహారాలపైనా మహాయనబౌద్ధ ప్రభావం అంతాయింతాగాదు. అమరావతి మహాచైత్యం ఒక వెయ్యేళ్లబాటూ తెలుగునాటికి ఒక భౌగోళిక ఆనవాలుగా నిలిచి పూజలందుకుంది. ఆదిశంకరుని ఆధ్యాత్మిక చింతనలో, హిందూ స్మార్త సంప్రదాయంలో నేటికీ మాధ్యమికవాదపు వారసత్వం కనిపిస్తుంది.



## వారసత్వం : క్రీశ. 300 నుండి నేటివరకూ

నాలుగున్నర శతాబ్దాల అనంతరం శాతవాహన సామ్రాజ్యం క్షీణించింది. రోమన్ సామ్రాజ్యం కూడా పతనమైంది. వాణిజ్యం శూన్యమైంది. నగరాల్లో జీవనాధారాలు కరవయ్యాయి. అయినా ధాన్యకటకం మాత్రం మరికొన్నాళ్లు తన ప్రాభవాన్ని నిలుపుకుంది. క్రమేణా రాజకీయ బలం అమరావతిని వదిలి తెలుగు ప్రాంతాల సరిహద్దులకు కదిలిపోయింది. ధాన్యకటకంలో పుట్టిన పల్లవ వంశాల శాఖలు తమ రాజధానులను దక్షిణాన కంచికి, పశ్చిమాన హేమావతికి మార్చాయి. తూర్పున వాశిష్టీపుత్ర శివశక్తి కళింగ ప్రాంతంలో మాఠరుల రాజ్యానికి శ్రీకారం చుట్టి తన రాజధానిని ఒరిస్సా సరిహద్దులకు మార్చాడు. నాగార్జునికొండకి చెందిన కొండచుటుకి సామంతులు, పశ్చిమ దక్కన్ పీఠభూమిలో, బాదామి చాళుక్యులుగాప్రాముఖ్యానికి వచ్చారు. ఆనాటి నుంచీ ఆంధ్రులు తమదీ అని గర్వించదగ్గ రాజధాని నిర్మించుకోలేక పోయారు. మధ్యయుగంలోకాకతీయ గణపతిదేవుని కాలంలో ఓరుగల్లు కొంతకాలంపూర్తి తెలుగు ప్రాంతానికి తలనగరమైనా, అది ఒక అర్ధశతాబ్ది మాత్రమే.

అయినా, అమరావతి ఒక ఆధ్యాత్మిక కేంద్రంగా తన స్థానాన్ని నిలబెట్టుకుంది. క్రీశ. 14వ శతాబ్ది వరకూ దూరదేశాలనుండి కూడా బౌద్ధభిక్షువులు అమరావతి స్తూపాన్ని సందర్శించేవారని శ్రీలంకలోని బౌద్ధవాఙ్మయం ధృవీకరిస్తుంది. కొన్ని స్థానిక రాజవంశాలు కూడా అమరావతిలోని బౌద్ధ సంఘాలకు సహాయసహకారాలు అందించారని శాసనాధారాలు ఉన్నాయి. కానీ దేశంలో ఆనాటికే బౌద్ధం పతనావస్థకి చేరుకుంది. శైవం విజృంభించింది. అమరావతి అమరేశ్వరుడి నెలవైంది. పంచారామాలనే శైవక్షేత్రాల్లో ప్రముఖమైన అమరారామం అయింది. తూర్పుచాళుక్యరాజు భీముడి కాలంలో ప్రతిష్ఠించిన ఆలయాన్ని కొండవీటి రెడ్డిరాజులు పునఃప్రతిష్ఠచేసి పోషించారు. కానీ 18వ శతాబ్దికి స్థానిక శివాలయానికి చెందిన అగ్రహారం తప్ప మరేమీ మిగల్లేదు. అమరావతిని ప్రజలు కూడా దాదాపు మరిచిపోయారు.

1796లో జరిగిన ఒక చిన్న సంఘటన వల్ల అమరావతికి కొత్త ప్రాముఖ్యం సంతరించింది. ఆంగ్లేయుల ప్రాభవం కోస్తా జిల్లాలలో స్థిరపడటంతో, స్థానిక జమిందారు రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు, తన నివాసాన్ని కృష్ణాతీరంలోని అమరావతి గ్రామానికి మార్చాడు. ఆ ఊరి వెలుపల దీపాలదిన్నె అనే పేరుతో అప్పటికే మట్టిదిబ్బగా మారిన మహాచైత్యాన్ని గుర్తించాడు. మరుగున పడిన శిల్ప సంపదని వెలికితీసి ఆనాటి ఆంగ్లేయ ప్రభుత్వాధికారులకి తెలియజేసాడు.

అంతే, పురావస్తు సంగ్రహకులూ, ఆంగ్లేయ ప్రభుత్వాధికార్లూ, పురాతత్వవేత్తలమని చెప్పుకునే ప్రబుద్ధులూ ప్రపంచం నలుమూలలనుండీ అమరావతికి తరలివచ్చారు. మన వారసత్వ సంపద ఇల్లువీడి వలసపోసాగింది. తవ్వకాల్లో వెలుగుచూసిన శిల్పసంపద ఆంధ్రుల ప్రాచీన చరిత్రపై ఆసక్తిని రగిలించింది, కానీ అదే సమయంలో మనవైన కళాఖండాలు ఆనాటి అధికార కేంద్రాలకు తరలిపోసాగాయి. వెయ్యేళ్లపాటూ తమదీ అని చెప్పుకోదగ్గ రాజధాని నగరమేలేని ఆంధ్రుల సాంస్కృతిక వారసత్వం లండన్, మద్రాసు వంటి నగరాలనుచేరకతప్పలేదు.

1880ల్లో ఆంగ్లేయ ప్రభుత్వాధికారానికి తిరుగులేని రోజుల్లో పురాతత్వ కట్టడాల సంరక్షణాధికారిగా అమరావతిని దర్శించిన బ్రిటిష్ అధికారి, మేజర్ హెన్రీ కోల్, ఆ శిల్పాలను అమరావతి నుంచి తరలించే ప్రయత్నాలను ఖండించాడు. అమరావతి శిల్పాలు స్థానికుల వారసత్వం కనుక అవి అమరావతిలోనే భద్రపరచాలని వాదించాడు. తన ఉత్తరాల ద్వారా పురాతత్వ సర్వే అధికార్లనే గాక వైస్ రాయ్, లండన్లో?ని సెక్రెటరీ ఆఫ్ స్టేట్ వంటి అధికార్లను కూడా నిలదీసాడు. కానీ ఆనాటి అధికార్లు అతడి వాదనలు పెడచెవిన పెట్టారు. మద్రాసులో ఉంటే అవి అందరికీ అందుబాటులో ఉంటాయని వాదించారు.

ఇన్నాళ్లకు ఆంధ్రప్రజలు తమదీ అనుకొనే రాజధానిని నెలకొల్పుకోబోతున్నాం. ఈ కొత్తనగరానికి అమరావతి అని నామకరణం చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నిర్ణయం అభినందనీయం. పరరాజ్యాల్లో మురుగుతున్న మన వారసత్వ సంపదని స్వంత ఇంటికి తిరిగి తెచ్చుకోవడానికి ఇంతకంటే మంచి తరుణం రాదు. ఇది తెలుగువారిగా మనందరి బాధ్యత.

తెలుగువారి చరిత్ర, సంస్కృతి మీద లోతుగా అధ్యయనం చేస్తున్న సాయి పాపినేని, అమరావతి నగర చారిత్రిక వైభవం గురించి "ఆంధ్ర నగరి" అనే నవలను రచించారు.



❖

# అమరావతి

## అత్యాధునిక ప్రజా రాజధాని



నారా చంద్రబాబు నాయుడి మస్తిష్కంలో మెరిసిన ఆలోచనా తరంగం మూలంగా ఆంధ్రుల చారిత్రిక నగరం అమరావతి పేరు మరోసారి మారుమ్రోగనుంది. నవ్యాంధ్ర రాజధానిగా రూపుదిద్దుకుంటున్న 'అమరావతి', ముఖ్యమంత్రి చొరవతో ప్రపంచ స్థాయి ఆదునిక ప్రజా రాజధానిగా కీర్తి శిఖరాలను అందుకోడానికి సర్వసన్నద్ధమవుతోంది.

చారిత్రక పట్టణం అమరావతి,
ఆధ్యాత్మిక కేంద్రం అమరావతి,
పురాణ ప్రసిద్ధం అమరావతి,
ధాన్యాగారానికి కేంద్ర బిందువు అమరావతి,
వాణిజ్యంలో గణతికెక్కిన ప్రాంతం అమరావ,తి
బుద్ధుడు నడయాడిన పుణ్యధామం అమరావతి,
బుద్ధుని అవశేషాలకు చిరునామా అమరావతి,
మహా సామ్రాట్ అశోకుడిని సభ్రమాశ్చర్యపరిచన పట్టణం అమరావతి,
చైనా యాత్రికుడు, బౌద్ధ బిక్షువు హుయాన్ సాంగ్‌ను విస్మయానికి గురిచేసిన ప్రదేశం అమరావతి.

ఇప్పుడు అమరావతి మరో ప్రత్యేకతను సంతరించుకుంది. చారిత్రక ప్రసిద్ధి పొందిన అమరావతి ఇప్పుడు ఇది నవ్యాంధ్ర రాజధానిగా సరికొత్త చరిత్ర సృష్టించబోతోంది. ఆంధ్రప్రదేశ్ ప్రాశస్త్యం పున:ప్రతిష్ట ప్రాణం పోసుకుంటున్నది. క్రీ.శ. రెండో శతాబ్దంలో శాతవాహన సామ్రాజ్యంలో గణుతికెక్కిన అమరావతి పేరును ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు నవ్యాంధ్ర నూతన రాజధానికి నామకరణం చేయడంతో మరోసారి దేశ, విదేశీ ప్రజలను ఆకర్షించింది. నవీన కాలంలో అత్యాధునిక ప్రజారాజధానిగా అమరావతి ఇంకోసారి మకుటాయమానం కానుంది. ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధం చెందడానికి ఆస్కారం ఏర్పడింది.

స్వాతంత్ర్యానికి పూర్వం వరకూ అనేక విషయాల్లో ప్రపంచాన్ని ఆకర్షించి ఒక వెలుగు వెలిగిన పట్టణం అమరావతి. స్వతంత్ర దేశంలో పాలకుల నిర్లక్ష్యానికి నిలువుటద్దంలా నిలిచిన అమరావతి ప్రాశస్త్యం మసక బారింది. విభజనానంతరం నవ్యాంధ్ర ముఖ్యమంత్రిగా బాధ్యతలు స్వీకరించిన నారా చంద్రబాబు నాయుడి మస్తిష్కంలో మెరిసిన ఆలోచనా తరంగం మూలంగా అమరావతి పేరు మరోసారి మారుమ్రోగనుంది. ఆంధ్రప్రదేశ్ రాజధానిగా ఎంపిక చేసిన ప్రాంతానికి 'అమరావతి' పేరును ఖరారు చేస్తూ మంత్రిమండలి తీర్మానం చేసింది. అమరావతి పేరు పెట్టడంతో ప్రపంచంలోని తెలుగు జాతికి ఆనందదాయకంగా పరిణమించింది. తెలుగుదనం ఉట్టి పడేలా ఉన్న కొత్త రాజధాని పేరు భవిష్యత్తు తరాలకు సైతం వారసత్వ సంపదగా మిగలనుంది.

అమరావతి పేరులో వాస్తు బలం, నామబలం ఉండటం, భారతీయ నిర్మాణ సంప్రదాయాలకు అనుగుణంగా ఈ ప్రాంతం ఉండటం శుభసూచకమని ముఖ్యమంత్రి అన్నారు.

### ప్రవాసాంధ్రుల హర్షం

ఏపీ రాజధానికి అమరావతి పేరు పెట్టాలన్న ప్రభుత్వ నిర్ణయానికి అన్ని వైపుల నుంచి హర్షం వ్యక్తం అయింది. చారిత్రక అమరావతి పేరు నవ్యాంధ్రకు అన్ని విధాలా సరిపోతుందని కర్నాటక తెలుగు ప్రజాసమితి అధ్యక్షుడు దొందు రామస్వామి పేర్కొన్నారు. రాజధానికి అమరావతి పేరు పెడుతూ ప్రకటన వెలువడటంతోనే సంతోషంగా ప్రపంచ తెలుగు ప్రజలు దానిని పెద్దఎత్తున స్వాగతించారు. సోషల్ మీడియాలో కూడా ఈ ప్రకటనకు భారీ సంఖ్యలో మద్దతు పలికారు. అక్షర క్రమంలో అమరావతి ప్రథమ స్థానంలో ఉండటాన్ని ఈ సందర్భంగా నెటిజన్లు కితాబిచ్చారు. అమరావతి

# చారిత్రక తీర్మానం

"నవ్యాంధ్రప్రదేశ్ రాజధాని నగర నిర్మాణ బాధ్యతలను చరిత్ర ఈ మంత్రిమండలి భుజస్కంధాలపై ఉంచింది. ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయడు నాయకత్వంలో వచ్చే శతకోటి వత్సరాల పాటు ఈ భూ మండలంలోనే తలమానికంగా పరిఢవిల్లే రాజధాని నగరాన్ని నిర్మించడానికి రాష్ట్ర ప్రభుత్వం ఉపక్రమించింది. రాష్ట్రం నడిబొడ్డులో, విజయవాడ-గుంటూరు పట్టణాల మధ్య, కృష్ణవేణి నదికి ఇరువైపులా మన రాజధాని నగర నిర్మాణం జరగాలని ఇదివరకే మంత్రిమండలి నిర్ణయించింది.

రాజధాని నగర నిర్మాణానికి వేలాదిమంది రైతులు స్వచ్ఛందంగా ముందుకొచ్చి భూసమీకరణ పద్ధతిలో సుమారు 33 వేల ఎకరాల భూములను ప్రభుత్వానికి ఇవ్వడానికి అంగీకారం తెలిపారు. ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడుగారి నాయకత్వంలోని ప్రభుత్వంపై రైతులు, భూ యజమానులు వెల్లడించిన నమ్మకానికి రాష్ట్ర మంత్రిమండలి వారికి కృతజ్ఞతాభివందనములు తెలియజేస్తోంది. మన ప్రజా రాజధాని ఆధునిక పరిపాలనా, ఆర్థిక, సామాజిక, సాంఘీక, సాంస్కృతిక అవసరాలకు అనుగుణంగా ఉండాలి. 21వ శతాబ్దంలో ప్రపంచంలో అత్యుత్తమ ప్రమాణాలను అనుసరించడమే కాకుండా రాబోయే శత సహస్ర శతాబ్దాలలో కూడా నిత్య నూతనంగా వెలుగొందే విధంగా రూపుదిద్దుకోవాలి. దానికి తోడు ఆంధ్రప్రదేశ్ ప్రజల ఘన చరిత్రను, విజయ గాధను శాస్త్ర సాంకేతిక రంగాలలో సాధించిన కీర్తిని, తాత్విక చింతనలో కనబరచిన గాఢతను ప్రతిబింబింపజేయాలన్నదే మా మంత్రివర్గ ఆకాంక్ష. ఈ విశాలమైన ఆకాంక్ష దృష్ట్యా మన రాజధానికి అమరావతి అని పేరు అన్నివిధాల సరైనదని మంత్రివర్గం అభిప్రాయపడింది.

అమరావతి అంటే అజరామరమైన నగరం. మన పురాణేతిహాసాలలో దేవేంద్రుడి రాజధానిగా అభివర్ణింపబడ్డ నగరం. క్రీస్తు పూర్వమే భరతఖండంలో సువిశాల సామ్రాజ్యానికి రాజధానిగా వెలుగొందిన నగరం. శ్రీముఖ శాతకర్ణి నుంచి యజ్ఞశ్రీ శాతకర్ణి వరకు నాలుగు శతాబ్దాలు అప్రతిహతంగా గాంధారం నుంచి కృష్ణా తీరం వరకు విస్తరించిన సామ్రాజ్యానికి రాజధాని నగరం. గౌతమ బుద్ధుని పాదస్పర్శతో పునీతమైన నగరం. ఆచార్య నాగార్జునుని వంటి అనేకమంది పండితుల తాత్విక శాస్త్ర చర్చోపచర్చలతో మార్మోగిన నగరం. సనాతన, బౌద్ధ ధర్మాలు రెండింటికీ సమానంగా ఆలవాలమై విలసిల్లిన నగరం. మన ప్రజల గత వైభవాన్ని చాటిచెప్పే అమరావతి నామాన్ని మన నూతన రాజధానికి పెట్టుకుని చరిత్ర నుంచి స్ఫూర్తి పొందుతూ అత్యంత అధునాతన ప్రజారాజధాని నగరంగా తీర్చిదిద్దుకోవాలని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మంత్రిమండలి ఏకగ్రీవంగా తీర్మానించడమైనది."

ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం 2015, ఏప్రిల్ 1వ తేదీన చేసిన తీర్మానం

పదం స్వదేశీ భావాన్ని, ఆంధ్రుల్లో కొత్త ఆశల్ని మోసుకొచ్చిందని న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ అభినందనలు తెలిపింది. రెండు వేల సంవత్సరాల తర్వాత అమరావతి మరోసారి ఆంధ్రకు రాజధాని అయిందని హిందూ బిజినెస్ లైన్ పేర్కొంది. ఖచ్చితమైన పురాతన, మత ఆధ్యాత్మిక, లౌకిక భావాలను ప్రతిబింబించే విధంగా గత వైభవాన్ని తలపించే రీతిలో అసలైన ఆధునిక కేంద్రంగా ప్రజా రాజధానిని సృష్టించడానికి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సర్వశక్తులూ ఒడ్డుతున్నారు. గత చరిత్రను స్ఫురణకు తెచ్చే విధంగా ప్రాధాన్యమిస్తూ ఆర్థిక వృద్ధిని సాధిస్తూ సమకాలీన మహానగరంగా తీర్చిదిద్దడానికి నడుం బిగించారు. నూతన రాజధాని నిర్మాణానికి మాస్టర్ ప్లాన్ రూపకల్పన సింగపూర్ కంపెనీలకు అప్పగించారు.

ముఖ్యమంత్రి చెప్పినట్టుగానే, మే నెల 25న సింగపూర్ మంత్రి ఈశ్వరన్ బృందం హైదరాబాద్‌లో చంద్రబాబు నాయుడిని కలిసి, రాజధాని నగర బృహత్ ప్రణాళిక వివరాలను అందజేసింది. సింగపూర్ ప్రభుత్వం ఇప్పుడు బృహత్ ప్రణాళికను అందజేసిందని, జూలై 15లోగా సీడ్ క్యాపిటల్ ప్రణాళికను ఇస్తుందని, అది అందిన తర్వాత రాజధాని నగర నిర్మాణ పనులు వేగవంతమవుతాయని ముఖ్యమంత్రి వివరించారు. ఇంత తక్కువ సమయంలో ఇంత పెద్ద ప్రణాళికను సింగపూర్ ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధతో పూర్తిచేయడానికి, వ్యక్తిగతంగా తనకు, తెలుగుదేశం పార్టీకి, ప్రభుత్వానికి ఉన్న విశ్వసనీయతే కారణమని చంద్రబాబు ఈ సందర్భంగా అన్న మాటలు అక్షర సత్యం. అంతర్జాతీయ రాజధాని నిర్మాణం జరిగిన విధం గురించి భవిష్యత్తు తరాలకు తెలియజెప్పేందుకోసం కట్టడం మొదలుపెట్టిననాటి నుంచి పూర్తయ్యే వరకూ అమరావతి రూపుదిద్దుకున్న వైనాన్ని వీడియో రూపంలో నిక్షిప్తం చేయాలని కూడా రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఒక నవ నగరం సజీవ రూపం దాల్చే క్రమానికి సాక్షులు కాగలగడం ఈ తరానికి దక్కిన అదృష్టంగా చెప్పుకోవాలి!

❖




# రాజధానికి ఎంత భూమి ఉండాలి..

దురుద్దేశంతో కొందరు, అవగాహనాలేమితో మరికొందరు, రాజధాని నిర్మాణానికి ఎన్ని భూములు కావాలనే అంశం మీద అవాకులు, చెవాకులు పేలుతున్నారు. రాజధాని నిర్మాణానికి చివరకు మిగిలేది 7 వేల ఎకరాలేనన్న వాస్తవాన్ని విస్మరించడంతో పాటు, ఆంధ్రుల కలల రాజధాని కొన్ని భవనాల సముదాయం కాదని, ఆ నగరం తెలుగువారి అస్తిత్వానికి, ఆత్మాభిమానానికి సంబంధించిన అంశంగా గుర్తించకపోవడం విమర్శకుల హ్రస్వదృష్టికి నిదర్శనం.

రాజధాని నిర్మాణం జరగకూడదనే ఉద్దేశంతో కొంతమంది రాజకీయనేతలు పనిగట్టుకొని దుష్ప్రచారం చేశారు. ఏదోవిధంగా రైతులను రెచ్చగొట్టి, భూసమీకరణ జరగకుండా చూడాలని విశ్వప్రయత్నం చేశారు. అయితే, ప్రభుత్వం అవలంబించిన పారదర్శకత వల్ల, తమకు సమకూరుతున్న అనూహ్య లబ్ధి వల్ల, నాయకత్వం మీద విశ్వాసం వల్ల, ఈ ప్రయత్నాలేవీ ఫలించేలేదు. 'నన్ను నమ్మండి ప్రాణం పోయినా మీకు అన్యాయం చేయబోను. అభివృద్ధి చేసి చూపిస్తా. మీ భవిష్యత్తును మారుస్తా,' అన్న ఏపీ సీయం చంద్రబాబు మాటలు రాజధాని ప్రాంత రైతులపై తారకమంత్రంలా పనిచేశాయి. సమీకరణకు గడువు ముగిసే సమయానికి 98 శాతం రైతులు అంగీకార పత్రాలు ఇవ్వడమే దానికి నిదర్శనం.

### 33 వేల ఎకరాలు ఎందుకవసరమంటే!

నవ్యాంధ్ర రాజధానికి 33 వేల ఎకరాల అవసరమా అని కొందరు అవగాహనాలేమితో ప్రశ్నిస్తున్నారు. నిబంధనల ప్రకారం, రహదారులు, డ్రైనేజీ వ్యవస్థ, పార్కులు, గ్రీన్ బెల్ట్ విద్యాలయాలు, ఆస్పత్రులు వంటి సామాజిక అవసరాలకు సేకరించిన భూమితో సగం పోతుంది. రాజధానిలో రోడ్లను కూడా విశాలంగా నాలుగు లైన్లు, ఆరు లైన్లతో వేస్తున్నారు. ఇక రైతులకు వారి వాటా కింద ఇచ్చే భూమి పోగా ప్రభుత్వానికి సరిగ్గా 7,240 ఎకరాలు మిగులుతుంది. రాజధానికి ఎంత సరిపోతుందని అందరూ చెబుతున్నారో నిజానికి అంతే మిగులుతుంది. శంషాబాద్ విమానాశ్రయం ఐదు వేల ఎకరాల్లో విస్తరించారు. ఆ మాత్రం కూడా కొత్త రాజధానికి ఉండవద్దా అన్న ప్రశ్న ఇవాళ సామాన్యులకు కూడా తలెత్తుతోంది. మంగళగిరి ఎయిమ్స్ పెట్టాలంటే 300 ఎకరాల భూమి కావాలని కేంద్రం అడుగుతోంది. కేంద్రీయ విశ్వవిద్యాలయానికి 500 ఎకరాలుండాలి. హైదరాబాద్‌లో భూమి ఉంది కనుక, దానిని చూపించి, ఇచ్చి, నాడు సీయంగా చంద్రబాబు సాఫ్ట్ వేర్ కంపెనీలను ఆకర్షించగలిగారు. సంస్థలు, కంపెనీలు, పరిశ్రమలు రావాలంటే ఉపాధి అవకాశాలు, ఆదాయ మార్గాలు పెరగాలంటే భూమిని కొంతైనా ఇవ్వగలిగే పరిస్థితుల్లో ఆయా ప్రభుత్వాలు ఉండాలి. కొత్త రాజధాని కేవలం నాలుగు భవనాలు కాకుండా, అది ఉపాధి అవకాశాలను సృష్టించేదిగా వుండాలి.

రాజధాని నిర్మాణానికి సమీకరణలో తీసుకున్న భూమిని అభివృద్ధి చేసే క్రమంలో 50 శాతం మౌలిక వసతుల కల్పనకు పోతుంది. అందులోనే ఐదు శాతం అల్పాదాయ వర్గాల గృహవసతికి కేటాయించాలని రాష్ట్ర ప్రభుత్వం ప్రతిపాదించింది. మిగిలిన భూమిలో రైతుల వాటాపోను ప్రభుత్వానికి లభించే భూమిలో మరో పదిశాతం వివిధ ఆదాయ వర్గాల గృహ వసతికి కేటాయించాలని ప్రతిపాదించారు. ఈ స్థాయిలో నివాస గృహాలు నిర్మితమైతే వివిధ వర్గాలు నివసిస్తూ ప్రజా రాజధాని అవుతుంది. లేదంటే జనావాసం లేని గాంధీనగర్, రాయ్‌పూర్‌లా మారుతుంది.

ఇదీగాక, కొత్త రాజధాని నిర్మాణానికి సొంత వనరులతోనే నిధులు సమీకరించు కోవాల్సివుంది. సొంత నిధులు లేకపోయినా, కొత్త ఆలోచనలతో ప్రపంచస్థాయి రాజధాని నిర్మించడానికి ముఖ్యమంత్రి చేసిన ప్రయత్న సఫలమవుతోంది. నవ్యాంధ్ర రాజధాని అమరావతి నిర్మాణంలో జపాన్, సింగపూర్ ప్రభుత్వాలు, కంపెనీలు పాలుపంచుకోడానికి ముందుకు వస్తున్నాయంటే, ముఖ్యమంత్రి ఆలోచన, ఆచరణ, నవ్యత ఈ దేశాలను ఆకర్షించడమే.

రాజధానిని ఒక సచివాలయంగానో, ఒక పాలనాకేంద్రంగానో, కొన్ని నిర్మాణాల సమూహంగానో చూసేవారికి, చారిత్రక, రాజకీయ, సాంస్కృతిక స్పృహ లోపించిందని చెప్పుకోవాలి. తమకంటూ ఒక మహానగరాన్ని నిర్మించుకోవాలని, అది తెలుగుతనానికి, తెలుగు వైభవానికి చిహ్నంగా నిలిచిపోవాలని ఇవాళ ప్రతి ఒక్కరూ కోరుకుంటున్నారు. ఆంధ్రప్రదేశ్ కొత్త రాజధాని ఇవాళ ప్రజల భావోద్వేగాలతో పెనవేసుకుపోయిన అంశం. దీనిని కొన్ని ప్రభుత్వ కార్యాలయాల సముదాయంగా మాత్రమే చూసేవారికి సామాజిక దృష్టి లోపం ఉన్నదని భావించాలి.

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు అన్నట్టు, రాజధాని నిర్మాణం అనేది ఒక సువర్ణావకాశం. మళ్లీ మళ్లీ వచ్చేది కాదు. వేల సంవత్సరాల కాలగమనంలో ఎప్పుడో ఒకసారి మాత్రమే ఇలాంటి అవసరం, అవకాశం వస్తాయి. ఈ బాధ్యతని సమర్థంగా నిర్వహించకపోతే, చరిత్ర క్షమించదు. ఆ చారిత్రక స్పృహ, ఆ భవిష్యత్ దర్శనం ఉన్న నాయకుడు ఇవాళ ప్రభుత్వాధినేతగా ఉన్నారు కాబట్టి, అమరావతి అంతర్జాతీయ, అత్యాధునిక రాజధానిగా రూపొందగలదన్న నమ్మకం ఈ రాష్ట్ర ప్రజల్లో నిండుగా ఉంది.

# ఆంధ్రప్రదేశ్ ప్రాథమ్య రంగాలు

**విద్యుత్తు**



- 42,000 మెగా వాట్ల వరకూ ఉత్పాదక సామర్థ్యం
- తలసరి విద్యుత్ వినియోగం 4500 యూనిట్లకు మించుతుంది
- అదనంగా వచ్చి చేరే రెన్యువబుల్ విద్యుత్ సామర్థ్యం 9000 మెగావాట్లు
- ప్రసార, పంపిణీల వల్ల నష్టాలు 5 శాతం వరకూ తగ్గింపు

**విమానాశ్రయాలు**

- విశాఖపట్నం, విజయవాడ, తిరుపతి నగరాల్లో మూడు ప్రపంచ స్థాయి అంతర్జాతీయ విమానాశ్రయాలు
- అనుకున్న ప్రణాళిక పూర్తైన తర్వాత రాష్ట్రంలోని 13 జిల్లాల్లో (శ్రీకాకుళం మినహాయించి) 12 జిల్లాలకు విమానాశ్రయాలు ఉంటాయి



**నౌకాశ్రయాలు**



- 1000 మెగా టన్నుల సరుకును నిర్వహించే సామర్థ్యంతో ఓడరేవులు
- 16 ఓడరేవులు పూర్తి వాడకంలోకి (6 ప్రస్తుతం పనిచేస్తున్నాయి, 7 అభివృద్ధిలో ఉన్నాయి, 3 గుర్తించబడ్డాయి)

**గ్యాస్**

- దేశంలోని గ్యాస్ దిగుమతులకు ఆంధ్రప్రదేశ్ ప్రధాన ద్వారంగా నిలుస్తుంది
- ప్రతి జిల్లాలోని పారిశ్రామిక, వ్యాపార, గృహ వినియోగానికి పైపుల ద్వారా గ్యాస్ సరఫరా



**రహదారులు**



- ప్రతి చదరపు కిలోమీటరుకూ 1.42 కిలోమీటర్ల పొడవైన రోడ్డు
- జిల్లా ప్రధాన కేంద్రాల నుంచి రాష్ట్ర రాజధానికి నాలుగు/ ఆరు లేన్ల రహదారి అనుసంధానం
- ప్రతి గ్రామానికీ అన్ని ఋతువులకీ తట్టుకునేలా పక్కా రహదార్ల నిర్మాణం

**టెలికాం**

- దరఖాస్తు చేసుకున్న వారికి ఏరియల్ ఫైబర్ నెట్ వర్క్ ద్వారా కనీసం 10 ఎంబిపిఎస్ సామర్థ్యంతో కనెక్షన్లు
- దాదాపు 1.2 కోట్ల నివాసాలకు బ్రాడ్‌బాండ్ కనెక్టివిటీ



**రైల్వే**



- రైలు మార్గం ద్వారా సరుకు రవాణాని ప్రోత్సహించేందుకు ఓడరేవులకు, విమానాశ్రయాలకూ అనుసంధానం చేస్తూ కొత్త రైల్వేలైన్ల అభివృద్ధి, ప్రస్తుత రైల్వేలైన్ల విస్తరణ

**జలమార్గాలు**

- నాల్గవ జాతీయ జలమార్గాన్ని సరకు రవాణాకు ఒక ప్రధాన మార్గంగా అభివృద్ధి



❖

# నవనిర్మాణానికి సంకల్ప దీక్ష

ఇదంతా ఒక గాయం గురించి. ఏడాది క్రితం గాయం... ఇంకా సలపరింతల గాయం. కలిసి రాని కాలం ఎదుర్రాయిలా మాటేసి చేసే అవాంఛిత గాయం కాదిది. గాయం కాక ముందు తప్పించుకొని జాగ్రత్త పడటానికీ, గాయపడ్డాక మాన్పుకోడానికి కూడా వీల్లేని కుట్ర... కుతంత్రాల గాయం. మళ్లీ మళ్లీ రేగుతూ పచ్చి ఆరని గాయాన్ని మాన్పలేకపోవడం కాదు విషాదం, నిత్యం దానితో సహవాసం చేయడమే దుర్భరం. బాధిస్తున్న పంటిని ఇంకా నొక్కిపట్టి ఉంచాల్సిన దుస్థితి. అదే 'జూన్ 2' విభజన గాయం!

'రెండవ ప్రపంచ యుద్ధంలో భయంకరమైన విధ్వంసం తర్వాత తిరిగి కోలుకోవటానికి జపాన్ కృషిని మనం గుర్తుచేసుకుందాం, దాన్నుండి ఉత్తేజం పొందుదాం'- అని తీర్మానించింది ఆంధ్రప్రదేశ్ కొత్త శాసనసభ తొలి సంయుక్త సమావేశం. కొన్ని సంకుచిత ప్రయోజనాలే లక్ష్యంగా అప్పటి కేంద్రప్రభుత్వం ఆంధ్ర రాష్ట్రాన్ని రెండు ముక్కలు చేసిన తీరు తెలుగు జాతి అంతరంగాన్ని అతలాకుతలం చేసిందని, తెలుగువాడి అంతఃకరణని గాయపరిచిందని మన విధాన నిర్ణేతల అభిప్రాయం. అందుకే, విభజన విధ్వంసాన్ని నాటి హిరోషిమా- నాగసాకి విలయంతో పోల్చడం జరిగింది.

ఆ విధ్వంసక విభజన గాయానికిప్పుడు నిండా ఏడాది. ఆ విధంగా చూస్తే, జూన్ 2 - చిరిగిపోయే కేలండర్ కాగితాల్లో ఒకానొక తేదీ కాదు; అది ఒక గాయానికి గుర్తు, ద్రోహానికి సాక్ష్యం, చరిత్రకి దాఖలా. అటువంటి దుర్దినాన్ని తలుచుకునేది పద్ధతేమిటి? దాన్ని విద్రోహదినంగా గుర్తించడమా, బ్లాక్ డే గా నిరసించడమా?

అదేమీ కాదన్నారు మన ప్రజానాయకుడు- ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు. ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం మొత్తానికే కాదు, రాష్ట్ర విభజన వల్ల తెలుగు వాడికి అన్యాయం జరిగిందన్న సత్యాన్ని నమ్మిన వారందరికీ జూన్ 2- నవ నిర్మాణ దీక్షాదినోత్సవం కావాలి అని పిలుపునిచ్చారు. అందుకే జూన్ 2 ని ఒక వేడుకగా సాటి తెలుగు వాడు సంబరాలు చేసుకుంటున్న వేళ, నిరసనలతో వాతావరణాన్ని కలుషితం చేయవద్దని చంద్రబాబు పిలుపునిచ్చారు.

దిక్కుతోచక అనాథలా మిగిలిన అవశేషాంధ్రప్రదేశ్‌ని అక్కున చేర్చుకొని, పునాదులు సైతం మట్టమైపోయిన నేల మీద నవ్యాంధ్ర నిర్మాణానికి నడుంకట్టిన నాయకుడు - చంద్రబాబు దొరకడం ప్రజల అదృష్టమైతే, గాయం మిగిల్చే గందరగోళంలో కూడా వివేకం కోల్పోకుండా తన వెన్నంటి నిలిచిన జనం దొరకడం కూడా చంద్రబాబు అదృష్టమే. అందుకే నవ నిర్మాణ దీక్షకి నాయకుడి వెంట సైన్యమై కదలనుంది ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం.

## నవ నిర్మాణ దీక్ష ఇలా...

"జూన్ 2న నవ నిర్మాణ దీక్ష చేపట్టాలి. ఇందులో పాఠశాల విద్యార్థులకు భాగస్వామ్యం కల్పించాలి. ఈ దీక్షల్లో పాల్గొంటేనే వారికి చరిత్ర తెలుస్తుంది. ఏపీకి జరిగిన అన్యాయం ఏమిటో వారికి అర్థమవుతుంది. నవ్యాంధ్ర నిర్మాణానికి ప్రజలు పునరంకితం అయ్యేందుకు, మరింతగా స్ఫూర్తినిచ్చేందుకు ఇది చైతన్య దీక్షగా ఉపయోగపడుతుంది. రాష్ట్ర ఉద్యోగులు ఏపీకి వెళ్లి దీక్షలోపాల్గొనాలి. విభజించిన వారే అసూయపడేలా దీక్షను చేపట్టాలి. దీన్ని కేవలం ప్రభుత్వ కార్యక్రమంగా కాకుండా 13 జిల్లాల ప్రజల సొంత కార్యక్రమంలా చేపట్టాలి" అని పిలుపునిచ్చారు ముఖ్యమంత్రి.

రాష్ట్ర విభజన, అనంతర పరిణామాలపై ప్రజలు బాగా కలత చెందారని, ఎమర్జెన్సీని తలదన్నేలా కేవలం అరగంటలోనే పార్లమెంట్‌లో విభజన తంతును ముగించేశారని ఆయన తప్పుబట్టారు. రాజధాని ఇవ్వకుండా కట్టుబట్టలతోనే బయటకు పంపించేశారని, చివరకు రాజధాని ఎంపిక కోసం శివరామకృష్ణన్ కమిటీని నియమించి ఏపీలోని మూడు ప్రాంతాల్లో చిచ్చుపెట్టాలని చూశారని ఆయన మండిపడ్డారు.

రాష్ట్ర విభజన సందర్భంగా ఆదాయ పంపిణీ సరిగ్గా జరగలేదు, ఆర్థిక లోటుతో అణగారిన రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను పునాదులనుంచీ పునర్నిర్మించవలసిన పరిస్థితి ఉంది. కనుక, ఇది ఒక పునశ్చరణ సందర్భం. పాత గాయాల్ని తడుముకొని, అన్యాయాన్ని తలుచుకొని, నాటి బాధల్ని గుర్తుచేసుకొని మరింత దీక్షగా నవ నిర్మాణానికి ప్రజలంతా ముందుకు కదలాలి. అదే నవ నిర్మాణ దీక్ష ఆశయం.

నవ్యాంధ్రలో పారిశ్రామిక మహోదయం

# మరో ప్రపంచం పిలిచింది

- ఏడాది పాలనలో పారిశ్రామికాభివృద్ధికి పునాది
- రెండేళ్ళలో ఏడున్నర లక్షల మందికి , ఐదేళ్ళలో 10 లక్షల మందికి ఉద్యోగాలు
- విశాఖ-చెన్నై, చెన్నై-బెంగళూరు కారిడార్లలో 100 కోట్ల డాలర్ల పెట్టుబడితో మౌలిక సదుపాయాల అభివృద్ధికి ప్రణాళికలు
- 2020 నాటికి రూ.2 లక్షల కోట్ల పెట్టుబడులను ఆకర్షించాలని లక్ష్యం
- 2017 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో కొత్తగా 13,598 పరిశ్రమలు

ఆంధ్ర ప్రదేశ్‌ని పెట్టుబడుల స్వర్గధామంగా నిలిపేందుకు తీవ్రప్రయత్నాలు సాగుతున్నాయి. ఇందుకోసమే రాష్ట్రాన్ని 'సన్ రైజ్ స్టేట్', అంటే అవకాశాల ఆంధ్రప్రదేశ్‌గా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తీర్చిదిద్దుతున్నారు. ప్రపంచ వ్యాపార, ఐటీ, విదేశీ నేతల పరిచయాన్ని సద్వినియోగం చేసుకునే దిశలో, విదేశీ పర్యటనలకు చంద్రబాబు ప్రాధాన్యం ఇస్తున్నారు. "హైదరాబాద్‌ని ప్రపంచ పటంలో నిలిపింది నేనే, ఇప్పుడు అదే అనుభవంతో ఆంధ్ర అభివృద్ధికి ప్రపంచంలోని ప్రముఖ సంస్థలు వచ్చేట్టుగా చేస్తా" అని చంద్రబాబు చెబుతున్నారు. బ్రాండ్ ఆంధప్రదేశ్ కోసం వెళ్ళిన సింగపూర్, దావోస్, జపాన్, చైనా, పర్యటనలు దిగ్విజయం అవడంతో ఇపుడు పెట్టుబడుదారులు రాష్ట్రంలో పరిశ్రమలు స్థాపనకు ముందుకు వస్తున్నారు. సహజ వనరులు, స్థిరమైన ప్రభుత్వం, గతంలో ఉన్న అనుభవం వంటివన్నీ ఆంధ్రకు పెట్టుబడులు రావడానికి ఉపయోగపడుతున్నాయి.

### కాలం కుదుపుకి కుంటుబడ్డ ప్రగతి

గతంలో చంద్రబాబు నాయుడు అధికారంలో ఉండగా సమర్ధ పాలన విధానంతో రాష్ట్రం ఆర్థిక పురోగతి సాధించింది. 1993-94 నుంచి 2003-04 పారిశ్రామిక వాటా 1.74 శాతం మేర పెరిగింది. 2003-04 నుంచి 2014 మధ్య గతంలో సాధించిన మేర పారిశ్రామిక ప్రగతి సాధించలేకపోయింది. 2004 నాటి వరకు సాధించిన ప్రగతి ఫలాలను అందిపుచ్చుకుని మరింత అభివృద్ధి చెందగల సదవకాశాన్ని వినియోగించుకోలేకపోయారు. ఫలితంగా రాష్ట్ర ఆర్థిక ప్రగతిలో పారిశ్రామికరంగ వాటా 24.33 శాతం నుంచి 20.62 శాతానికి పడిపోయింది.

పారిశ్రామిక పురోగతితోనే సర్వతోముఖాభివృద్ధి సాధ్యమవుతుందన్న వాస్తవాన్ని గ్రహించిన ముఖ్యమంత్రి, అధికారం చేపట్టిన నాటి నుంచి రాష్ట్రాన్ని పారిశ్రామికంగా కొత్తపుంతలు తొక్కించడానికి అహర్నిశలు కృషి చేస్తున్నారు.

దేశవిదేశాల్లోని పారిశ్రామికవేత్తలతో సమావేశమవుతూ స్థానికంగా నెలవైన మేలైన మానవ, ఖనిజ వనరుల లభ్యతను వివరిస్తున్నారు. దేశంలోనే నవ్యాంధ్రను అగ్రగామి పారిశ్రామిక, ఐటీ, జౌళీ, లాజిస్టిక్, ఆటోరంగాలకు హబ్‌లుగా తీర్చిదిద్దాలని తపిస్తున్నారు. ఆయా రంగాలను ప్రోత్సహించే ఉద్దేశంలో భాగంగానే నూతన పారిశ్రామిక విధానం, పారిశ్రామిక మిషన్‌ని ప్రకటించారు. ఫలితంగా ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక రంగంలో విప్లవాత్మకమైన మార్పులు రానున్నాయని అధికార వర్గాలు అంచనా వేస్తున్నాయి. సింగిల్ డెస్క్ నెలకొల్పి 21 రోజుల్లోనే శీఘ్రంగా అనుమతులివ్వడం రికార్డు కానుంది. పారిశ్రామిక అభివృద్ధి కోసం 2020 నాటికి రూ.2 లక్షల కోట్ల పెట్టుబడులను ఆకర్షించాలని, తద్వారా దాదాపు 10 లక్షల ఉద్యోగాలను సృష్టించవచ్చని ప్రభుత్వం నిర్ణయించింది.

### పారిశ్రామిక ప్రగతికి ప్రోత్సాహకాలు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం పారిశ్రామిక ప్రగతికి తోడ్పడేందుకు సింగిల్ డెస్క్ విధానంలో అనుమతుల మంజూరుతో పాటు, నిరంతర కరెంట్ సరఫరా, ఇండస్ట్రియల్ ఇన్సెంటివ్స్, ఇతర సౌకర్యాలు కల్పిస్తోంది. ఇప్పటికే పారిశ్రామిక రంగాన్ని ప్రోత్సహించేందుకు రూ. 2 వేల కోట్ల మేరకు రాయితీల రూపేణా అందించారు.

**పరిశ్రమలకు 10 లక్షల ఎకరాలతో భూబ్యాంక్:** ఆంధ్రప్రదేశ్లో పారిశ్రామికాభివృద్ధికి పది లక్షల ఎకరాలను సమకూర్చుకోవాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఇప్పటికే గుర్తించిన మూడు లక్షల ఎకరాలకు అదనంగా మరో ఏడు లక్షల ఎకరాల ప్రభుత్వ భూములను గుర్తించి, భూసమీకరణ, భూసేకరణ ద్వారా అందుబాటులోకి తీసుకురావాలని నిర్ణయించింది.

**స్మార్ట్ టౌన్‌షిప్పులు, అత్యాధునిక మౌలికవసతులు:** రాష్ట్రంలో ప్రతి జిల్లాలో స్థానిక స్థానిక సంస్థల ఆధ్వర్యంలో భారీ సంఖ్యలో స్మార్ట్ పారిశ్రామిక టౌన్‌షిప్పులు నిర్మించాలనుకుంటున్నారు. విశాఖ-చెన్నై, చెన్నై-బెంగళూరు పారిశ్రామిక కారిడార్లు, విశాఖ, నక్కపల్లి, కాకినాడ పరిధిలో పీసీపీఐఆర్, చిత్తూరు, ప్రకాశం జిల్లాల్లో దాదాపు 5 వేల హెక్టార్లలో ప్రతిపాదిత జాతీయ పెట్టుబడులు, ప్రత్యేక తయారీ కేంద్రాలు (ఎన్ఐఎంజెడ్), విశాఖ, చిత్తూరు ఐటీఐఆర్‌లను నూతన పారిశ్రామిక విధానంలో అంతర్భాగంగా చేర్చారు.

### అతిపెద్ద పారిశ్రామికవాడగా శ్రీసిటీ

చిత్తూరు జిల్లాలో సత్యవేడు ఒకప్పుడు ఎంతో వెనుకబడిన ప్రాంతం. ఇక్కడ జాతీయ రహదారి ఏర్పడ్డాక శ్రీసిటీ పారిశ్రామికవాడ రూపు దిద్దుకుంది. దాంతో అనేక జాతీయ, అంతర్జాతీయ పరిశ్రమలకు శ్రీసిటీ నెలవుగా మారింది. స్థానికులకు వేలల్లో ఉద్యోగాలు లభిస్తున్నాయి. భవిష్యత్తులో లక్షల మంది నిరుద్యోగులకు ఉద్యోగాలు లభించే అవకాశాలున్నాయి. ప్రపంచంలోని అతి పెద్ద పది కంపెనీల్లో ఒకటైన పెప్సికో కంపెనీ ఆధ్వర్యంలో ప్లాంటు ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు చేతుల మీదుగా ఇటీవల ప్రారంభమైంది. ఈ కంపెనీలో దాదాపు పావువంతు మంది మహిళలు పనిచేస్తుండడం విశేషం. శ్రీసిటీలో 7,600 ఎకరాల భూమి ఉంది. ఇక్కడ పరిశ్రమలు స్థాపించేందుకు 106 కంపెనీలు నెలకొల్పడానికి అవకాశం వుండగా, ఇప్పటికే 20 దేశాల నుంచి కంపెనీలు రాష్ట్ర ప్రభుత్వానికి ప్రతిపాదనలు అందజేశాయి.

### ఎడిబి, ప్రపంచ బ్యాంకు, కేంద్ర నిధులతో పరిశ్రమల కొలువు

వైజాగ్ నుంచి చెన్నై వరకు నిర్మించ తలపెట్టిన ఇండస్ట్రియల్ కారిడార్ (విసిఐసి)కు సంబంధించిన ప్రణాళికలను రూపొందించడానికి ఆసియా అభివృద్ధి బ్యాంకు నిపుణుల బృందం అధ్యయనం ప్రారంభించింది. భీమునిపట్నంలో ఫిషింగ్ హార్బర్‌ను, విశాఖలో అంతర్జాతీయ స్థాయిలో గ్రీన్ ఫీల్డ్ విమానాశ్రయాన్ని నిర్మించేందుకు ప్రణాళికలు రూపొందుతున్నాయి.

### తూర్పు తీరంలో రోడ్డు విస్తరణ ప్రాజెక్టులు

ఆసియన్ డెవలప్‌మెంట్ బ్యాంకు సహకారంతో ఉత్తర ప్రాంతంలో తొమ్మిది రోడ్డు ప్రాజెక్టులను అభివృద్ధి చేయడానికి ప్రయత్నాలు సాగుతున్నాయి. విశాఖపట్నం నుంచి ఒడిశా సరిహద్దు వరకు 4 వరుసల రహదారిని, 6 వరుసల రహదారిగా, వైజాగ్- రాజమండ్రి మధ్య ఎన్ హెచ్-5 ని ఆరు వరుసలుగా, అనకాపల్లి-పెందుర్తి ఆనందపురం మార్గాన్ని 2/4/6 మార్గాల రహదారిగా, యలమలించిలి-గాజువాక మధ్య 4 లైన్ల రహదారిని, వైజాగ్ పోర్ట్ సిటీ మధ్య బైపాస్ కనెక్టివిటీని, ఢిల్లీ- విశాఖపట్నం మధ్య సరాసరి సరకు రవాణా కారిడార్ నెలకొల్పడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో కూడా చిన్న రేవులు అభివృద్ధి చేసి వాటిని అనుసంధానించే ప్రయత్నాలూ ఊపందుకున్నాయి.

### వెనుకబడిన ప్రాంతాలపై ప్రత్యేక దృష్టి

భౌగోళిక, ఇతర రాజకీయ కారణాలతో, రాయలసీమలో ఆశించినంతగా పరిశ్రమలు నెలకొనలేదు. ఈ అంశం మీద దృష్టి పెట్టిన ప్రభుత్వం రాయలసీమలో మొత్తం 45 వేల ఎకరాల్లో పరిశ్రమల ఏర్పాటుకు అనువైన పరిస్థితులు కల్పించాలని సంకల్పించింది. అనంతపురం, కర్నూలు జిల్లాల్లో సుమారు 30 వేల ఎకరాల భూములు అందుబాటులో ఉన్నాయని గుర్తించారు. చిత్తూరు, కడప జిల్లాల్లో సుమారు 15 వేల ఎకరాలను సేకరించనున్నారు.

### బయోటెక్నాలజీ హబ్ నవ్యాంధ్ర

విశాఖను జీవసాంకేతిక కేంద్రం (బయోటెక్నాలజీ హబ్) గా రూపుదిద్దడానికి సుమారు 200 ఎకరాల్లో మెగా బయోటెక్నాలజీ పార్క్ ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. కాకినాడ (మెరైన్, అగ్రీ, ఆక్వా), అనంతపురం (బయోఫార్మా, బయోసిమిహోర్, ఫార్ములేషన్) గుంటూరు/చిత్తూరు (అగ్రి, ఫుడ్, యానిమల్ బయో) ల్లో మినీ జీవ శాస్త్ర (లైఫ్ సైన్స్) పార్కులు ఏర్పాటు చేస్తారు. విశాఖ, కాకినాడ, తిరుపతి, విజయవాడల్లో అంకురాభివృద్ధి కేంద్రాలు (ఇంక్యుబేషన్ సెంటర్లు) ఏర్పాటు చేస్తారు.

### టెక్స్‌టైల్ పాలసీతో ఉద్యోగాల వెల్లువ

ఉపాధి కల్పనే లక్ష్యంగా టెక్ స్టైల్ రంగాన్ని మరింతగా అభివృద్ధి చేయాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పంచవర్ష విధానాన్ని ప్రకటించింది. ప్రత్యేకించి గుంటూరు, కృష్ణా, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం లాంటి జిల్లాల్లో వస్త్ర పరిశ్రమల అభివృద్ధికి బాగా అవకాశాలు ఉన్నాయని గుర్తించారు. 2020 నాటికి రాష్ట్రంలో రూ.6 వేల కోట్ల పెట్టుబడులను ఆకర్షించడమే పంచవర్ష విధాన ప్రధాన లక్ష్యం. అప్పటికి అదనంగా 3 లక్షల మందికి, 2025 నాటికి 5 లక్షల మందికి ఉపాధి కల్పించాలి.

### ఆటోమోబైల్స్‌లో అగ్రగామిగా ఏపీ

ఆంధ్రప్రదేశ్లో వాహన విడిభాగాల తయారీ సంస్థలు, సరఫరాదారుల కోసం ప్రపంచస్థాయి ప్రమాణాలతో పలు 'ఆటోమోటివ్ సప్లయర్స్ మాన్యుఫ్యాక్చురింగ్ సెంటర్స్' నెలకొల్పుతున్నారు. పారిశ్రామిక మిషన్లో భాగంగా 'వాహన, వాహన విడిభాగాల విధానం 2015-20' (ఆటోమొబైల్స్ అండ్ ఆటో కాంపొనెంట్స్ పాలసీ)ని ప్రత్యేకంగా ప్రకటించారు. వాహన తయారీ పరిశ్రమల అవసరాలకు అనుగుణంగా విడిభాగాల తయారు చేసే సంస్థలకు ఎ.ఎస్.ఎం.సి.ల్లో స్థలాలను కేటాయిస్తారు. అక్కడ పరిశ్రమలు ఏర్పాటు చేసుకునేవారికి సమగ్రమైన మౌలిక వసతులను కల్పిస్తారు. నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లో రెండు ఆటో క్లస్టర్లు నెలకొల్పుతారు. వీటిలో అధునాతన నైపుణ్య అభివృద్ధి కేంద్రాలను ఏర్పాటు చేస్తారు.

- జాస్తి గోపాల ప్రసాద్



# నవ్యాంధ్రలో జపాన్ దిగ్గజం పానాసోనిక్!

## ఐటీ మంత్రి పల్లె పర్యటన ఫలితం

ఎలక్ట్రానిక్ ప్రపంచంలో అగ్రగామి జపాన్ దేశానికీ, నవ్యాంధ్రప్రదేశ్‌కి మధ్య దూరం నానాటికీ తరిగిపోతుంది. ఓడలు, విమానాలతో కొలిచే భౌగోళిక దూరం కాదు, కొత్త మైత్రీబంధాలతో తరిగే వ్యావహారిక దూరం. కళ్లు తెరిచి నిండా ఏడాది కాకుండానే, బాలారిష్టాలతో సతమతమౌతూ కూడా నవ్యాంధ్ర జపాన్ వంటి ఆసియా దిగ్గజాన్ని మెప్పించడం విశేషం. దీనికి ముఖ్యమంత్రి చంద్రబాబు అంకురార్పణ చేస్తే, నాయకుడు వేసిన దారిని మరింత వెడల్పు చేశారు రాష్ట్ర ఐటి శాఖ మంత్రి పల్లె రఘునాథ్‌రెడ్డి.

టోక్యోలో 'ది ఇండియా పెవిలియన్' పేరుతో ఏర్పాటైన ఐటి ఎగ్జిబిషన్‌ను పల్లె ఇటీవల ప్రారంభించడమే కాకుండా, ప్రముఖ ఎలక్ట్రానిక్ సంస్థ పానాసోనిక్, పరుక్వా ఎలక్ట్రికల్ కంపెనీ లిమిటెడ్, ఎన్ఈసీ కార్పొరేషన్ ప్రతినిధులను ఆయన నేతృత్వంలోని ప్రతినిధి బృందం కలిసి చర్చలు జరిపింది.

భారీ పెట్టుబడులు పెట్టేందుకు నవ్యాంధ్రలో అపార అవకాశాలున్నాయని, ముందుకు వచ్చిన వారికి అనేక రాయితీలు ఇస్తున్నామని పవర్‌పాయింట్ ప్రజెంటేషన్ ద్వారా మంత్రి పల్లె వివరించారు. ప్రస్తుతం 3 ఇండస్ట్రియల్ క్లస్టర్లు ఉన్నాయని, అదనంగా మరో పదిహేను క్లస్టర్ల ఏర్పాటుకు భూములను గుర్తించామన్నారు. శ్రీసిటీ సమర్థంగా పని చేస్తోందన్నారు. కొన్ని జపాన్ కంపెనీలు ఇప్పటికే ఇక్కడ పరిశ్రమలను ప్రారంభించాయన్నారు. కృష్ణపట్నంను స్మార్ట్ సిటీగా అభివృద్ధి చేస్తామన్నారు. కాకినాడలో హార్డ్‌వేర్ పార్కును ఏర్పాటు చేస్తామన్నారు. ఆంధ్రప్రదేశ్ సీఎంవోలో జపాన్ సెల్ ఏర్పాటు చేసినట్లు చెప్పారు. సింగిల్ విండో ప్రాతిపదికతోపాటు సింగిల్ డిస్క్ నుంచే ఆన్‌లైన్‌లో అనుమతులు ఇస్తున్నామన్నారు.

ఫోర్త్ వాలీ కార్పొరేషన్ ప్రతినిధులతో కూడా మంత్రి పల్లె భేటీ అయి పలు కీలక అంశాలపై చర్చించారు. ఆంధ్రప్రదేశ్‌లో ఐటీ రంగంలో నిష్ణాతులైన విద్యార్థులను జపాన్‌లోని ఐటీ, ఎలక్ట్రానిక్ కంపెనీల్లో అవకాశాలు కల్పించేలా, జపాన్ యూనివర్సిటీలో ఉన్నత విద్య చదివే ఆంధ్రప్రదేశ్ విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు అందజేసే అంశాలపై వారు చర్చించారు.

ఆ చర్చల ఫలితంగా, పానాసోనిక్, ఎన్ఈసీ ప్రతినిధులు ఏపీలో తమ కార్యకలాపాలు విస్తరించేందుకు సుముఖత వ్యక్తం చేయడమే కాకుండా, ఆ దిశలో అడుగులు వేయడం ఐటీ మంత్రి పల్లె రఘునాథరెడ్డి విజయం.




# మీ భూమి పోర్టల్‌కు రంగం సిద్ధం

పరిపాలనలో మెరుగైన ఫలితాల కోసం, కొత్తదనం నింపడానికి కలెక్టర్లకు అదనపు అధికారాలు మంజూరు చేస్తున్నట్టు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించారు. కలెక్టర్ల సమావేశంలో ఆయన ఈ నిర్ణయాన్ని ప్రకటించారు. జిల్లా పరిషత్ సీఈఓలతో, జిల్లా మంత్రులతో కలెక్టర్లు సమన్వయంతో పనిచేయాలని కోరారు. రైట్ మ్యాన్ ఇన్ రైట్ పొజిషన్ అనే విధానంతో ఇలా చేస్తున్నామని, పాలనలో జవాబుదారీతనం, కొత్తదనం లభిస్తాయని ఆశిస్తున్నట్టు ముఖ్యమంత్రి తెలిపారు.



కలెక్టర్ల సామర్థ్యాన్ని ప్రశంసిస్తూనే వేగం పెంచాలని సూచించారు. అవినీతి పరుల ప్రమేయం లేకుండా చేసేందుకు మంత్రులు, కలెక్టర్లు సమన్వయంతో పనిచేయాలని సూచించారు. ప్రజల్లో పరిపాలనపై సంతృప్తి శాతం పెరగడానికి జన్మభూమి కమిటీల సహకారంతో పనిచేయాలని చెప్పారు. వచ్చే మూడు నెలల్లో గ్రామాల్లో నూటికి నూరు శాతం గ్యాస్ కనెక్షన్లు పూర్తి చేయాలని, ప్రతి ఇంటికీ గ్యాస్ కనెక్షన్ లక్ష్యంగా పనిచేయాలని సీఎం ఆదేశించారు. రుణమాఫీ లబ్ధిదార్ల పేర్లను, మాఫీ అయిన రుణ మొత్తం, పెన్షన్ లబ్ధిదార్ల పేర్లతో కూడిన జన్మభూమి మా ఊరు బోర్డులను గ్రామ పంచాయితీ కార్యాలయంలో, గ్రామాల కూడళ్లలో అంగన్‌వాడీలలో బోర్డులు ఉంచాలని కోరారు. సర్టిఫికెట్ల జారీలో పారదర్శకత ఉండాలని, ఆన్‌లైన్ ద్వారా బర్త్ సర్టిఫికెట్లు, ఆదాయ ధృవీకరణ సర్టిఫికెట్లు ఆన్‌లైన్ పద్ధతిలో జారీకి ఏర్పాటు జరగాలన్నారు. ఒక భూయజమానికి తన భూమి వివరాలు తెలుసుకోడానికి ఎంఆర్ఓ కార్యాలయాన్ని ఆశ్రయించాల్సి వస్తోందని, ఎంఆర్ఓలు వెంటనే స్పందించడం లేదని, భూములు లిటిగేషన్లో ఉన్నాయని చెబుతున్నారని కొన్ని ఫిర్యాదులు వచ్చాయని, ఇటువంటి ఫిర్యాదుల పరిష్కారానికే మీ భూమి అనే పోర్టల్‌ని రెవెన్యూ శాఖ రూపొందిస్తోందన్నారు. అన్ని సర్టిఫికెట్లు కూడా ఆన్‌లైన్ ద్వారా లభిస్తే ప్రజలకు ఎంతో ఉపయోగంగా ఉంటుందని ముఖ్యమంత్రి అన్నారు. ❖

## మీరూ శాసనాలు చదవొచ్చు!

రాయటాన్ని రాత అంటారు. తెలుగు నేలపై రాత రాయటం మధ్యరాతియుగంలోనే పురుడు పోసుకొంది. కొత్త రాతి యుగానికి పూర్తిస్థాయి ఆకారాలనందుకొన్నట్లు శిలాయుగపు చిత్రకళ ద్వారా తెలుస్తుంది. ఆనాటి మానవులు తాము చూచిన జంతువులు, తోటి వారి వేట దృశ్యాలు, ఆట, పాటలు, ప్రకృతిలోని వింతలను సహజ సిద్ధంగా దొరికిన మట్టి రంగులు, ఆకు పసర్లు, జంతువుల కొవ్వు పదార్థాలతో శిలాయుగపు మానవులు తాము నివాసమున్న కొండ గుహలు, చరియలపై అలవోకగా చిత్రించుకొన్నారు. అలా కదిలిన కుంచె కొన్ని సంకేతాలతో ప్రారంభించి, చారిత్రక తొలియుగం నాటికి అక్షర రూపాన్ని అందించింది.

సింధు, గయలో బయల్పడిన బొమ్మలిపి మనదేశపు తొలి లిపి అయినా, ఇంత వరకూ అక్షరమాలను కనిపెట్ట లేకపోవడం వల్ల, ముద్రలపై ఉన్న రాతను చదవలేకపోతున్నాం! ఈ నేపథ్యంలో మన దేశానికి సంబంధించి, అశోకుని శాసనాలే తొలిశాసనాలుగా గుర్తింపు పొందాయి. తెలుగు నేలపై కూడా కర్నూలు జిల్లా పత్తికొండ దగ్గరున్న ఎర్రగుడి, రాజుల మందగిరిల దగ్గర అశోకుని పెద్ద, చిన్న రాతి శాసనాలున్నాయి. లిపి శాస్త్రవేత్తల పరిశోధనల ప్రకారం తెనాలి – రేపల్లె మార్గంలో ఉన్న భట్టిప్రోలు వద్ద గల బౌద్ధ స్థూపం నుంచి వెలువడిన బుద్ధ ధాతుపేటికలపై స్థానిక రాజు విడుదల చేసిన శాసనాలు అశోకుని కంటే ముందు కాలానికి చెందిన శాసనాలని తేల్చి చెప్పారు. 1837లో జేమ్స్ ప్రిన్సెస్, అశోక శాసన లిపి మర్మాన్ని విప్పిన తరువాత దెయ్యాల రాతలనుకొన్న మన శాసనాక్షరాల్ని అందరూ చదివినట్లే, మీరు కూడా మీ ఊరి శాసనాలను హాయిగా చదువుకోవటానికి, 'ఆంధ్రప్రదేశ్' పత్రికలో తెలుగువారి లిపి పరిణామ క్రమంతోపాటు అక్షరాలు ఎలా మారుతూ వచ్చాయో, భాష ఎలా మొగ్గ తొడిగిందో వివరిస్తున్నారు. పురావాస్తు పరిశోధకులు డా. ఈమని శివనాగిరెడ్డి–స్థపతి.

'వాడి తలరాత బాగోలేదు, మనమేం చేస్తాం, బ్రహ్మ అలా రాసి పెడితే మనం మాత్రం ఏం చేయగలం' అన్న వాడుకలు ఎప్పట్నించో ఉన్న నేపథ్యంతో తొలిరాతను బ్రహ్మ రాత అనీ, బ్రహ్మలిపి అని పిలిచారు. భట్టిప్రోలు శాసనాలు, అశోకుని ఎర్రగుడి శాసనాలు, అమరావతి శాసనాలు, నాగార్జున కొండ శాసనాలు, ఆనందగోత్రిన, బృహత్పలాయన, సాలంకాయలన, విష్ణుకుండినుల కాలం వరకూ అంటే క్రీ.పూ. 3 నుంచి క్రీ.శ. 5వ శతాబ్దం దాకా బ్రాహ్మీలిపి, కొద్దిపాటి మార్పులతో అటు రాతి శాసనాలునూ, నాణేల పైన, కుండలపైన, ముద్రకల పైన, రాగి రేకుల పైనా కొనసాగింది. అటు తరువాత దేవనాగరి, తెలుగు, కన్నడ, తెలుగు లిపిగా రూపాంతరం చెందటానికి క్రీ.శ. 16వ శతాబ్దందాకా వేచిచూడాల్సివచ్చింది.

ఇక చదవండి నెల నెలా....

– సంపాదకుడు

# తెలుగు నేలపై శాసనాల తొలి సంతకం– భట్టిప్రోలు

రాజా కుబిరకుని భట్టిప్రోలు ధాతుపేటిక శాసనాలు




ఎ. కురపితునోచ కురమా
తుచకురస శివ సమజుసం పనతి
షాలిగ షముగంచ బుద్ధ శరీరానాం నిఖేతు

బి. బనవ పుతస కురస పితుకస మజుస

బుద్ధుని శరీర ధాతువులను నిక్షిప్తం చేయుటకు 'కుర' అనే అతడు తల్లిదండ్రుల ఆజ్ఞమేరకు శివతో కలిసి ధాతుకరండమును స్ఫటిక పేటికను తయారు చేయించి, తండ్రి బనవనితో కలిసి కుర అనే అతడు కరండాన్ని యిచ్చాడు.

గుంటూరు జిల్లా తెనాలి – రేపల్లె దారిలో రేపల్లెకు 10 కి.మీ. ముందున్న భట్టిప్రోలులో ఒక పాడుబడిన దిబ్బ ఉండేది. ఆ దిబ్బను విక్రమార్కుని కోట, చిన్న లంజ దిబ్బ, పెద్ద లంజదిబ్బ అని పిలిచేవాళ్లు. ప్రపంచ మానవాళికి దు:ఖంలేని శాశ్వతానందమైన అష్టాంగ మార్గాన్ని బోధించటమే కాక అన్ని జీవరాసులు సుఖంగా ఉండాలని కోరుకొన్న మహనీయుడైన గౌతమ బుద్ధుని పరమ పవిత్రమైన అస్థికలు నిక్షిప్తం చేసిన మహాస్థూపం అది. క్రీ.పూ. 3వ శతాబ్ది నుంచి క్రీ.శ. 3వ శతాబ్ది దాకా బహుజన నీరాజనాలందుకొన్న ఆ స్థూపం కారణాలేమైనా, రానురానూ నిరాదరణకు గురై, గడ్డి మొలిచి, పిచ్చి మొక్కలు లేచి, పెచ్చులూడి, శిథిలమైంది. పదిలపరిచే నాథుని కోసం మరో 1300 ఏళ్లు ఎదురు చూసింది. స్థానికులు వెలివేసినా, పరాయి పలుకుకు పులకరించింది. వ్యథాభరిత పురాగాథను వినిపించింది.

1870లో బాస్వెల్, 1871లో సర్ వాల్టర్ ఎలియట్, 1882లో రాబర్ట్ సివెత్ ఈ దిబ్బను పరిశీలించారు. 1892లో అలెగ్జాండర్, ఈ దిబ్బ దగ్గర తవ్వకాలు జరిపి, రాతితో మలచిన బుద్ధుని ధాతు పేటికను వెలికి తీయడంతో ఇది దిబ్బకాదనీ, గొప్ప బౌద్ధ స్థూపమని తెలిసింది. 1870లోనే, ఈ దిబ్బ దగ్గర జరిపిన పరిశోధనల్లో ఒక స్ఫటికపు భరిణ, ముత్యాలుంచిన రాతి ధాతు పేటికలు దొరికాయి. 1969 – 70 లో రాయప్రోలు సుబ్రహ్మణ్యం జరిపిన తవ్వకాల్లో స్థూపం గోడలతో పాటు ఒక విహారపు పునాదులు, సున్నపు బుద్ధుని బొమ్మ దొరికాయి. మళ్లీ ఇటీవల జితేంద్రదాసు ఆధ్వర్యంలో సంరక్షణ పనులు జరిగి సందర్శకులకు చారిత్రక ప్రాశస్త్యాన్ని తెలియజెబుతుంది.

పురావస్తు ఆధారాల ప్రకారం, క్రీ.పూ. 3వ శతాబ్దిలోనే భట్టిప్రోలు స్థూపనిర్మాణం జరిగిందని, ఆ సమయంలోనే స్థానిక రాజైన కుబిరకుని ఆధ్వర్యంలో స్థానికులు, బయటినుంచి వచ్చిన వారు పెద్ద సంఖ్యలో పాల్గొని స్థూపంలోని బుద్ధుని ధాతువులుంచిన రాయి స్ఫటికంతో చేసిన పేటికల నుంచి, పక్కనే బంగారు పూసలు, ముత్యాలు, రాగి వెండితో చేసిన ఆకులు, అడుగు భాగంలో స్వస్తికాకారంలో పేర్చిన 24 నొక్కుడు గుర్తులుగల నాణేలను కూడా ఉంచారు. ధాతు పేటికలపై చెక్కిన బ్రాహ్మీ లిపిని పరిశీలించిన జర్మనీ దేశస్థుడైన బూలర్, వాటి వివరాలను ఎపిగ్రాఫియా ఇండికా, వాల్యూం 0.2, పే. 232లో ప్రచురించటం వల్ల భట్టిప్రోలు స్థూపం, ధాతు పేటికలపైగల క్రీ.పూ. 3వ శతాబ్ది నాటి శాసనాక్షరాలు ప్రపంచవ్యాప్త గుర్తింపును పొందాయి. భట్టిప్రోలులో మొత్తం ఆరు శాసనాలు గుండ్రంగా, చదరంగా తిన్నగా రాయబడినాయి. శాసనాల ముద్రలను ఉన్నవి ఉన్నట్లుగానూ, ప్రక్కన, ఒక్కోసారి కింద ఇప్పటి తెలుగు లిపిలో ఆ శాసన వివరాలను అందుబాటులో ఉంచటాన మౌర్య అక్షరమాల సహాయంతో ఈ శాసనాలను అందరూ చదువుకోవచ్చు. వివరాలను తెలుసుకొని చరిత్రలో విహరించవచ్చు.



డా. ఈమని శివనాగిరెడ్డి– స్థపతి


కె ఎన్ మల్లీశ్వరి

# శతపత్ర సుందరి

కె.ఎన్. మల్లీశ్వరి

"యుద్ధం ముగిసింది. ఒకరు విజేత. ఆ విజేతని నేను గెలిచాను...నేనే గెలిచాను...లోకం వెలి వేసిన ఈ స్వైరిణి, విజేతని గెలిచింది. అహ్హహ్హా " నాటకం క్లయిమాక్స్ లో ఈ డైలాగ్ చెప్పి స్టేజ్ మీద నిల్చున్న చోటనే గిర్రున తిరిగి కూలబడిపోవాలి. ఆ తిరగడం అన్నది రొటీన్‌గా కాదు ఆ పది సెకండ్లలో రంగురంగుల పూసలతో కుట్టిన జలతారు కుచ్చుల చున్నీని ఓడి మరణించిన వాడి మొహం మీద పల్చని తెర కప్పినట్లుగ విసిరి, గెలిచి మరణించిన వాడి వద్ద కూలబడాలి. ఈ ఒక్క సీన్ కోసం ఇంచుమించు వారం రోజులు నాతో ప్రాక్టీస్ చేయించాడు గౌతమ్. నాలుగొందల మందితో కిక్కిరిసిన ఆ చిన్న ఆడిటోరియం ఊపిరి బిగబట్టింది.

నా కళ్ళ ముందు గౌతమ్ తప్ప ఎవరూ లేరు. మా ఇద్దరినీ కలిపి ఉంచే మహోద్వేగపు ప్రవాహమేదో నన్ను నడుపుతోంది. మేలి ముసుగు అంచు పట్టుకోవడం వరకే గుర్తుంది నాకు. ఒంటి మీదకి తెలివి వచ్చేసరికి చప్పట్ల వర్షం. చాలా మంది లేచి నిలబడ్డారు. కొంతమంది పరిచయస్థులు స్టేజ్ మీదకే వచ్చేస్తున్నారు. పక్కకి తిరిగి చూసాను. విస్మయంగా చూస్తూ గౌతమ్. రమ్మని చూపులతో పిలిచే ఉంటాను. చప్పున వచ్చేసి ఆప్యాయంగా హగ్ చేసుకున్నాడు. 'గ్రేట్! గౌతమ్...నీలవేణి నీ డిస్కవరీ' ఎవరో పొగుడుతున్నారు తనని. ' నో నో షీ ఈజ్ వెరీ టాలెంటెడ్' గాభరాగా క్రెడిట్‌ని తోసేస్తున్నాడు.

నవ్వుకుంటూ తల తిప్పి చూసేసరికి స్టేజ్ మీద ఉన్న కోలాహలం మధ్య నుంచి నా వద్దకి రాకుండానే మెట్లు దిగిపోతూ కనిపించాడు సదాశివ. అతని మొహం జేవురించి ఉండడం చూసాను.



ఇంటికి వచ్చీ రాగానే ఫ్రెష్ అయి కూచున్నాను. మళ్ళీ రేపటి నుంచీ ఆఫీస్. నాటకం మత్తు వదుల్చుకుని రొటీన్‌లో పడిపోవాలి. సదాశివ వంటగదిలో మెసులుతున్న చప్పుడుకి కూడా కదలబుద్ధి కాలేదు. సన్ననూలుచీర ఒంటికి చుట్టుకున్నట్లు మనసుకు హత్తుకు పోయిన గౌతమ్ ఊహని విడదీయడం సాధ్యం కావడం లేదు. ఎలక్ట్రానిక్ కోయిల రెండుసార్లు కూసి ఊరుకుంది. 'యక్షుడూ యక్షిణీ చెరొక వియోగ శిఖరం మీదా కూచున్నారు. మేఘమాలా రాత్రంతా అప్పండవున్ చేస్తావా?' వాట్సప్ మెసేజ్...అర్థం కోసం భావం కోసం ఒట్టి అక్షరాల కోసం అట్లా ఎంతసేపు చూస్తూ ఎన్నిసార్లు చదువుతూ ఉన్నానో. మొహం మీద చిటికెల చప్పుడు వినిపించేసరికి కావిలించుకున్న పూలతీగ నుంచి జర్రున కిందికి జారినట్లయి అయోమయంగా చూసాను. ఎదురుగా ఆరా చూపుల సదాశివ.

"ఏ లోకంలో ఉన్నావ్ నీలవేణీ?" మాటని కాస్త వంకర తిప్పి వదిలాడు. ఊనిక కూడా ఇట్టే అర్థమైపోతుంది. ఖర్మ...ఈ బుర్ర కాస్త తుప్పుబట్టి మొద్దుబారితేనేం! బలవంతంగా నవ్వాను. "సారస లోచనకి రసభంగమైతే సాలోచన అవుతుంది కదా? ఏమి నీ ఆలోచన స్వైరిణీ?" దగ్గరగా వచ్చి గుసగుసగా అన్నాడు.

స్వైరిణి! నన్ను స్వైరిణి అంటున్నాడు సదాశివ. స్వైరిణులను గురించి మేమిద్దరం మురిసిపోయిన అర్థంలో కాదు. లోకం ఏమనుకుంటుందో అట్లా అంటున్నాడు. ఏ అర్థం లోంచయినా ఏ అద్దం లోంచయినా నేను స్వైరిణి కావడం నాకేం బాధ లేదు కానీ సదాశివ ఉత్తినే నన్ను పలకరించలేదు. చాలా వెంట బెట్టుకుని వచ్చాడు. అలసటగా ఉంది. వాదించాలని లేదు. పోట్లాడాలని అస్సలు లేదు. డబుల్ కాట్ మీదకి చేరి తల వైపు గోడకి అమర్చి ఉన్న డ్రీమ్ బుక్ షెల్ఫ్‌లోనుంచి మాయా ఏంజిలో ఆత్మకథ తీసుకున్నాను. 'ఐ నో వై ద కేజ్‌డ్ బర్డ్ సింగ్స్'

పరిగెత్తుకొస్తున్న చిన్నపిల్లల చేతి గ్లాసులో ఉద్రేకంగా తుళ్ళి పడే నీళ్ళలా సదాశివలోని సంచలనం నాకు తెలుస్తూనే ఉంది. ఇపుడు మాట్లాడితే చర్చలు కాక వాదనలే జరుగుతాయి. ఇబ్బందికర సత్యాలే వాదనలు. ఎవ్వరం భరించలేం.

"నువ్వు స్థిమితంగా లేవు సదా! అన్నం తిని పడుకోకూడదూ రేపు మాట్లాడుకుందాం" చెప్పి పుస్తకం తెరిచాను. 'లేదు. ఇపుడే మాట్లాడుకుందాం' అనొచ్చుగా! అట్లా చెప్పలేదు. గాజు కిటికీ దగ్గరున్న బార్ స్టూల్ ని ఒక్క తన్ను తన్నాడు. అది వెళ్ళి టీపాయ్ మీద పడింది. దాని మీదున్న దంతపు ఫ్లవర్ వాజ్ కిందపడి భళ్ళున ముక్కలయింది. మా సాహచర్యంలో సదాశివ ఇంత వయొలెంట్‌గా ప్రవర్తించడం ఇదే మొదటిసారి.

పెద్ద శబ్దం తర్వాతి నిశ్శబ్దానికి కూడా చెవులు అలవాటు పడ్డాక ఇద్దరం కలిసి శిధిలాలను ఏరుతుంటే అపుడు అడిగాడు మొహమాటంగా, "అతనితో తెంపుకోలేవా నీలూ?" అని. ఎవరన్నా ఏవన్నా అడిగినపుడు ఇచ్చేయడమే చాలా సులువు. కాదని చెప్పడం ఎంత కష్టమో చెప్పేవాళ్ళకే తెలుసు. గౌతమ్ నాకు సొంతమై ఉన్నాడా లేదా అని కాదు అతనంటూ ఈ లోకంలో ఉండడమే నాకు ఒక సెలబ్రేషన్ అయినపుడు, గట్టిగా హత్తుకుని ఉండడమూ విడిచి పెట్టి ఉండడమన్నది రెండు కాదు – ఒకటే! అయినా వచ్చేసిన పండగని వద్దు పొమ్మంటే పోతుందా? నేను గాజు పెంకుల కోసం మూలమూలలూ వెతుకుతుంటే తనే కంటిన్యూ చేసాడు.

"...ఈ పదేళ్లుగా మనం ఫామిలీ లైఫ్‌లో స్థిరంగా ఉన్నాం కదా డిస్టర్బ్ చేసుకోవడం ఎందుకు? మనిద్దరం జీవితాంతం కలిసి ఉండాలనుకున్నాం. నాతో సమస్యల్లోంచి కాక నీ ఇష్టతలోంచి నువ్వటు మొగ్గుతున్నావు. అది నాకు చాలా భయంగా ఉంటోంది. నాతో సమస్యే అయితే అది ఏదోలా తీర్చుకోవచ్చు. కానీ కాదు. చాలా ఒత్తిడిగా ఉంటోంది. గట్టిగా చెప్పాలని ఉంది. ఇట్లా వద్దు. అతనితో మానెయ్. మనం హాయిగా ఉన్నాం. ఎప్పటికీ ఇలాగే ఉండగలం. నాకెంత కష్టంగా ఉందంటే పిచ్చివాడిలా అయిపోతున్నాను. ఓర్చుకోలేకపోతున్నాను." పెంకులు అక్కడే పారేసి, అంతటి సదాశివా నేల మీద విసిరేసినట్లు కూలబడిపోయాడు

అతని కష్టానికి నాకూ దుఃఖం వచ్చింది. తన చేతులు ఒళ్ళోకి తీసుకుని నిమురుతూ కూచున్నాను. 'నా వల్ల కాదు.' చేతులు తోసేస్తూ అంటున్నాడు. మరి నా ఓర్పు నా భారం నా కష్టం సంగతేంటి? నాలో ఏదో రగులుతున్నట్లు అగ్ని పర్వతం బద్దలవుతున్నట్లు ఉంది. ఎలా ఓర్చుకోవాలో ఎలా భరించాలో అన్ని స్వేచ్ఛలనీ గట్టిగా నమ్మిన ఈ క్రిమినల్ లాయర్ సదాశివకి నేను చెప్పాలా? చెప్పాలి. చాలా గుర్తు చేయాలి. తనకి

పోటీగా వెళ్లి సమర్థించుకోడానికి కాదు. నేనెట్లా నెగ్గుకుని ఈ మానవ సంబంధాన్ని నిలుపుకున్నానో తెలిస్తే అది తనకి సాయపడుతుందేమో అన్న ఆశతో చెప్పాలనిపిస్తోంది.



మా ఇద్దరి సహజీవనం మొదలయ్యేప్పటికే సదాశివ అంటే నాకు చాలా ఇష్టం. ఇద్దరం ఒక గూటి కిందకి వచ్చీ రాగానే అతని హృదయంలోకి తొంగి చూసాను. ఎంత ఖాళీగా విశాలంగా ఉందో! నన్ను రారమ్మని పిలిచింది. వెంటనే ఒక రంగురంగుల చాప తీసుకుని పరిగెత్తుకు వచ్చి అతని హృదయమంతా పరిచి దర్జాగా దాని మీదెక్కాను. కాసేపు పరుగులు పెట్టాను...కాసేపు బాసింపట్టు వేసుకు కూచున్నాను. కాసేపు నడుం వాల్చాను. కాసేపు చెవొగ్గి తన సంచలనాలు బాధలు నవ్వులు విన్నాను. అట్లా కాలు మీద కాలేసుకుని ఏలుతున్నానా?! ఓ రోజు హటాత్తుగా ఇంతలేసి కళ్ళ పిల్ల, అదే...బాదంకాయ కళ్ళ పిల్ల నేను పరుచుకున్న చాప మీదకి వచ్చి ఉడత పిల్లలా మిటుకూమిటుకూ మని చూసింది. మీకు తెలుసా అపుడు ఉడత పిల్ల కూడా భయపెట్టగలదని. నిజానికి భయమో అభద్రతో ఏదో నాలో ఇంకే లోపే ఆ పిల్ల సదాశివ ప్రేమని వాత్సల్యాన్ని కొద్దిగా కొరికి చూసి పారిపోయింది.

కానీ లక్లీ లాయరమ్మ అని సదాశివ ముద్దుగా పిలుచుకునే ఆమె మాత్రం గొప్ప మాంత్రిక శక్తితో సివంగిలా దూకింది. ఆ దూకుడు చూడగానే అర్థమైపోయింది ఆమె శక్తి ఏంటో! సన్నగా తెల్లగా పొడవుగా ఉండే లాయరమ్మ, మృదువైన మాటల లాయరమ్మ తన సమస్తాన్నీ త్యజించిన ప్రేమతో సదాశివని ఆరాధించింది. సదాశివే ఆమెని తన హృదయంలోకి వెంట బెట్టుకుని వచ్చాడు. నేను నా రంగురంగుల చాప అంచుల్ని గట్టిగా బిగించి పట్టుకుని కొన్నాళ్ళు బెట్టుగా బింకంగా ఉండిపోయాను. కానీ ఎక్కువ కాలం సాధ్యం కాలేదు. నాకు అక్కడ చోటు తరిగిపోతోంది. రంగుల చాప కుంచించుకుపోతోంది. నన్నెవరో నెట్టేస్తున్నట్లు ఎందులోనో కుక్కేస్తున్నట్లు ఇరుగ్గా ఉక్కిరిబిక్కిరిగా అయిపోయాను. కొండంత నన్ను పిడికిలంత చేస్తున్నందుకు ఎవర్ని నిందించాలి? ఎవరితో పోట్లాడాలి? వచ్చినవాళ్ళే తిరిగిపొండి ఈ చోటంతా నాదే నాదే అని గొంతు పగిలేలా అరవాలనిపించింది. ఇతను నా ఒక్కదాని వాడు నువ్వు పో అని ఒక చింతరువ్వ తీసుకుని ఆ ఎల్లాపిగత్తె వెంటబడి తోలెయ్యాలనిపించేది. ఏడ్చి మొత్తుకుని సదాశివ మనసు మళ్ళించాలి అనిపించేది. కానీ అట్లా చేయడం నా వల్ల కాలేదు. ఒకరినొకరం వారి సమ–స్తంతో సహా అర్థం చేసుకోవడం సాధన చేసినవాళ్ళం కదా!

ఏం చేయాలో తెలీని నిస్సహాయత లోనుంచి అపుడు నేనొక పని చేసాను. తనని లాక్కోడానికి పోటీ పడటం, నిందించడం, విడిపోవడం, ద్వేషించడం, కక్షతో వేరే సంబంధంలోకి వెళ్ళడం, అందరికీ చెప్పుకుని వాపోవడం లాంటివి చేయలేదు. ఏం చేసానంటే సదాశివని మరింత ప్రేమించడం మొదలు పెట్టాను. కోపం భయం ద్వేషం పగ అన్నింటినీ విసిరి కొట్టి ప్రేమించడం ఒకటే నాకు బాగా తెలుసునన్నట్లుగా ప్రేమించాను. లాయరమ్మతో పోటీ పడి కాదు. అప్పటివరకూ విశాలంగా పరుచుకుని హొయలు పోయిన రంగురంగుల నా ఆశల చాపని చుట్టగా చుట్టి తట్టాబుట్టా సర్ది చంకనబెట్టుకుని తన హృదయంలోనే ఓ వారగా నిలబడి అది ఆడుతున్న సయ్యాటల్ని చూస్తూ మరీ ప్రేమించాను. ఎందుకట్లా ఇదేం త్యాగం?! కోప్పడింది సన్నిహితురాలైన కామన్ ఫ్రెండ్. నన్ను ప్రేమించిన సదాశివని మాత్రమే నేను ప్రేమించలేదని చెప్పాను. సదాశివ అంటే ఉత్తి చేతులతో సాయం కోరే వారికి మేలు చేసే మంచి లాయర్ అనీ, సంస్కారవంతుడనీ, లోకాన్ని మెరుగ్గా అర్థం చేసుకోగల సమర్థుడనీ తను నాకు ఏదో ఒక స్థాయిలో తప్పకుండా కావాలి అన్నది అర్థమయ్యాక ప్రేమించడం ఒకటే నేను చేయగల పనిగా తోచింది.



నా మాటలు మధ్యలోనే ఆపేసాడు సదాశివ. అతని మొహం ఎర్రబారిపోతోంది. భరించలేకపోతున్నాడు. తను పొందిన దానికి ప్రతిగా నేనేం కోరతానోనని భయపడుతున్నాడు. చటుక్కున లేచి గాజు పెంకులు చెత్తబుట్టలో వేసి స్టూల్ బాల్కనీ లో పెట్టి చేతులు కడుక్కుని వచ్చాడు. పడకగదిలో ఉన్న మినీ ఫ్రిజ్ తెరిచి సోడా బాటిల్ తీసాడు. పళ్ళెంలో ఉన్న మంచింగ్స్ నా వైపు తోస్తూ సజెస్టివ్‌గా గ్లాస్ చూపించాడు.

"నాకు ఇపుడొద్దు" అన్నాను.

చిత్రంగా కళ్ళెగరేసి "కొత్త పాతివ్రత్యమా?" అనేసి తమాయించుకుంటూ సారీ చెప్పి, అయినా సరిపోనట్లు "అతనికి అలవాటు లేదా?" వేవరింగ్ గా ఉన్న గొంతుతో అన్నాడు.

"నీకు గౌతమ్ మీద కన్సర్న్ లేకపోయినా పర్లేదు. కానీ మనిషి అన్న గౌరవం అయినా ఉంటే తన గురించి ఇష్టంతో ఎంతైనా చెప్పుకోగలను. కానీ నేను ఇపుడేం

మాట్లాడినా నీకు బాధ కలుగుతుంది. ఇక ఎందుకు చెప్పు?"

ఒక గ్లాసు పక్కకి నెట్టేసి రెండో గ్లాసు బుగ్గకి ఆనించుకుంటూ 'ఒంటరి గ్లాసువాడినయ్యానన్నమాట' అన్నాడు. లావెండర్ కలర్ డావిన్సీ క్రిస్టల్ గ్లాసులవి. ఒక గ్లాసు మీదే లెక్క పెట్టలేనన్ని చిన్ని చిన్ని పలకలు. ప్రతి పలక మీదా సదాశివ రూపం కనపడుతోంది. అనేక సదాశివలు.



మనుషులు బాగా నచ్చినపుడే కాదు. అస్సలు నచ్చక శత్రువర్గంగా మారిపోయినపుడు కూడా ప్రత్యేకమైన కుతూహలం ఉంటుందనుకుంటాను. అట్లాంటి కుతూహలంతోనే కాబోలు ఆ రోజు తన స్నేహితుడు ఏర్పాటు చేస్తున్న చిన్న గాదరింగ్‌కి గౌతమ్‌ని కూడా పిలిచాడు సదాశివ. పబ్లిక్ ఎటెన్షన్ బాగా ఉండి, గత పదేళ్ళుగా నలుగుతున్న ఒక కేసులో బాధితుల్ని గెలిపించగలిగాడు సదాశివ. ఆ సందర్భంగా అతన్ని అభినందించడానికి ఈ చిన్న కార్యక్రమం. ఈ కేసు గెలవడం మానసికంగా తనకి ఎంత సంతృప్తినిస్తుందో ఈ పదేళ్ళ కాలంలో అతని ఒత్తిడిని బట్టి గ్రహించగలను.

పార్టీకి తన సన్నిహితులు పాతికమంది వరకూ వచ్చారు. గౌతమ్ కూడా వచ్చాడు. ఈ కేసు సందర్భంగా తన అనుభవాలు చెపుతూ ఎవరెవరి నుంచి ఎన్ని ఒత్తిళ్ళు వచ్చాయో తనెట్లా నలిగిపోయాడో చివరికి ఎట్లా స్థిరంగా నిలబడిపోయాడో చెపుతున్నప్పుడు చాలా మంది కళ్ళు తడి చేసుకుని దగ్గరకి వచ్చి మరీ తనని కావిలించుకున్నారు. అపురూపమైన వ్యక్తి కదా ఆ బహుమానాలు సహజమే. తనింకా చెపుతూ ఒకటి రెండు సందర్భాల్లో తనలో తీవ్రమైన డిప్రెషన్ సూచనలు కనిపించాయని అపుడు ఒక వ్యక్తి విలువైన స్నేహం ద్వారా తనని నిలబెట్టిందని చెపుతూ ఆగాడు...నేను లాయరమ్మ వంక చూసాను. ఆమె తలవంచుకుని చిన్నగా మురిపెంగా నవ్వుకుంటోంది. ఊహించని విధంగా సదాశివ దగ్గరగా వచ్చి నా నడుము చుట్టూ చేయి చుట్టి 'థాంక్ యూ నీలూ!' అన్నాడు. వావ్... అంటున్న అందరి చప్పట్ల హోరు లోంచి లాయరమ్మని చూసాను.

నా జీవితంలోకెల్లా అత్యంత అవమానంతో సిగ్గుపడిన క్షణాలవి. లాయరమ్మ మొహంలో కనిపిస్తున్న భావాన్ని నేను చదవగలనా? చూస్తూ చూస్తూ ఉండగానే మనకి తోడయిన మనిషి వేళ్ళ కింద ఇసుకలా మెత్తగా జారిపోతున్నపుడూ, అప్పటివరకూ మన మీదే స్థిరంగా ఉన్న మాటలూ చూపులూ నవ్వులూ నడకలూ ఉద్వేగాలూ మనల్ని ఖాళీ చేసో మరో పాయ తీసుకునో మరో వైపు పరుగులెడుతున్నపుడూ ఖాళీ అయినంత మేరా దొల్లబారి జవజవలాడే మనుషుల మొహాల్లో ఏ భావం ఉంటుంది!. బహుశా ప్రేమ లేకపోయినందుకు కాదేమో 'ఎవాయిడ్' చేయబడుతున్నందుకు, 'నా జీవితానికి అతుక్కుపోయేంతగా ప్రేమించకు, ఆశించకు' అని ఈ విధంగా తెలియజెపుతున్నందుకు, చిటికేస్తే రాలిపడే ప్రేమల కన్నా ఈ ఒంటరి మహా నగరాల్లో నా చిన్ని కుటుంబమే నాకు చాలా ముఖ్యం అని ప్రకటిస్తున్నందుకు, రోదసీ నుంచి భూకక్ష్య లోకి ప్రవేశించే వ్యోమనౌక ఫెయిలయ్యి పేలిపోయినంత భీభత్సం ఆమె మొహంలో.

> పాత నిబంధన ఏడుగురు ప్రవక్తల్లో నిష్ఠురమైన నిజాలు చెప్పేవాడిగా పేరున్న జరిమియా సత్యప్రకటన సమయంలో కుండ బద్దలు కొడతాడు. సత్య ప్రవచకులు విధిగా ప్రదర్శించవల్సిన కాఠిన్యానికి బద్దలయ్యే మట్టికుండ బహుశా ఒక ప్రతీక కావొచ్చు. జరిమియా కర్తవ్యాన్ని తెలుగు సాహిత్యంలో నెరవేర్చడం వంటిది కె ఎన్ మల్లీశ్వరి రచనా వ్యాసాంగం మొత్తం. ఆ ప్రవక్తకి లానే నిష్ఠుర సత్యాల్ని ప్రకటిస్తూనే, అదంత కఠినంగా చేయాల్సిన పనిలేదని నిరూపిస్తుంది ఆమె అక్షరం. రచనలో ఆమెది బహుముఖ ప్రజ్ఞ. తెలుగు సాహిత్యంలో డాక్టరేట్ చేసి విశాఖపట్టణంలో తెలుగు ఆచార్యులుగా పనిచేసి, ఇటీవల పూర్తిగా రచనకే తన మొత్తం సమయాన్ని కేటాయిస్తున్నారు. మల్లీశ్వరి. కథలు (మూడు కథా సంకలనాలు), సాహిత్య వ్యాసాలు (రెండు సంకలనాలు), కవిత్వం, యాత్రాకథనాలు, బ్లాగు రచనలు... వంటి వివిధ ప్రక్రియల్లోకి విస్తరించిన ఆమె రచనల్లో అంతస్సూత్రం వంటిది మల్లెమొల్ల పారిజాత సౌకుమార్యం. స్త్రీ-పురుష సంబంధాల్లోని ఐక్యత- ఘర్షణని నైతికానైతికాలకి అతీతంగా చూసే ఈ కథ, మల్లీశ్వరి సాహిత్యపు రూప-సారాలకి ఒక ఉదాహరణ.

'నాకు ఇన్స్టిట్యూషనల్ గౌరవం బాగానే దక్కించావు.!' తిరిగొస్తున్నపుడు కార్‌లో ఈ మాట అనకుండా ఉండలేకపోయాను.

'ఏం! గౌతమ్ ఉన్నందుకు ఇబ్బంది పడ్డావా?' సదాశివ తాపీగా సమాధానం ఇచ్చినప్పుడు అర్థమైనది గౌతమ్‌ని ఎందుకు పిలిచాడో. ఇంటికొచ్చేవరకూ ఆ షాక్ నుంచి తేరుకోలేకపోయాను.

రాగానే సోఫాలో కూలబడి టీవీ పెట్టి దాని వైపు చూడకుండా సీలింగ్ చూస్తూ కూచున్నాడు. అరగంట అయినా అదే పరిస్థితి. " మనుషులకి అన్ని రకాల స్వేచ్ఛలూ ఉండాలని అదే అంతిమవిలువ అనీ నువ్వే ఎన్నోసార్లు వాదించావు. ఇద్దరం నమ్ముతున్నాం కూడా కదా ? ఈ విషయాన్ని నా విజ్ఞతకే వదిలేయకూడదా? నిన్ను దాటి పోవాలని నాకేం లేదు. పోనీ అతన్నలా నా జీవితంలో ఓ పక్కగా ఉండనీయి. నీకేం అడ్డు సదా?" అతనికి ఎదురుగా కూచుని అడిగానేమో మరీ స్పష్టంగా కనపడుతున్నాడు. నా మాటలు వినగానే కాదన్నట్లు చేతులు గాలిలోకి విసిరాడు. తల అడ్డంగా ఊపుతూ ఆరోపణ ధ్వనిస్తున్న గొంతుతో –

"అతనేం పక్కగా లేదు. నిన్ను లాగేసుకుంటున్నాడు. లైక్ బ్లాక్ హోల్...అయినా నీలూ మనిద్దరం జీవితాంతం కలిసుండాలని సహజీవనంలోకి వచ్చాం. అపుడు మిగతా స్నేహాలు నో స్ట్రింగ్స్ అటాచ్డ్‌గా ఉండాలి. కానీ నువ్వతనితో ఎమోషనల్‌గా ఉంటున్నావు. బాహాటంగా ఓపెన్ అవుతున్నారు మీరిద్దరూ!."

మన ఆచరణ శక్తి ఎంతవరకో అంతవరకూ ఉన్నదే విప్లవమన్న మేధావులను లోకం చాలానే చూసింది. సదాశివ ఇంతవరకూ రాగలిగాడు కనుక అతని పాటికిదే న్యాయం.

నేను మాట్లాడకపోయేసరికి నిస్పృహగా మొహాన్ని చేతులతో రుద్దుకుంటూ... "ఏం జీవితాలివి! అందరికీ ఏవో ఖాళీలు. ఏం చేస్తాం? ఎవరి మార్గాల్లో వాళ్ళు వెతుక్కుంటారు. కానీ ఉన్నంతలో ప్రాక్టికల్‌గా ఇబ్బందులు లేకుండా కాస్త తెలివిగా ఉండాలి కదా నీలూ? డ్యూయల్ వాల్యూస్ ఉండకూడదని నా సంస్కారం పదేపదే హెచ్చరిస్తుంది కనుక చెప్తున్నా. నీకు ఎవరి పట్లయినా ఆకర్షణ కలిగితే వన్ నైట్ స్టాండ్ తీసుకో...లేదూ కాదూ అంటే కాజువల్ రిలేషన్‌షిప్ లో ఉండు..." గాయపడి రక్తమోడుతున్న పావురంలా విలవిల లాడుతున్నాడు సదాశివ.

చప్పున లేచి వెళ్ళి తన భుజాల చుట్టూ చేతులు వేసి "అట్లా హింసించుకోకు సదా! ప్లీజ్..." నా నెప్పిని దాచిపెట్టుకుంటూ ఓదార్చబోయాను.

"...నాకే శక్తి ఉంటే నేనే నీకు సమస్తమూ అవ్వాలని ఉంటుంది. అది సాధ్యమైతే ఎంత బావుండేది నీలూ ! కానీ అట్లా కాలేదు. నా వల్లనే కాలేదు. నీకు నిలకడగా స్థిరంగా తదేకంగా ఉండే బంధం కావాలి నాకు తెలుసు. నేనట్లా కాలేకపోయాను. గౌతమ్ మాత్రం కాగలడా!? "

లాజిక్ వరకూ అయితే తన ప్రశ్నకి తిరుగులేదు. " నిజమే సదా! " ఒప్పుకున్నాను.

" ఇక ఇపుడు నేనేం చేయగలను.! ఏం చేస్తే ఈ నెప్పి పోతుంది నీలూ? "

నా వంకే దీర్ఘంగా చూస్తున్నాడు. నేనూ చూపు కలిపాను.

ఎంత సేపో అలా...

తనకి చాలా ఇష్టమైన ఎడతెగని నా కంటిచూపుని తాడు వలే పేని మెడకి చుట్టుకుంటున్నట్లు అభినయించి 'చచ్చిపోనా పోనీ?' అన్నాడు.

"రా."

వచ్చాడు. ఎప్పట్లాగా తెల్ల పూలదండ అంచుల సముద్రుడై రాలేదు. విలయం సృష్టించే సునామీలా వచ్చాడు. నా మనశ్శరీరాలతో సంభాషించడానికి రాలేదు. నా హృదయంలోని ప్రియమైన వ్యక్తి ఉనికిని నిర్మూలించాలన్న క్రోధంతో వచ్చాడు.

జీవితం నాటకం కాదు గదా తెర పడే లోపు యుద్ధం ముగియడానికి!



# కాటన్‌కు నిజ నివాళి

సాధారణంగా తల్లిదండ్రుల కర్మకాండలు జరిపే సమయంలోనే మూడు పిండాలను పెట్టి కార్యక్రమాన్ని నిర్వహిస్తాం. తండ్రి, తాత, ముత్తాతలకు అవి చెందుతాయి. కాని గోదావరి జిల్లాలలో నాలుగు పిండాలు పెడతారు. నాలుగో పిండం ఎవరికన్నదే జలం ప్రాధాన్యతను తెలిపే అంశం. అది ధవళేశ్వరం ఆనకట్టతోపాటు ప్రకాశం బ్యారేజ్ కట్టిన సర్ ఆర్థర్ కాటన్ మహాశయుడికి చెందుతుంది.

గోదావరి జిల్లాల ప్రజలు కాటన్‌ను మరువకుండా ఆయనను పిండ ప్రధానంలో చేర్చి తమ రక్త సంబంధీకుడిని చేసుకున్నారు. నీటికి ఉన్న ప్రాధాన్యత అటువంటిది దీనిని గుర్తెరిగి వ్యవహరిస్తున్నారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు. కాటన్ స్ఫూర్తిని నేటి తరం ఇంజనీర్లకు అందిస్తూ వారిని తనతోపాటు జలదీక్షకు సమాయత్తం చేసారు. కాటన్ జన్మదినాన్ని రాష్ట్ర పండుగగా నిర్వహించటమే కాక, డాక్టర్ కెఎల్ రావు, రామకృష్ణయ్య, మోక్షగుండం విశ్వేశ్వరయ్యల జయంతులను కూడా అధికారికంగా చేపడతామని ప్రకటించారు. రాష్ట్రంలోని అన్ని జిల్లాలు కవర్ అయ్యేలా రొటేషన్ ప్రాతిపదికన జయంతులను చేపట్టాలని నిర్దేశించారు. తూర్పు గోదావరి జిల్లా ధవళేశ్వరం గ్రామంలో మే 15న జరిగిన సర్ ఆర్థర్ కాటన్ 212వ జయంతి కార్యక్రమంలో పాల్గొన్న ముఖ్యమంత్రి భావితరాలకు స్ఫూర్తి నింపేలా ప్రసంగించారు. జలవనరులను కాపాడుకోవాల్సిన ఆశక్యకతను వివరించారు. సిఎం ఆలోచనలు, ఆకాంక్షలకు అనుగుణంగా ముందడుగు వేసే జలవనరుల శాఖ మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు ఇంజనీరింగ్ సిబ్బంది తమ పనులలో పునరంకితం కావలసిన ఆవశ్యకతను వివరించారు. పలువురు ప్రముఖులు కాటన్ మహాశయుడి గొప్పతనాన్ని కొనియాడగా, ఆయన చూపిన బాటలో పయనించవలసిన ఆవశక్యతను వివరించారు.

కాటన్ మహాశయుడి జన్మదిన వేడుకలను ప్రభుత్వ పండుగగా నిర్వహించింది. జనవనరుల శాఖలో వివిధ స్థాయిలలో పనిచేస్తున్న 4,500 మంది ఇంజనీర్లలో పునరుత్తేజం నింపేలా వారికి దిశా నిర్దేశం చేసారు. మహానుభావుడు సర్ ఆర్థర్ కాటన్ మన దేశానికి చెందిన వ్యక్తి కాకున్నా, ఇక్కడి రైతుల అవసరాల నేపథ్యంలో ఎన్నో ప్రయాసలకోర్చి ధవళేశ్వరం ఆనకట్టతో పాటు ప్రకాశం బ్యారేజ్ నిర్మించి తెలుగు ప్రజల మనస్సులలో చిరస్థాయిగా నిలిచిపోయారు. ఆ మహనీయుడిని స్మరించుకునే క్రమంలో ఆయన జయంతిని జలవనరుల శాఖ పెద్దఎత్తున నిర్వహించింది. విభిన్న కార్యక్రమాల సమాహారంగా ఇది జరగగా, ప్రత్యేకించి ఇంజనీర్లతో ఒక ప్రమాణ పత్రాన్ని చదివించి రాష్ట్ర ప్రయోజనాలు, అభివృద్ధిని కాంక్షించేలా ఉత్తేజితులను చేసారు. కాటన్ జయంతి వేడుకలలో భాగంగా ప్రాంగణంలో త్వరితగతిన పూర్తి చేయాల్సిన ఏడు సాగునీటి ప్రాజెక్టుల నమూనా చిత్రాలు, సంపూర్ణ సమాచారంతో ఏర్పాటు చేసిన ప్రదర్శన సందర్శకులను ఆకర్షించింది. అదే క్రమంలో నీటిపారుదల శాఖకు అత్యాధునిక యంత్ర సామగ్రిని సమకూర్చాలని మంత్రి దేవినేని భావిస్తుండగా, తయారీ సంస్థలు అక్కడ ప్రదర్శనలు ఏర్పాటు చేసాయి.



జయంతి వేడుకల నేపథ్యంలో కాటన్ జీవిత విశేషాలు, ఆయన సేవాతత్పరత వంటి అంశాలను ఒక చోట చేర్చి సమగ్రంగా ఇంజనీర్లకు అందించటం ద్వారా వాలిలో పునరుత్తేజం నింపే ప్రయత్నం జరిగింది. కాటన్ చరిత్ర సమాజానికి తెలిసినప్పటికీ కొత్త కోణంలో దానిని అందుబాటులోకి తీసుకు వచ్చి జలవనరుల ప్రాధాన్యత తెలియ చెప్పటంలో మంత్రి దేవినేని ఉమా మహేశ్వరరావు తనదైన ప్రత్యేకత చాటుకున్నారు. కాటన్ 1852లో గోదావరి నదిపై ధవళేశ్వరం బ్యారేజిని నిర్మించగా, ఆ తరువాత ప్రకాశం బ్యారేజి నిర్మాణం సాగించారు. విశాఖపట్నం పోర్టుకు కూడా కాటన్ పునాది వేసినట్లు రికార్డులు చెబుతున్నాయి. విదేశీయుడే అయినా స్వదేశీయులను మించి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి కృషి చేసిన కాటన్‌కు మంత్రి దేవినేని ఉమా మహేశ్వరరావు ఆలోచన, ముఖ్యమంత్రి చంద్రబాబు కూడా సంపూర్ణ ప్రోత్సాహంతో ఇప్పటికి నిజమైన నివాళి దక్కింది. మృతి అందరిదీ కాగా, స్మృతి కొందరిదే. వారిలో కాటన్ ఒకరు.

– రవి కుమార్ బొప్పన
మీడియా లైజనింగ్ అధికారి

# •e˝+ø sêCX« ] <$ [16 జనవరి 1954 – 25 ఏప్రిల్ 2015]

కవిత్వ ప్రియులకి దాదాపు నాలుగు దశాబ్దాలుగా సాహితీ నేస్తం శివలెంక రాజేశ్వరీదేవి. సాహిత్య వ్యాసాలు, కవితలు దాదాపు అన్ని ప్రముఖ దిన, వార పత్రికలలో ప్రచురితమయ్యాయి. ప్రసిద్ధ స్త్రీవాద కవితా సంకలనాలు 'గురిచూసి పాడే పాట', 'నీలిమేఘాలు' లో ఆమె కవితలు అచ్చయ్యాయ. విశాలాంధ్రవారు ప్రచురించిన కవితా సంకలనంలో రాజేశ్వరిదేవి కవిత చోటుచేసుకుంది. మో (వేగుంట మోహన్ ప్రసాద్) 'ఇల్యూషన్ అండ్ రియాలిటీ' అనే శీర్షికతో రాజేశ్వరీదేవి కవితను ఆంగ్లంలోకి అనువదించారు. కవిత్వం మీద ఆకాశవాణిలో అనేక ప్రసంగాలు చేశారు. శరత్‌బాబు, చలం, వడ్డెర చండీదాస్, వేగుంట మోహన్ ప్రసాద్ రచనలు ఆమె అభిమానించేవారు. రాజేశ్వరీదేవికి ఆంధ్రప్రదేశ్ నివాళి.

## నాలుగునాళ్ళనుంచీ

ఇప్పటికి నాలుగునాళ్ళనుంచీ ఏకాంత రాతిరివేళ
రోజురోజుకీ రోజురోజుకీ
హృదయం మీంచి తేనె బొట్టుబొట్టుగా
పట్టలేనంత సంతోషంగా వుంది
మాటల్లో చెప్పటానికి వీలుకానంత
అక్షరాల్లో బంధించటానికి చేతకానంత
స్వరాల సరిగమల్లో యిమడ్చలేనంత
అశక్తతగా వుంది
ఆర్తిగా వుంది
ఆశగా కూడా వుంది
ఏమనంటే–
ఒచ్చేనాటికి నేనింకా విశాలతలోకి
పయనించాలన్న ఆశగా
నాలుగు రోజులుగా అక్షర చిత్రాలు
నాలో నవ్వులయి పువ్వులయి
పరిమళిస్తున్నాయి
ఇప్పటికిక నా మనసు నిండినట్లుంది
నాకు తెలుసు కానీ మళ్ళీ తెలిసింది
నేను ఏదో ఒక కళాత్మక రూపానికి మాత్రమే
బందీనవుతానని
ఏదో ఒక వెన్నెల రాగమే
నా దాహార్తిని తీరుస్తుందని
పైపైని పైపైని ఆషామాషీలు
నన్ను కదిలించలేవనీ
ఇలా యిప్పటికి యింకా
ఈ మలిసంజెలో
నన్ను నేను తెలుసుకుంటున్నట్లుగా వుంది..
సంభ్రమంగా వుంది
నా దోసిట్లోని ఈ అక్షర పారిజాతాలు
ఆ శారదామాత పాదాల మీద–
అభినందనలతో, వాత్సల్య బలహీనతతో..

(శివలెంక రాజేశ్వరీదేవి చివరి కవిత)

## ఎటో వెళ్ళిపోయావా... రాజ్యం!



రాజేశ్వరీదేవి వెళ్ళిపోయినదన్న షార్ట్ మెసేజ్ చూడగానే ఒక్కసారిగా తల తిరినట్టయింది. ఎలా! ఎలా? నిన్న మొన్నటిదాకా మాట్లాడుతూనే ఉంది కదా! తన కవితలన్నీ ఏరిపోగు చెయ్యమన్నాను. 'ఇదిగో అదిగో వెతుకుతున్నాను. కొన్ని దొరికేయి,' అంది కదా! ఈ లోపున ఆ పని పూర్తి చెయ్యకుండా ఎటెళ్ళిపోయింది. అరె! చెప్పా పెట్టకుండా ఎలా వెళ్ళిపోయింది. మరణం ఇంత సులభమా?

అసలు వీళ్లంతా ఎక్కడికి వెళ్ళిపోతున్నారు – మా అమ్మా, నాన్నగారూ, ఇస్మాయిల్, త్రిపుర, నిన్న మొన్నటి కవితా ప్రసాద్, విజయనగర పండితులు యు. వి. నరసిమ్మూర్తి ఏమైపోయారు? మనతో ఎన్ని కబుర్లు చెప్పి ఆశలు, ఆశయాలు వినిపించి, అవన్నీ అలా మధ్యలో అర్థాంతరంగా వదిలేసి వెళ్ళిపోతున్నారు? మృత్యువు ఇంత అనివార్యమా?

రాజేశ్వరి కవితలన్నీ అందంగా పుస్తకం తేవాలనుకున్నామే. ఆ మాట చెప్తె వణికేగొంతులో ఒక్కొక్క అక్షరాన్నీ విడివిడిగా వొత్తి పలుకుతూ 'అంత డబ్బు ఎక్కడొస్తుంది లక్ష్మీ!' అంది. 'అదంతా నీకెందుకు కవితలు పంపమ్మా' అంటే 'చాలా థాంక్స్ లక్ష్మీ' అంటూ ముందుగానే కృతజ్ఞతలు ఇచ్చేసి, కవిత్వం మాత్రం ఇవ్వకుండా వెళ్ళిపోయింది.

రాజేశ్వరి భావుకురాలు. ఆలోచనలో, వ్యక్తీకరణలో నవ నవోన్మేషంగా ఉండేది. అంతరంగంలో దిగులుని ఆస్వాదిస్తూ ఉండేది. ఒంటి ద్వీపానికి మహరాణిలా విలసిల్లేది. ఎప్పుడో అర్థరాత్రి దాటాక పడుకుని పొద్దెక్కేక లేచే స్వేచ్ఛ ఆమెది.

అర్థరాత్రే ఆమె మిత్రులతో సంభాషించేది. ఎక్కడో మొదలు పెట్టి గొలుసు కట్టులాగ మాటల ప్రవాహంలో తేలుతూ నన్నూ లాక్కుపోయేది. నేను ఊ కొడుతూ, ఆ గొలుసుకి అంతమంటూ ఉంటుందా అనుకుంటూ... 'ఇక ఉండనా మరి! పడుకోండి' అనేదాన్ని. ఆమెకి ఎంత మర్యాదో. వెంటనే అర్థంచేసుకునేది. కానీ ఎప్పుడూ మాటల చివరి వాక్యం మాత్రం. 'మా తమ్ముడికి పెళ్లి చెయ్యాలి మంచి అమ్మాయిని చూసి పెట్టరా' అని ఆర్తిగా అడిగేది. నాకేం చేతనవును? అయినా ఆమె తృప్తి కోసం 'సరే' అనేదాన్ని.

నా సెల్‌ఫోన్‌లో శివలెంక రాజేశ్వరి నెంబరు ఉంది. కానీ ఇప్పుడు ఆ నెంబరు పలకదు. ఈ మాట ఆమెకే చెప్పాలనిపిస్తోంది –ఎలా నీతో మాట్లాడడం? అని. ఆమె కవిత్వ పుస్తకం ప్రింట్

చేసి ఇస్మాయిల్ అవార్డు ఇచ్చి సర్‌ప్రైజ్ చెయ్యాలనుకున్నాను. మనుషులు మనల్ని వదిలి ఎంత దూరం వెళ్లిపోగలరు? బహుశా ఆమెకు ఇదేదీ అవసరం లేదనకుంటాను. నేను 'నీ కవితలు పంపు' అనగానే 'నీ ఆరోగ్యం ఎలా ఉంది ఇప్పుడు నీరసం తగ్గిందా' అనేది అందుకేనేమో!

దాదాపు ముప్పయి ఏళ్ల కిందట అనుకుంటాను. నా కాలేజ్ అడ్రస్‌కి బరువైన ఎన్వలప్ కవరు. పరిచయంలేని దస్తూరితో నా అడ్రస్. తెరిచి చూస్తే నోట్ బుక్ లోంచి చింపిన రూళ్లకాయితాల మీద గొప్ప ప్రేమలేఖ. భావుకతా వర్షంతో తడిసిన దయా పారావతాల లాంటి అక్షరాలు. ముచ్చటైన వంకర టింకరతో అందులోనే ఒక పొందిక పాటిస్తూ అక్షర సుమాలు.

రాజేశ్వరి నాకూ, చిన వీరభద్రుడికి రాసిన రెండు ఉత్తరాలు. ఎవరీ 'దేవి' అని తహతహలాడాం. అప్పటికి ఇంతగా మాట్లాడుకునే అసౌకర్యాలు లేవు. ఉన్నదున్నట్టు హృదయం విప్పి చెప్పుకునే వీలుగా లేఖలు, అలా అటూ ఇటూ నడిచేవి.

ఉన్నట్టుండి ఒకనాటి ఉదయం మేం ఇంకా కాఫీలు తాగే లోపే చిన్న బేగ్‌తో ఆ రసధుని మా తలుపు తట్టింది. చిన వీరభద్రుడు అప్పటికి మలేరియా జ్వరంతో ఇబ్బంది పడుతూ నెల రోజులుగా కాకినాడలో మా ఇంట్లో ఉన్నాడు. అందుకోసమే ఆమె రాత్రంతా బస్‌లో ప్రయాణించి ఉదయం మా ముంగిట్లో వాలింది.

సరిగ్గా నామాడి శ్రీధర్ చెప్పినట్టే ఉంది– 'ఓ తెల్లని పారదర్శకమైన గాజుబొమ్మల్లె, తాకగానే చిట్లిపోతుందేమో అన్నంత సున్నితంగా'.

రాజేశ్వరిది అపురూపమైన స్త్రీత్వం. ఎన్నదగిన మానవత్వం పోలికలేని కవితాత్మకత్వం. ఆమె రెండు రోజుల్లో మరణిస్తుందనగా 'మా ఆఫీసుకు అందిన కవిత' అంటూ ఆంధ్రభూమిలో ఆమెకు నివాళి ఇస్తూ కవిత వేసారు. రాజేశ్వరి దేవి ఏమిటో? ఆమె జీవనసారం ఏమిటో ఆ కవిత చెప్తోంది. 'అదో చెప్పలేని ప్రశాంతత నన్ను ఆవరించి ఉందని, ఈ రాసిన అక్షరాలు సరస్వతీదేవి పదాల మీద పోస్తున్నానని' ఇంకా ఇంకా ఏదేదో ఉంది అందులో.

చివరి రోజుల్లో ఆమె ఎవరితోనూ మాటాడినట్లు లేదు. నాకు కూడా అప్పటికి ఆమె మాట విని నెలరోజులు దాటిపోయింది. ఈ కవితా వాక్యాలే ఆమె చివరి మాటలు. నిజానికి ఆమె ఆ మాటలతోనే మన అందరి వద్దా సెలవు తీసుకుందేమో అనిపించింది. ఈ ఒంటరితనం



భారంగా లేదు. తేలిగ్గా ఉంది. బెంగలోనే ఏదో ఊరట కనుగొన్నాను– అన్నట్టుగా మన అందరికీ చెప్పి మనని ఓదార్చి వెళ్లిపోయినట్టుయింది.

'లక్ష్మీ నీ కథల్లో భావుకత తాత్వికత కలగలిసి ఉంటాయి' అని నన్ను ప్రశంసించే రాజేశ్వరికి నా కథల పుస్తకం అందించ లేకపోయాను. పనులు వాయిదా వేసేవారు ఇంతంత కఠిన శిక్షలకు గురికాక తప్పదని మరోసారి ఋజువయింది.

'ఇంట్లో చిన్న చిన్న పనులు చెయ్యండి. కుక్కర్ పెట్టడం నేర్చుకోండి. ఏక్టివ్‌గా ఉంటుంది. దిగులుగా ఉండకండి' అని చెప్పేను అవివేకంగా, నెమలిని కూరలు తరగమని, కోకిలను ఇల్లు ఊడ్వమని చెప్పినట్టు. పాపం, 'అలాగే అలాగే' అంది. కానీ ఈమె ఈ లోకపు మనిషి కాదు. ఆ రహస్యాన్ని మిత్రులందరికి అనుభవానికి తెస్తూ మలయ మారుతమై వెళ్లిపోయింది, పూల పరిమళం లాంటి తన ఆత్మ సౌందర్యాన్ని మోసుకుంటూ ఒకవైపు. మరొకవైపు ఆమె వెళ్లిపోలేదు. ఇక్కడే... ఆమె వదిలి వెళ్లిన అక్షరాల్లో, కవితా వసంతసేనగా మన జ్ఞాపకాలలో పదిలంగా పలవరింతగా మిగిలే ఉంది.

వాడ్రేవు వీర లక్ష్మీదేవి

## ఏకాంత ఐకాంతిక

శివలెంక రాజేశ్వరీదేవి. జన్మత: ఓ అద్భుతమైన కవిత. మనమధ్యన ఒంటరిగా జీవించిన అమాయక బాలిక. శరత్, చలం, చండీదాస్ రచనల్లోంచి రెక్కలు కట్టుకువచ్చిన దయాళువైన వనిత. ఎల్లల్లేని స్వేచ్ఛలోకి అశ్రుబిందువై హరించుకపోయిన ముక్త.

ఆమెది జననంతో ప్రాప్తించిన ఏకాకితనం. దివాస్వప్నం లో కరిగిన యవ్వనం. ప్రత్యుత్తరం లేని ప్రేమలేఖనం. పీటలమీద ఆగిపోయిన కళ్యాణం. ఒక్క గదిలో కొనసాగిన ప్రపంచయానం. సాహిత్యం, సంగీతం తోడునీడలుగా తనలో తాను మాట్లాడుకొన్న శూన్యావరణం. ఎదురెదురుపడే నిరాదరణంతో తలపడే దినదినం. ఏ ఒక్క సంతోషరేణువునో గుప్పెట బంధించాలన్న జాగరణం. ఆ అరవయ్యేళ్ల నిష్ఫలపరంపరకు ముగింపుగా ఆఖరికి ఆదరించినది మరణం.

– నామాడి శ్రీధర్

## ద్వైతం

నేనసలే గంగను కదా
నాకు పర్వతమూ ఇష్టమే పొలమూ ఇష్టమే
గండశిలల్నించి కరిగి కిందికొచ్చినందుకే
ఈ మునిగిపోయిన పేదపల్లెల కన్నీళ్లు ఇష్టం.
రాళ్లు పగిలితేనే గానీ కన్ను చెమ్మగిలదు
మీరేదో అనుకుంటారు ఆ గుండె ఆగాధమని
కానీ ఎంతనొప్పో ప్రథమ శిశువుకి పాలు తాపేప్పుడు
ఆ తీయని బాధలో మృత్యువుని జయించిన లోయలకేక
కాశీ వారణాసి బెనారస్‌లో చూడండి నన్ను
నా దేహంమీద కాలీకాలని ఎన్ని కళేబరాలో
కానీ ప్రేమ హర్మ్యాల్లోంచి మీరంతా రిక్తహస్తాలతోనే కదా
ఈ నా పుణ్యక్షేత్రానికి చేరుకునేది!
కేదారనాథ్ బదరీనాథ్ అమరనాథ్ అన్నీ నేనే
ఏనాటి వాడో ఆదిశంకరాచార్యుడ్ని తల్చుకుని
మీ పాపాల చేతుల్నీ పాదాల్నీ కడిగేసుకుంటున్నామనుకుంటున్నారో
కానీ అదంతా హిమాలయాలపైకి మీ ఒట్టి ఎగశ్వాస, దిగశ్వాస
ఎండమావినీ నేనే, తొలకరి మబ్బునీ నేనే
కలకత్తా కాళికనీ నేనే, సలాం బాంబేనీ నేనే
మదర్ థెరిసానీ నేనే, 'బీస్ట్ అండ్ బ్యూటీ'ని నేనే
పుట్టిన కేకనీ నేనే, ఆఖరి కౌగిలినీ నేనే.

(కవిత్వం ప్రచురణలు– 'గురిచూసి పాడేపాట' 1990 పుస్తకం నుంచి)

# అభిరుచి గల నిర్మాత డూండీ

ఆయన దక్షతగల నిర్మాత!
కఠినంగా శాసించినా, సహృదయుడు!
ఆలస్యంగా వస్తోందని నటీమణిని ఇంటికి వెళ్లమన్నారు.
సిగరెట్లు ఇవ్వలేదని అలిగి యూనిట్‌కి రాని విలన్ పాత్రధారికి తగిన పాఠం చెప్పిన నిర్మాత!

ఆయన పేరు డూండీశ్వరరావు. 'డూండీ' అనడం పరిపాటి. కాశీక్షేత్రంలో డుండి గణపతి - ఆలయం వుంది. ఆ గణపతి పేరునే 'డుండి'గా, ఆయన తలిదండ్రులు నామకరణం చేస్తే ఇంగ్లీషు అక్షరాల మూలంగా అది 'డూండీ' అయింది. శ్రీ ఫిలిమ్స్, రాజలక్ష్మి, రాజశ్రీ సంస్థల పేరిట నిర్మించిన శభాష్ రాముడు, శాంతి నివాసం, అభిమానం, శభాష్ రాజా, ఖైదీ కన్నయ్య, రక్త సంబంధం, బందిపోటు, గుడిగంటలు, వీరాభిమన్యు, గూఢచారి 116, నేనంటేనేనే, ఆస్తులు-అంతస్తులు మొదలైన ఎన్నెన్నో చిత్రాలకు నిర్మాతలు సుందర్ లాల్ నహతా, డూండీ. సుందర్‌లాల్ మొత్తం నిర్మాణ బాధ్యత అంతా డూండీగారికే అప్పజెప్పారు. కథ నుంచి నిర్మాణ వ్యవహారాలన్నీ డూండీగారివే. ఆంధ్రదేశంలో తొలి పెర్మనెంట్ సినిమా థియేటర్ (మారుతి సినిమా, 1921), బెజవాడ నిర్మించిన పోతిన శ్రీనివాసరావుగారి కుమారుడు డూండి. శ్రీనివాసరావుగారి కుమారు లందరికీ సినిమాలతో ప్రమేయం ఉంది. చిత్ర పరిశ్రమ, నిర్మాణ వ్యవహారాలన్నీ క్షుణంగా పరిశీలించి విశ్లేషణ చేస్తున్న డూండిగారి మీద నమ్మకం కుదిరి సుందర్‌లాల్ నిర్మాణ బాధ్యత అప్ప చెప్పి, తన పేరుతోపాటు ఆయన పేరుకూడా కలిపారు.

తొలిసారిగా డబ్బింగ్ సినిమా చేస్తే అది విజయం సాధించింది. తర్వాత చిత్ర నిర్మాణంలో ప్రవేశించి, ఎన్నో సినిమాలు తీశారు. డూండిగారి పథకాలు గొప్పవి. అందర్నీ అభిమానంతో చూసేవారు. కానీ, తప్పుగా ప్రవర్తిస్తే మాత్రం తీవ్రమైన చర్య తీసుకునేవారు. 'వీరాభిమన్యు' (1965) షూటింగ్‌లో ఎస్. వరలక్ష్మి రోజూ ఆలస్యంగా సెట్టుకి వచ్చేవారు. 2, 3 రోజులు చూసి, డూండిగారు ఫ్లోర్ గుమ్మందగ్గర నించుని ఆమె రాగానే - 'రావద్దమ్మా. మీరు అలా వెనక్కి తిరిగి ఇంటికి వెళ్లిపోండి. 9 గంటల కాల్‌షీటుకి రోజూ 11కి వస్తే ఏంకావాలి మేం? పైగా ఎన్‌టి. రామారావుగారు వచ్చేసి నిరీక్షిస్తున్నారు. మీరు అడిగిన డబ్బు ఇవ్వడం లేదా? సదుపాయాలు చెయ్యడంలేదా? మీకు మీ సొంత మేకప్‌మెన్ వున్నాడు, కాస్ట్యూమర్‌ని ఇచ్చాం. ఎందుకింత ఆలస్యం? నో... వెళ్లండి' అని తీవ్రంగా - అంటే గట్టిగా అరవకుండానే, అనేసరికి, అందరూ ఆశ్చర్యపోయారు. వరలక్ష్మి భయపడిపోయింది. ఇంకెన్నడూ ఇలా చెయ్యనని క్షమాపణ చెప్పిన తర్వాత, ఆమెను రానిచ్చారు డూండి. పని ఆగకూడదు! పని మీద అందరూ శ్రద్ధపెట్టాలి, నిక్కచ్చిగా వుండాలి! అదీ ఆయన విధానం.

ఆ రోజుల్లో నటులు, టెక్నీషియన్లు దాదాపు అందరూ సిగరెట్లు కాల్చేవారు. అందరికీ వారి వారి బ్రాండ్ సిగరెట్ పెట్టెలు, అగ్గిపెట్టెలూ తెప్పించి ఇచ్చేవి కొన్ని కంపెనీలు.

ఈ కంపెనీ కూడా ఇచ్చేది - మర్యాద కోసం. ఒక సినిమాకి- రాజనాల ఎంతకీ సెట్టుకి రాలేదు. 'ఏం?' అని అడిగారు డూండి. 'సిగరెట్ పాకెట్ ఇంకా ఇవ్వలేదు. అలిగి రావడం లేదు' అన్నారు నిర్మాణ సహాయకులు. 'సిగరెట్లు ఇవ్వాలని రూలా? దానికోసం గంటలపాటు షూటింగ్ ఆలస్యం చేస్తే ఎంత నష్టం?... సిగరెట్లు ఇవ్వం. వస్తాడా, రాడా అడగండి' అనగానే, ఆ మాట విన్న రాజనాల పరుగున సెట్టుకి వచ్చాడు. 'ఇవాల్టినుంచి, ఈ కంపెనీ ఎవరికీ సిగరెట్లు ఇవ్వదు' అని తీర్మానించారు డూండీ.

సినిమా నిర్మాణ వ్యయం అధికమైపోతోందని - ఒకే షెడ్యూల్‌లో సినిమా ముగిస్తే లాభం ముందే కనిపిస్తుందని - 'శాంతి నివాసం' (1960) అలా


నిర్మాత డూండీ

పథకం వేసి, నెలరోజుల్లో తీశారు డూండి. అప్పట్లో షెడ్యూల్స్ ఉండేవి. ఒక నెలలో 10, 15 రోజులు మాత్రమే షూటింగు మిగతా రోజులు ఖాళీగా కూచోవడంవల్లని నిర్మాణ వ్యయం (జీతాలు, ఆఫీసు ఖర్చులు) అధికమయ్యేది. అది తగ్గించవచ్చునని, స్క్రిప్టు పూర్తి చేసుకుని, రెండు మూడు సెట్లు నిర్మించి, నటుల దగ్గర కచ్చితమైన డేట్స్ తీసుకుని - చకచకా నిర్మించారు 'శాంతి నివాసం', ఈ సినిమా ఘన విజయం సాధించింది.

డూండిగారు ప్రతిభని ప్రోత్సహించేవారు. ముళ్లపూడి వెంకటరమణ గారిలో నైపుణ్యం చూసి, రచయితగా సినిమాకి ఆహ్వానించింది ఆయనే! 'మీ ఆలోచనలు, సినిమా సమీక్షలూ చదివి చూస్తే మీరు, మంచి సినిమా రచయిత కూడా కాగలరని అనిపిస్తుందన్నారు. మీరు సరేనంటే మా సినిమాకి మిమ్మల్ని రచయితగా ఆహ్వానిస్తున్నాను' అన్నారు రమణగారితో డూండిగారు. అదే రమణగారి తొలి 'అసైన్‌మెంట్' 'రక్త సంబంధం' (1962). ఇది తమిళ సినిమాకి అనుకరణ. తర్వాత రమణగారి కథ, మాటలతో తీసిన సినిమా 'దాగుడు మూతలు'.

డూండిగారు ఒకసారి ఒకరితో పరిచయం ఏర్పడితే, వదిలిపెట్టరు. రమణగారే నన్ను డూండిగారికి పరిచయం చేశారు. ఆ పరిచయం వల్లేనే నాకు 'వీరాభిమన్యు'లో ద్రోణాచార్యుడి పాత్ర లభించింది. నా ప్రవర్తన, నా శ్రద్ధ చూసి డూండిగారు తన సినిమాల్లో ప్రోత్సహించారు. ఆయన హిందీలో కూడా చిత్రాలు నిర్మించారు. ఒకటి రెండు డైరెక్ట్ చేశారు. డూండిగారు బొంబాయిలో బిజీగా వున్నప్పుడు, తన తమ్ముడు బాబాజీకి నిర్మాణం అప్పజెప్పారు. తను నిర్మించిన చిత్రం డూండీగారు బొంబాయి నుంచి రాగానే చూపించారు. నాతో బాబాజీగారు చెప్పినది. 'సినిమా అంతా చూసి, ఎలా వుందో చెప్పక, మా అన్నయ్య 'రావి కొండలరావు ఎక్కడ కనిపించలేదే' అన్నాడు! మీరంటే అంత అభిమానం.'

వారి సంస్థలో పనిచేసే వారెవరూ పారితోషికాలు అడగనవసరంలేదు. సమయానికల్లా వచ్చేసేవి. డూండిగారిది నిర్వహణ సామర్థ్యాన్ని అందరూ శ్లాఘించేవారు. తెలుగులో 'అభిమానవతి' అనే చిత్రాన్ని డూండీగారే డైరెక్టు చేశారు. ఎన్ని సినిమాలు తీసినా, ఆయనకి గర్వం అనేది వుండేది కాదు. ఎప్పుడూ చిరునవ్వే. చిరునవ్వుతోనే ఎవరినైనా మందలించేవారు. ప్రతి వారూ ఆయనను గౌరవించేవారు.

'మరపురాని కథ'ని హిందీలో నిర్మించారు డూండి. షూటింగ్ మద్రాసులోనే జరిగింది. అమితాబచ్చన్ హీరో (తెలుగులో కృష్ణ, తమిళంలో శివాజిగణేశన్). అమితాబచ్చన్ చాలా సన్నగా, కోలమొహంతో వుంటే, అందరూ అన్నారు - 'ఇతనేం బాగుంటాడు హీరోకి?' అని. 'చూస్తూవుండండి అతను ఎంత గొప్ప నటుడనిపించుకుంటాడో' అనేవారు డూండి. అలాగే అమితాబ్ దేశం గర్వించదగ్గ నటుడయినాడు. 'గూఢచారి 116' చిత్రంతోనే కృష్ణకి 'స్టార్ డమ్' వచ్చింది. రవికాంత్ నగాయిచ్‌ని దర్శకుడిని చేసిందీ ఆయనే. 'మహాబలుడు' సినిమా నిండా ట్రిక్స్ వున్నాయని, ఆ సినిమాని ఆయనకి అప్పజెప్పి, దర్శకత్వం కూడా ఇచ్చారు. అది, మధు పిక్చర్స్ వారిది, ఆ సంస్థ నిర్మాత మల్లికార్జునరావుగారు డూండిగారి సలహాలు తీసుకునేవారు.

పరిశ్రమలో అందరికీ తలలోని నాలుకగా మెలగిన డూండీశ్వరరావుగారు, సినిమా నిర్మాణ పరిస్థితులు అనుకూలించక మానుకున్నారు. విజయవాడ వెళ్లిపోయారు. కానీ, కళాత్మక దృష్టిపోక, పద్మాలయ స్టూడియో చేస్తున్న యానిమేషన్ చిత్రాలు పర్యవేక్షించడానికి హైదరాబాదు వచ్చి కొన్నాళ్లున్నారు. ఆ సమయంలోనే కలుసుకున్నపుడు - 'సినిమాలు సక్రమంగా శ్రద్ధగా తీసే రోజులు పోయాయి. ఈ నాటి నటులు, టెక్నీషియన్లతో నాలాంటివాడు సినిమాలు తియ్యలేడు. ఊరికే కూచోడం ఎందుకని, కృష్ణ పిలిస్తే హైదరాబాద్ వచ్చి, ఈ కార్టూన్ చిత్రాల్ని పర్యవేక్షిస్తున్నాను. సృజనాత్మకంగా చెయ్యడానికి ఏమీలేదు - ఏదో కాలక్షేపం' అని చెప్పారు. ఆరోగ్యం బాగులేక, మళ్లీ విజయవాడ వెళ్లిపోయి, అక్కడ తనువు చాలించారు డూండి.


రావి కొండలరావు

❖

# చెక్కిలి గీత

– మోహన్



నిన్న సాయంత్రం ప్రెస్‌క్లబ్ మీటింగ్ తర్వాత విచిత్రం జరిగింది. 'గుడ్ బై వెళ్దామా' అని ఊరుకోక సీత షేక్‌హేండ్ ఇచ్చి నా చెయ్యి గిల్లింది
స్వయంగా చలన యంత్రం కాని నిన్ను ఈ బాహిర్‌ప్రేరణ ఒక అంతర్‌దహనయంత్రంగా మార్చే విన్నూత్న పరిణామానికి సీత గిల్లడం ఒక నాందీవాచకం పలికింది.




ఏమో మరి. రాత్రంతా నిద్ర పట్టలేదు. ముందు షాక్. తర్వాత థ్రిల్. మొట్టమొదటి సారిగా కవిత్వం రాద్దామనిపించింది.
తక్షణ మానసిక, భౌతిక ఆకాంక్షలు, ప్రేరణల, అభివ్యక్తీకరణకు నీ భావోద్వేగ ప్రకటనకూ తగిన సమయం ఆసన్నమౌతోంది. ఇంటర్‌ప్రిటేషన్ ఆఫ్ డ్రీమ్స్ చదివావా? ఫ్రాంక్‌ఫర్ట్ స్కూల్ ఎరిక్‌ఫ్రామ్ రాసిన 'ఆర్ట్ ఆఫ్ మేకింగ్ లవ్' చూశావా?




ఏమో, తెలీదు. నాకలా అనిపించింది, చెప్పాను.
తక్షణం నువ్వు కవిత్వం రాయాలి. అయితే అది అనేకానేక అస్తిత్వాల అచారిత్రక భాష్యాల సర్ప పరిష్వంగాల నుంచి విముక్తం కావాలి. పలు ఉప అస్తిత్వ ప్రజాశ్రేణుల సరికొత్త స్వతంత్ర ఆచరణని ప్రతిబింబించినప్పుడే అది నీలోని సామూహిక కైవారాలను చీల్చుకు వచ్చిన నీదైన స్వచ్ఛమైన ప్రేమ కవిత కాగలుగుతుంది.




బొత్తిగా అర్థం కాలేదు. ఇంత ఆలోచిస్తే అసలు ఒక్క లైను కూడా రాదేమో.
వస్తుంది. అప్రధానీకృతమైన జనశ్రేణులలో అంతర్భాగమైన నీ సాంస్కృతిక స్వీయ ప్రకటనకిది తగిన సమయం. చక్కని వేదిక. అయితే, ఆర్థర్ కాటనోద్యమమూ, హేయమూ, నదీయమూ, కాలవగట్టీయమూ, చెట్టీయమూనైన వలసవాద భావజాల విషదంష్ట్రల నుంచి నీ కవిత స్వేచ్ఛావిహంగమై ఎగరాలి...




...నీ గతిశీలతను నువ్వే గుర్తెరిగి మార్గపద్ధతినీ, మార్గకవులనూ విస్మరించి, సాంద్ర విప్లవ కవితను అధిగమించి దేశీమార్గంలో పురోగమించి నీ చారిత్రక సాంస్కృతిక అస్తిత్వాన్ని ప్రకటించాలి.




సీత గిల్లిందంటే నువ్వు నరుక్కుని నంచుకు తింటున్నావుగా, కవితకో దణ్ణం... కథ రాసుకుంటా.
కథ అంటే వేరే కథ. అందులో మహా అస్తిత్వాల విచ్ఛిత్తి, తదనంతర చిన్న అస్తిత్వాల ప్రాతినిధ్య పోరాటాల నేపథ్యంలో నేటి గ్లోబలైజేషన్ ప్రక్రియను, చరిత్రనూ...




క్షమించు బాస్. నీ కోస్తా అగ్రహార బ్రాహ్మల అగ్రవర్ణ భాషా తెలంగాణా భావాలు నాకీ జన్మకి అర్థం కావు.
...క్రానిక్‌గా కానీ, అనక్రానిక్‌గా గానీ చిత్రీకరించి, వ్యక్తీకరించాలి. విస్మృత, తిరస్కృత స్పృహలను భౌగోళిక, కుల, మత, మాండలీకాలతో వెలిగించి, ఉద్వేషించి, ప్రేరేపించి...




...రాయలసీమోణ్ని అప్పా. వద్దు, కవితా రాయనూ కథా రాయను. సీత నాకు వద్దనే వద్దు.

# జీవన మార్గం



చతురోక్తి, లోకజ్ఞత, సద్య స్ఫురణ, బోధ, సూచన, హెచ్చరిక, స్పష్టత, తాత్విక చింతన, స్వీయానుభవం, హాసం, హాస్యం, అలతి మాటలలో అనల్పభావన, వాత్సల్యం, వద్దుకున్న నిత్య స్మరణీయ, నిరంతర మననీయ భావసంపద, మానవీయ దృష్టి.... కలబోసుకున్న పదరమ్యత మనిషి వాక్కు కావాలి.

వస్తువు పోయిందనుకుని వెదకటం ప్రారంభిస్తాం. దొరకక విసుగు చెందుతాం. వస్తువు దొరకగానే, దొరికిందని సంబరపడతాం. ఇంతకీ పోయింది వస్తువా? అది ఎక్కడున్నదో అక్కడే ఉంది. జారిపోయింది మన జ్ఞాపకమే.

కాకులు, కుక్కలు, కోతులు, అంతెందుకు సమస్త జంతువులూ సాధనలో ఉన్నవే. ఆ సాధనంతా మానవ జన్మ కోసమే. దాని ద్వారా దైవదర్శనం కోసం. విచిత్రమేమంటే మానవ జన్మ పొందిన తర్వాత భగవంతుణ్ణి నమ్మటం మానేస్తాం.

ఇంటి ముంగిట రంగువల్లులు తీర్చిదిద్దటంలో ఒక కళ ఉన్నది. ముగ్గువేయటం ప్రజ్ఞ. అది వేసినవారికి తృప్తినీ, చూస్తున్నవారికీ కనువిందునీ కలిగిస్తుంది. అసలు విషయం అది కాదు. బియ్యపు పిండిలో వేసే ముగ్గు క్రిమికీటకాదులకు ఆహారం. అంటే నిద్రలేస్తూనే నారాయణ సేవ ప్రారంభమన్నమాట.

ఎవరో దోచుకు వెళ్లారనీ, వారు దొంగలేనని ఎందుకు బాధపడటం? ఇన్నాళ్లు వస్తువులను మన దగ్గర ఉండనిచ్చినందుకు ఆనందంగా ఉండాలి. మన ఆస్తి అనుకుంటున్న మన దేహాన్ని, మనని దొంగిలించుకుని యముడు వెళ్తుంటే ఎప్పుడైనా, ఎవరికైనా ఫిర్యాదు చేశామా? ఇన్నాళ్లుంచినందుకు ఇప్పటికైనా తీసుకువెళ్లినందుకు ఆయనకు కృతజ్ఞతలు! ఎవరూ దొంగిలించలేని ఆత్మే మనం కదా?

అందరూ మనకు నమస్కరిస్తున్నారంటే, వారికి మన నమస్కారాలు ముందే అందినయ్యన్న మాట.

గ్రహస్థితులన్నిటినీ దాటి, భగవదనుగ్రహాన్ని మిగుల్చుకున్న జ్ఞానికి రాబట్టుకోవటం, పోగొట్టుకోవటమంటూ ఏమీ లేదు. ఉండటమే ఉన్న స్థితి.

అక్షరజ్ఞాన మెరుగనివాడు. మతిస్థిమితం లేనివాడు, ఏమీ తోచనివాడు, ఏవేవో చేస్తుంటాడు. ఎందుకు చేస్తున్నావని అడిగితే 'ఏమీ లేదు' అంటాడు. 'ఏమీ లేదు' అనుకోవటమే తెలిసినతనం.

శరీరం స్వస్థత కోల్పోయినప్పుడు, నడవలేని స్థితి ఏర్పడినప్పుడు, కర్ర ఆధారంతో నడుస్తాం. అంటే కట్టెకు, కట్టె ఆధారమన్నమాట. ఇంతకీ ఈ రెండు కట్టెలనూ నడిపిస్తున్న మూలశక్తి సంగతేమిటి?

అందరం విగ్రహారాధకులమే. శరీరవ విగ్రహమే. మనం దానికి స్నానం చేస్తున్నాం, బట్టలు తొడుగుతున్నాం. అలంకారం ఎందుకు చేస్తున్నాం? అవసరం కనుక, ఆనందాన్నిస్తుంది కనుక! విగ్రహారాధన అంతే! విగ్రహాన్ని రాంగా భావిస్తున్నవారు, ఎప్పుడైనా తమ దేహాన్ని తోలుబొమ్మ అనుకోగలిగారా?

అచ్చుకాక ముందున్నది కాగితమే. అద్దిన తర్వాత అక్షరాలు కనపడుతున్నాయి. అంతే! కాగితం ఎక్కడికి పోయింది? కనపడుతున్న దేహంలో వున్నదీ, మూలశక్తే!

దొంగలకు దొంగతనం వృత్తి. దొంగతనానికి బయలుదేరే వందు, వస్తువులు దొరకాలని, తామెవరికీ దొరక కూడదని దేవుడికి మ్రెక్కుకుని, దొరికినదానిలో కొంత దేవుడికి ఇస్తామంటారు. ఇస్తారు కూడా. కానీ దొరలుగా చెలామణి అయ్యేవారు దొరికినది దోచుకుంటారు. మ్రొక్కుతారు. కానీ మ్రొక్కుచెల్లించరు.

దైవాన్నైనా సరే అడగటం దీనత్వం కదా!

నది మధ్యలో ఉండి, దాహం దాహం అంటూ కేకలు వేయటం ఎంత అవివేకం! ఉన్నదంతా అనుగ్రహమే అయినప్పుడు మళ్లీ మళ్లీ అడగటం అవసరమా?

మనిషి మరణించినప్పుడు పోయినాడంటున్నారు. ఎక్కడికి వెళ్లాడనుకుంటున్నారంటే, జవాబు లేదు. వాడు వచ్చిందీ లేదు. ఎక్కడికో వెళ్లిందీ లేదు. ఉండటమే నిజం. అదొక స్థితి, అంతే!

పండితులకు శాస్త్రాలు అక్కరలేదు. పామరులకు అవి అర్థం కావు. అవి తెలుసుకోవాలనుకునేవారికి ఆసక్తిని తీరుస్తయ్. అంతే! ఆచరణకు నోచని శాస్త్రాలు ఎవరికి అక్కరకొస్తాయ్? శాస్త్రమంటే జ్ఞాపకమే!

వెలుగుకి చీకటికి అతీతమైనది బ్రహ్మవ. మనమనుకుంటే అవి ఉన్నయ్. గమనించటం ఆపేస్తే మన వరకు అవి లేవు. ఉన్నది బ్రహ్మమే.

సంయమనవన్న వాడే సమన్వయం చేయగలడు. సంఘర్షణ అంటే సమన్వయం లేకపోవటమే.

కూచున్నవాణ్ణి తానే తీసుకువెళ్తున్నట్లు పల్లకీని మోస్తున్న బోయీ, తెరచాప కొయ్య మీద వాలిన పక్షి. తామే పడవను నడిపిస్తున్నాం అంటూ ఎంతగా భ్రమపడుతుంటయ్యో. మానవుడు కూడా అన్నీ తానే చేస్తూన్నట్లు అహంకరిస్తుంటాడు. మోస్తున్న బోయీలు, పడవ నడుపుతున్న సరంగులు, చేస్తున్నాననుకుంటున్నవాడు గమనించవలసినదొక్కటే! చేయిస్తున్న వాడు ఒకడున్నాడని!

దుఃఖాన్ని ఇతరులకు పంచితే, అది సగం అవుతుంది.

సంతోషాన్ని ఇతరులకు పంచితే, అది పదింతలు అవుతుంది.

జీవన మార్గంలో మన ఆలోచనే మన నడకని వేగవంతం చేస్తుంది.

– వి.యస్.ఆర్. మూర్తి
ఆధ్యాత్మిక శాస్త్రవేత్త




## ఇక చార్జింగ్ మాటే మరవండి!

ఇ-తరంలో చాలా మందిని కొండల్ని పిండి చేయమన్నా 'సై' అంటారు గానీ, మొబైల్ ఫోన్ చార్జింగ్ పెట్టడమంటే మాత్రం చికాకు పడిపోతుంటారు. వీళ్ల అసహనానికి తోడుబోయినట్టే చాలా సెల్ ఫోన్లు కూడా మాటిమాటికీ చార్జింగ్ తగ్గి నిద్రలో జోగుతుంటాయి. ఈ సమస్యకి పరిష్కారంగా అన్నట్టు, రెండు రోజులు ఏకబిగిన చార్జింగ్ ఉండేలా సెల్‌కాన్ కంపెనీ రెండు సరికొత్త స్మార్ట్ మొబైళ్లను మార్కెట్‌లోకి ప్రవేశపెట్టింది. అవి Millennium Power Q3000, Millennium Elite Q470వీటిలో మొదటి మోడల్ ప్రత్యేకత ఏంటో తెలుసా? బ్యాటరీ బ్యాక్అప్. సామర్థ్యం 3000 mAh. ఒక్కసారి ఛార్జ్ చేస్తే రెండు రోజుల పాటు ఫోన్ మాట్లాడడమే కాదు, నిరంతరాయంగా అప్లికేషన్స్ కూడా వాడుకోవచ్చు. ధర కూడా కాస్త తక్కువే. రెండు మోడళ్లు కిట్‌క్యాట్ ఓఎస్‌తోనే పని చేస్తాయి. ఇక మొదటి మోడల్ కాన్ఫిగరేషన్ విషయానికొస్తే... తాకే తెర పరిమాణం 5 అంగుళాలు. రిజల్యూషన్ 854X480 పిక్సల్స్. 1.3Ghz Quad Coreప్రాసెసర్‌ని వాడారు. డ్యూయల్ కెమెరాలు ఉన్నాయి. వెనక ఆటో ఫోకస్‌తో 8 మెగాపిక్సల్ కెమెరా ఉంది. ముందు వీడియో ఛాటింగ్‌కి 1.3 మెగాపిక్సల్ కెమెరాని ఏర్పాటు చేశారు. ర్యామ్ 1 జీబీ. ఇంటర్నల్ మెమొరీ 4 జీబీ. మెమొరా సామర్థ్యాన్ని 32 జీబీ వరకూ పెంచుకోవచ్చు. డ్యూయల్ సిమ్‌లతో ఫోన్ని వాడుకోవచ్చు. ధర రూ. 8,999.

ఇక రెండో మోడల్ ఎలైట్ క్యూ470 విషయానికొస్తే... తాకేతెర పరిమాణం 4.7 అంగుళాలు. రిజల్యూషన్ 720X1280 పిక్సల్స్. ర్యామ్ 1 జీబీ. ఇంటర్నల్ మెమొరీ ఏకంగా 16 జీబీ. కావాలంటే మైక్రోఎస్‌డీ కార్డుతో 32 జీబీ వరకూ పెంచుకోవచ్చు. డ్యూయల్ కెమెరాలు ఉన్నాయి. ముందు వీడియో ఛాటింగ్‌కి 2 మెగాపిక్సల్ కెమెరాని ఏర్పాటు చేశారు. వెనక ఆటోఫోకస్, ఫ్లాష్‌లైట్‌తో 8 మెగాపిక్సల్ ప్రైమరీ కెమెరా ఉంది. బ్యాటరీ సామర్థ్యం 1800 mAh. దీని ధర రూ. 11,999. రెండు ఫోన్లకూ ఉచితంగా ఫ్లిక్ కవర్లను అందిస్తున్నారు.

## అరచేతిలో వెండితెర

చాలామంది స్మార్ట్ ఫోన్ వాడేవాళ్లకి అందులో ఫీచర్లన్నీ వాడే సమయం, ఓపిక ఉండవు. కొంత మంది అయితే, తెర (స్క్రీన్) వెడల్పుగా ఉంటే చాలు, అరచేతుల్లో మినీ వెండితెరని ఆవిష్కరించేస్తుంటారు. అటువంటి నిరంతర వీక్షణా స్రవంతికి అనుకూలంగా సెల్‌కాన్ కంపెనీ తయారు చేసి మార్కెట్లోకి వదిలిందో మోడల్. 6.95 అంగుళాల తెర పరిమాణం ఉన్న మోడల్ XION S CT695 ని ఫ్యాబ్లెట్ పేరుతో పరిచయం చేశారు. రిజల్యూషన్ 600X1024 పిక్సల్స్. డ్యూయల్ సిమ్‌లతో వాడుకోవచ్చు. ఈ స్మార్ట్ ఫోన్ ఆండ్రాయిడ్ 4.4 కిట్‌క్యాట్ ఓఎస్‌తో పని చేస్తుంది. 1.2GHz Dual core Cortex-A7 ప్రాసెసర్‌ని వాడారు. ర్యామ్ 1 జీబీ. ఇంటర్నల్ మెమొరీ 8 జీబీ. మెమొరీ సామర్థ్యాన్ని 32 జీబీ వరకూ పెంచుకోవచ్చు. డ్యూయల్ కెమెరాలు (వెనక 5 మెగాపిక్సల్, ముందు 0.3 మెగాపిక్సల్ కెమెరా) ఉన్నాయి. 3జీ, వై-ఫై నెట్‌వర్క్‌ను సపోర్ట్ చేస్తుంది. బ్యాటరీ సామర్థ్యం 2,500 mAh. నలుపు రంగులో ఫోన్ అందుబాటులో ఉన్న ధర కేవలం రూ. 7,299 మాత్రమేనని, ఇది చాలా అందుబాటు ధరేననీ చెప్పుకుంటుంది సెల్‌కాన్ కంపెనీ.





## బంబార్డియర్ బీటిల్ బరితెగింపు

భుజాన ఇంత లావు గొట్టాల మెషిన్‌గన్‌తో ఫిరంగి గుండ్లు కురిపించే టైనీ లిస్టర్ లాంటి లేదా టామ్ హార్డీ వంటి కండల వీరుడ్ని 'బంబార్డియర్' అంటారు. మనం కుమ్మరపురుగు అని పిలిచే బీటిల్ జాతిలో 'బంబార్డియర్ బీటిల్' కూడా తను ప్రమాదంలో పడ్డానని అనిపించినప్పుడు మెషిన్‌గన్ నుంచి బుల్లెట్లు కురిపించినట్టు తన వెనుకభాగం నుంచి సలసలామసిలే వేడివాయువును శత్రువుపై చిమ్ముతుంది. ఆసక్తికరమైన ఈ అంశం మీద అరిజోనా విశ్వవిద్యాలయం వ్యవసాయ కళాశాల శాస్త్రవేత్త వెండీమూర్ ఆధ్వర్యంలో ఒక శాస్త్రవేత్తల బృందం పరిశోధన జరిపింది. దాడి చేసే సమయంలో 'బంబార్డియర్ బీటిల్' పొట్టలో జరిగే మార్పులను ఆప్టికల్ మైక్రోస్కోపీ ద్వారా వెండీమూర్ పరిశీలించారు. పొట్టలోని ఒక గదిలో రసాయనాలు కలగలిసి వేడెక్కుతాయని అనంతరం అవి చాలావేగంగా బయటకి వస్తున్నాయని గుర్తించారు. ఈ క్రమంలో జరిగే చర్యలను అల్ట్రాఫాస్ట్ ఎక్సరే ఇమేజింగ్ ద్వారా పరిశీలించారు. రసాయనాలు ఒక గొట్టంద్వారా పొట్టలోని ఓ గదిలోకి వస్తున్నప్పుడు అవి ఎంజైమ్‌లతో కలుస్తాయని.. అనంతరం నీటిఆవిరితో కూడిన అత్యంత వేడి ఆక్సిజన్‌వాయువు చాలావేగంగా బయటికి చిమ్ముతుందని తెలుసుకున్నారు.




దారి కనుక్కోండి




చుక్కలు కలపండి

## చిన్నారి 'చిత్రం'




కృష్ణమనోహర్ పి
రెండవ తరగతి,
వెల్లలూరు, పొన్నూరు.



చిన్నారుల పెయింటింగ్స్‌ను apchiefeditor@gmail.com కు ఈ మెయిల్ చేస్తే ప్రచురిస్తాం.

రంగులు వేయండి



# సరైన లక్ష్యాన్ని ఎంచుకోవడమే విజయ రహస్యం

యాంత్రికంగా తమ పనేదో తాము చేసుకుపోయేవారు యధాతథ స్థితిలోనే మిగిలిపోతుంటారు. అందుకు భిన్నంగా ఎవరైనా తమ జీవితంలో ఒక లక్ష్యం ఎంచుకోగానే ఒక అద్భుతం జరిగిపోతుంది.

మన సమాజంలో అత్యధిక శాతం మంది నిరర్థకమైన, నిష్ప్రయోజక జీవితాలను గడుపుతుంటారు. అనామకంగా మిగిలిపోతుంటారు. ఇలా అనామకంగా, అజ్ఞాతంగా మిగిలిపోయేవారు ఎటువంటి ప్రతిభా లేని వారా? శక్తి సామర్థ్యాలు కొరవడిన వారా? కానేకాదు. వారిలో సంభ్రమ పరిచే ప్రతిభా వంతులు, అనేక అంశాలపై అమితమైన పరిజ్ఞానం ఉన్నవారు ఎందరో ఉంటారు. అయితే వారి ప్రతిభా సంపత్తి అంతా వారిలోనే ఎందుకు ఇంకిపోతుంది? కేవలం ఒకే ఒక్క కారణం వలన వారి సామర్థ్యం కుంటు పడిపోతుంది.

జీవితంలో ఎటువంటి స్పష్టమైన లక్ష్యాన్ని ఎంచుకోని వ్యక్తులు సమాజంలో రోజు రోజుకు వెనక్కు వెనక్కు జారిపోతుంటారు. అసలు తమ లోపమేమిటన్నది వారికే ఎప్పటికీ అవగతం కాదు. తాము ఉన్నత విద్యను అభ్యసించాము. ఏదో ఒక ఉద్యోగం చేస్తున్నాము లేదా వ్యాపారం చేస్తున్నాము. తమ జీవితం సాఫీగా సాగిపోతుంది. ఇంకా తాము ఆశించేదేముందన్న ఉదాశీన భావనలోకి అత్యధిక శాతం మంది చేరుకుంటుంటారు. చిన్నతనం నుండి తల్లితండ్రులు ప్రోద్బలంతో చదువుకోవడం, ఎక్కడ సీట్లు లభిస్తే ఆ కళాశాలలో చేరడం, విద్యాభ్యాసం పూర్తయిన తరువాత తనకు లభించిన పరిమిత సమాచారం మేరకు ఏదైనా ఉద్యోగంలో చేరడం లేదా ఏదో ఒక వ్యాపారాన్ని చేపట్టడం జరుగుతుంది. ఈ క్రమంలో తమ ఇష్టా ఇష్టాలను, ఒక స్పష్టమైన లక్ష్యాన్ని ఎంచుకొని, ఆ లక్ష్యాన్ని చేరుకొనే మార్గాలుగా తమ ఉద్యోగాన్ని గాని, వ్యాపారాన్ని గాని ఎంచుకోవడం జరగదు. కేవలం యాదృచ్ఛిక సంఘటనలే వారి జీవన మార్గాన్ని తీర్చిదిద్దుతాయి.

వర్తమాన సమాజంలో అగ్ర భాగాన నిలిచిన వారందరూ ఒక స్పష్టమైన లక్ష్యాన్ని ఎంచుకొని, ఆ లక్ష్య సాధనకై తమ సర్వస్వాన్ని వెచ్చించిన వారే. ఒక సాధారణ రైతు కుటుంబంలో జన్మించిన యువకుడు, సినిమా రంగంలో రాణించడమే తన లక్ష్యంగా ఎంచుకొంటాడు. ఆ ప్రయత్నంలో అనేక వైఫల్యాలు, అవమానాలు, ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటాడు. అయినా వెనుతిరగకుండా, లేని రంగంలో నిలదొక్కుకోవడానికి అనుగుణమైన ఆలోచనా ధోరణిని పెంపొందించుకుంటాడు. ఆ రంగంలో రాణించడానికి తగిన ప్రతిభకు పెంచుకోవడానికి నిరంతరం కృషి చేస్తాడు. ఆ రంగంలో వస్తున్న మార్పులను ఎప్పటికప్పుడు స్పష్టంగా గుర్తిస్తూ వాటికనుగుణంగా తనను తను సరిదిద్దుకుంటాడు. ఇలా దశాబ్దాల పాటు చేసిన కృషి ఫలితంగా అతను కోట్లాది మంది హృదయాలలో సుస్థిర స్థానం సంపాదించుకోకలుగుతాడు.

పాలిటెక్నిక్ చదివిన ఒక యువకుడు, ఒక లేత్ మిషన్ ఆపరేటరుగా తన జీవితాన్ని ప్రారంభించుతాడు . కేవలం స్వయం కృషితో అందులో ఎంతో నైపుణ్యాన్ని సాధించుతాడు. తరువాత తానే ఒక లేత్ మిషన్ కొని సొంతంగా ఒక వర్క్ షాప్ ప్రారంభిస్తాడు. తనకు విపరీతంగా ఆర్డర్లు రావడం వలన రుణం తీసుకొని ఇంకో రెండు మిషన్లు కొంటాడు. ఆ తరువాత కొద్ది రోజులకే, ఈ మిషన్ల స్థానంలో కంప్యూటర్‌తో నడిచే ఆధునిక సి.ఎన్.సి మిషన్ కొంటేనే తన ఖాతాదారుల అవసరాలు తీర్చగలనని , అందులో లాభాలు కూడా అధికంగా ఉంటాయని అతను గుర్తిస్తాడు. ఆ ఆధునిక యంత్రం ఒకటి కొంటాడు. తరువాత మరొకటికొంటాడు. అయినా విపరీతంగా వస్తున్న ఆర్డర్లు చూసిన తరువాత ఈ ఆధునిక యంత్రాన్నీ తానే ఎందుకు తయారు చేయకూడదన్న ఆలోచన వచ్చింది. ఆ పని ప్రారంభించాడు. మొదట్లో తయారు చేసిన యంత్రంలో అనేక లోపాలు తలెత్తాయి. వాటిని సవరించి, అతి నాణ్యమైన యంత్రాన్ని చేయడానికి అతనికి రెండు సంవత్సరాలు పట్టింది. ఆ తరువాత ఆ ఆధునిక యంత్రాల తయారీ ప్రారంభించాడు. అతి తక్కువ ధరకు అతి నాణ్యమైన యంత్రాలను అనేక దేశాలకు ఎగుమతి చేయడం ద్వారా అతను, ఆ పరిశ్రమలో అగ్రగామిగా ఎదిగాడు. మొదట్లో అతనితోపాటు లేత్ ఆపరేటరు ఉద్యోగంలో చేరిన వారు పదోన్నతులు పొంది, మంచి జీతంతో అదే పనిచేస్తున్నారు. అందుకు భిన్నంగా, ఈ రంగంలో ఉన్నత స్థాయికి చేరుకోవాలన్న లక్ష్యాన్ని ఎంచుకున్న యువకుడు పెద్ద పారిశ్రామికవేత్తగా రూపు దాల్చాడు.

యాంత్రికంగా తమ పనేదో తాము చేసుకుపోయేవారు యధాతథ స్థితిలోనే మిగిలిపోతుంటారు. అందుకు భిన్నంగా ఎవరైనా తమ జీవితంలో ఒక లక్ష్యం ఎంచుకోగానే ఒక అద్భుతం జరిగిపోతుంది. ఇంతవరకు చిందరవందరగా అనేక అంశాలపై సాగిన ఆలోచనలన్నీ తాము ఎంచుకున్న లక్ష్యం వైపే కేంద్రీకృతమవుతాయి. తమ పరిచయస్తులు,స్నేహితులలో తమ లక్ష్య సాధనకు ఉపకరించేవారితో మరింత సన్నిహితం కావడం జరుగుతుంది. తమ లక్ష్యానికి సంబంధించిన సమాచారాన్ని అన్నీ వైపులనుండి సేకరించడం జరుగుతుంది. ఆ తరువాత ఏ విషయాన్ని పట్టించుకోకుండా నిరంతరం తమ లక్ష్యాన్ని గురించే ఆలోచించడం మొదలవుతుంది. ఆ లక్ష్యాన్ని చేరుకోవడానికి కొత్త మార్గాలేమున్నాయని అన్వేషించడం ప్రారంభమవుతుంది. ఈ క్రమంలో ఏ అవకాశాన్ని ఎలా వినియోగించుకోవాలన్న తపన ఆలోచనలను ఆక్రమించుకుంటుంది. అంటే, ఒక లక్ష్యాన్ని ఎంచుకున్న సాధారణ వ్యక్తి ఉన్నట్లుండి ఆ లక్ష్యాన్ని సాధించే యంత్రంలా మారిపోతాడు.అతని శక్తి సామర్థ్యాలు ఆ లక్ష్యం వైపే కేంద్రీకృతమవుతాయి. అతని ప్రతిభ ఆ లక్ష్యానికి అనుగుణంగా ఉధృతంగా వృద్ధి చెందుతుంది.

ఏ స్థాయిలో ఉన్న వారైనా కావచ్చు. వారి ఆర్థిక స్థితి ఎలాగైనా ఉండవచ్చు. కుటుంబ నేపథ్యం ఏదైనా కావచ్చు. కానీ వారు ఒక లక్ష్యం ఎంచుకోకల్గితే చాలు. తాము అభిలషించే విజయంలో 75 శాతం చేజిక్కించుకోకలిగినట్లే! చాలా మంది యువకులు సాఫ్ట్‌వేర్ నూతన ఉత్పత్తులను ఆవిష్కరించిన కొద్ది కాలంలోనే కోట్లు సంపాధించారన్న వార్తలు పేపర్లలో చదువుతూ చాలామంది నిర్ఘాంతపోతుంటారు. ఇదెలా సాధ్యపడుతోందని ప్రశ్నిస్తుంటారు. ఈ విజయాలకు మూల కారణం ఒక్కటే ! వారు సరైన లక్ష్యాన్ని ఎంచుకోగలిగారు.

లక్ష్యం లేని జీవితం ఎలా సాగుతుందన్న ప్రశ్నకు ఒక సందేశాత్మక ఉదాహరణను సమాధానంగా చెబుతుంటారు. అతి శక్తివంతమైన కారులో బయల్దేరి ఆ కారును వేగంగా నడుపుతూ, సిగ్నల్స్ ఎటు చూపితే అటు వెళ్ళుతూ, ఆ ప్రయాణాన్ని ఆనందించే వ్యక్తి తన సాధన సంపత్తులన్నిటిని ఎలా వృధాచేస్తున్నాడో, ఒక లక్ష్యం లేకుండా, తమ జీవనాన్ని గడిపేవారు కూడా, తమ జీవితాన్ని అలా వృధా చేస్తుంటారు.



– సి నరసింహారావు
మనోవైజ్ఞానిక విశ్లేషకులు

# చుట్టూ పక్కల చూడరా...



ప్రకృతి ఆయన తొలి, మలి పాఠశాల. చెరువులో చేపలతో ఈతనేర్వడం, గాలిపటాలతో పిట్టలతో పంతమాడటం ప్రకృతి బడిలో ఆయన దిద్దిన ఓనమాలు. మట్టి దుప్పట్లు తంతూ మొక్కగా ఒళ్లు విరిచే విత్తు రహస్యాన్ని తెలుసుకోవడమే ఆయన అక్షరాభ్యాసం. ఆయనే కొప్పుల హేమాద్రి.

పుట్టింది తూర్పుగోదారి గొల్లప్రోలు- చిన్న పల్లె. దాన్ని వదిలిపెట్టి పూణె వెళ్లిన నాటి యువకుడు, మొక్కల్లోంచి మానుల్లోకి, మహారణ్యాల్లోకి, గిరిజన సమూహాల్లోకి సుదీర్ఘ ప్రయాణం చేశాడు. మనిషి తెలుసుకోలేని మహత్తులను మొక్కల గురువుల వద్ద నుంచి నేర్చుకున్నాడు.

స్వయంకృతాపరాధం వంటి రోగాలతో, రొష్టులతో కునారిల్లుతున్న మనిషి వెన్ను తట్టి, అపర ధన్వంతరి అయ్యాడు. అంతర్జాతీయ వృక్షశాస్త్రజ్ఞుడిగా పేరొందిన కొప్పుల వారు మన తెలుగు ముద్దుబిడ్డ. తెలుగు వనాల సర్వేక్షణాధికారి. మందు మొక్కల పరిశోధకుడు. గిరిజన వైద్య సారస్వత రూపకల్పన శిల్పి. ప్రపంచానికి ఆయన అందించిన కొత్త మొక్కలు 25, నామికరణ సరిదిద్దినవి 15. అటువంటి కొప్పుల హేమాద్రి అన్వేషణే- ఈ హేమాద్రి ఓషధీ ప్రస్థానం.

అరణ్యాలు పట్టి పోవాలేగాని అనుభవాలకు లోటుండదు. పద్నాలుగేళ్ళు తిరిగిన రాముడికే 'రామాయణమంత' అనుభవం కలిగితే, మరి నలభై ఏళ్ళు అడవుల్లో తిరిగిన నాకెంత కలగాలి?




ఒకసారి నేను తిరువూరు నుండి దమ్మపేట మీదుగా కొత్తగూడెం వెడుతున్నాను. అడవుల గుండా పోతున్న ఆ దారి నాకు చాలా నచ్చింది. వొళ్ళంతా పువ్వులు చేసుకున్న వృక్షాలనూ, ఫలాల భారంతో బిగపట్టుకున్న లతలనూ గమనిస్తూ "ఓహో! ఇదన్నమాట- ఈ చెట్లు పుష్పించే ఋతువు! ఇదన్నమాట- ఈ లతలు బిడ్డలనెత్తుకునే కాలము!" అనుకుంటూ ముందుకు పోతుంటే, ప్రమాద సూచికతో ఉన్న ఓ మలుపు (కర్వ్) దగ్గరకు చేరుకున్నాను. కారు వేగాన్ని తగ్గించగానే- చేతిలో పసుపూ, కుంకం ఉన్న పళ్ళెంతో ఒకతను నా దగ్గరకు వచ్చి "సారూ! ఇక్కడనుండి 'గండి ముత్యాలమ్మ' అడివి సురూ అవుద్ది. ముత్యాలమ్మకి మొక్కుకోండి" అని ఆ పక్కనే ఉన్న చిన్న గుడిని చూపించాడు. అడవుల్లో తిరిగేటప్పుడు ఎవరైనా అడవి బిడ్డలు తారసపడితే వారితో మాట్లాడే అవకాశాన్ని వదులుకోని నేను బండి దిగి అతని వెంట వెళ్ళి పళ్ళెంలో డబ్బులు వేసిమాటలు కలిపాను.

ఈ గుడికి పూజారి నువ్వేనా?

అవునన్నాడు.

ఈ ప్రాంతంవాడిలా లేవే?

అవునండి.

అసలు గిరిజనుడివేనా?

కాదండి.

ఎన్నాళ్ళుగా ఉంటున్నావు?

చాలా ఏళ్ళుగా.

సరేగాని.. దీని పేరేమిటి? అని తెల్లటి పూలతో, మల్లె వాసనతో, నిండుగా ఉన్న ఓ చెట్టును చూపించాను. 'తెలియదండి' అన్నాడు.

ఏమయ్యా, ఇంత చూడ చక్కని చెట్టు పేరే తెలీదా?

తెలీదండి.

సంభాషణ ఇలా జరుగుతున్న సమయంలో ఓ కోయ యువకుడు విల్లంబులు చేతబట్టి ఆ దారిన పోతుంటే పిలిచాను.

వర్రా! (ఇలా రా!).

వచ్చాడు.

నీ పెదిర్ బాత్ పెదిర్?(నీ పేరు ఏమి పేరు?).

నా పెదిర్ కూరు కన్నప్ప.

బాత్ నార? (ఊరేమిటి?).

ఆర్లెపెంట.
అలాగా? కన్నప్పా! ఈ బాత్ మార? (ఈచెట్టు పేరేమిటి?)
పాల కొడిశ.
ఎందుకైనా పని చేస్తాదా?
చేస్తాది దొరా! దీని చెక్కా, గింజలూ చేందు(చేదు)గా ఉంటాయి. నమిలి మింగితే బంక బేదులు తగ్గుతాయి.
ఈ గండి ముత్యాలమ్మ గుడి చుట్టూ పెరుగుతున్న చెట్లలో మందుల్లోకీ గట్రా పనికివచ్చేవి ఇంకా ఉన్నాయా?
ఎందుకు లేవండీ, అదిగో! ఆ చెట్టు పేరు తబసిమార. (కొవిల చెట్టు). దాని బంక(జిగురు)- విరేచనం సమంగా అవ్వడానికి పని చేస్తాది. ఆ పక్కది కరకమార (కరక్కాయ చెట్టు). దాని కాయలు గుండ చేసి మింగినా విరేచనం బాగా అవుతాది. ఇదుగో మన ఎదర ఉన్నది చిల్లమార. పచ్చికాయలు దంచి, ఎండిపోతున్న వంకల్లో కలిపితే- చేపలు తేలిపోతాయి. ఇది చెన్నంగి మార. దీని ఆకులు- దురదగా ఉండే అడిం (అడివి) కందలతోబాటు ఉడకేస్తే ఆ దురద తగ్గిపోతాది. ఈ పక్క సోమిమార. దీని చెక్క చేందు. కషాయం కాచి తాగిస్తే కుట్టునొప్పి తగ్గుతాది. ఇంకా చాలా ఉన్నాయి. సారూ! పెరంబోదులు (అడవి దున్నలు) ఉంటాయి, జాగ్రత్తగా గమనించుకుంటూ పోండి' అని హెచ్చరించి చక్కాపోయాడు.
నేను పూజారితో భేటీ కొనసాగించాను. "పూజారీ! చూశావా, ఆ కోయదొర ఎంత చక్కగా అన్ని మొక్కల పేర్లూ, వాటి ఉపయోగాలూ చెప్పేస్తున్నాడో! నీవు చాలా కాలంగా ఈ గుడి దగ్గర కూర్చున్నా, ఇక్కడ పెరుగుతున్న ఒక్క చెట్టుని కూడా పట్టించుకోలేదు! అటూ ఇటూ పోయే వారి దగ్గర దక్షిణలూ గట్రా నొక్కేస్తావు. ఎవరైనా అడిగితే చెప్పడానికైనా, కనీస సమాచారం సేకరించుకుని ఉండవలసింది. ఇప్పటికీ మించిపోలేదు. కోయ బిడ్డల సాయంతో, కాస్త మూలికా జ్ఞానం పెంపొందించుకో. మళ్ళీ నేనెప్పుడైనా ఈ దారిలో వెళ్ళినప్పుడు తప్పక నిన్ను కలుస్తా" అని రాం! రాం! చెప్పి, నా ప్రయాణాన్ని కొనసాగించాను.

– కొప్పుల హేమాద్రి

# సమాచార సాంకేతిక రంగంలో తెలుగు

ప్రపంచం అంతా కుగ్రామంగా మారిపోయింది. సమాచార సాంకేతికరంగం మన జీవితాలను సమూలంగా మార్చేస్తుంది. చారిత్రకంగా కనీవినీ ఎరుగని వేగంతో మార్పులు చోటు చేసుకుంటున్నాయి. ఈ సమాచార సాంకేతిక యుగ ఫలాలను తెలుగు సమాజంలో మరింత మందికి అందించడం ఎలా? సమాచార సాంకేతికత్వమంతా ఇంగ్లీషులో ఉంది కనుక మనవాళ్ళందరినీ ఇంగ్లీషులోనే దాన్ని వాడుకోమనాలా? దాని వల్ల లాభాలు ఏమిటి? నష్టాలు ఏమిటి? మరో మార్గం ఏమైనా ఉందా?

### ఒకసారి ఏం జరిగిందంటే?

మా స్నేహితురాలు సౌమ్య నార్వే వెళ్ళారు. అక్కడ ఏం జరిగిందో తన మాటల్లోనే వినండి:
మా వర్క్ షాపులో చైనీయుడి ల్యాప్‌టాప్ చైనీసులో ఉంది. నార్వే మనిషిది నార్వేగియన్ భాషలో, స్లొవేనియన్ ఆవిడది ఆ భాషలో, జర్మన్‌ది జర్మన్‌లో, ఇటాలియన్ ల్యాప్‌టాప్ ఇటాలియన్‌లో?. ఇలా ఉన్నాయి. నాది మాత్రం చక్కగా ఇంగ్లీషులో ఉంది. అసలుకి సిగ్గుతో చావాల్సిన సంఘటన ఏమిటంటే? "ఓహ్! నువ్వు చైనీస్‌లో వాడతావా కంప్యూటర్ని?" అంటే "ఇంకెందులో వాడతాను?" అన్నాడు నా చైనా స్నేహితుడు!
మరోసారి కొరియా నుండి ఫేస్ బుక్ మిత్రుడు, నేను కొరియాలో ఉంటున్నాను. అన్ని అనువర్తనాలూ మాతృభాషలో ఉంటే జీవితం ఎంత హాయిగా ఉంటుందో నాకు తెలుసు !!!
నిజానికి మనం ఏం కోల్పోతున్నాం?
మనం ఏం కోల్పోతున్నామో మనకు అస్సలు తెలీదు. ఏ విధంగా అయితే గుడ్డివాడు ఏనుగును వర్ణించలేడో, అదే విధంగా సమాచార సాంకేతిక రంగం మొత్తం మాతృ భాషలో ఉంటే ఎలా ఉంటుందో మనకు బొత్తిగా తెలీదు. ఆ రుచి మనకు తెలీదు.
మన ప్రస్తుత పరిస్థితి ఎలా ఉందంటే, మనం వీరులమే కాని, అద్దెవీరులమయ్యాము. మన కోసం మనం యుద్ధం చేసుకోవటం మానేసాం. లక్షలు తీసుకుంటూ ఇంగ్లీషు ప్రపంచానికి సమాచార సాంకేతిక అద్భుతాలు ఆవిష్కరిస్తూ, మాతృభాష విషయానికి వచ్చేసరికి పేదవాళ్ళమయ్యాం.
పరిస్థితి ఇలాగే ఉంటుందా? మార్పు రాదా? మార్పు అసలు అవసరమా? మార్పు నిర్ణయించాల్సింది ఎవరు? మార్పు కృషి ఎవరు చెయ్యాలి?
మన ప్రస్తుత సమాజం పై ప్రశ్నలకు జవాబిచ్చే స్థితిలో లేదు. అటువంటి మార్పు కాలానుగుణంగా రావాల్సిందే. సమాచార సాంకేతిక రంగ ఫలాలు తెలుగు వాళ్లందరికీ అందాల్సిందే. అయితే అది తెలుగులోనే, ఇంగ్లీషులో కాదు

### మనం ఏమి చెయ్యగలం?

చిన్న చిన్న కారణాలే మహా విప్లవాలకు నాంది అవుతాయి అని పెద్దలు చెపుతుంటారు. మన సమాజం మెడపై కత్తిలా వేలాడుతున్న భవిష్యత్తు నిరుద్యోగ సమస్యకు కూడా ఇవి పరిష్కారం చూపగలవు అని నా భావన.

### మొదటి సూచన:

ఆంగ్లేతరం చూడండి.
పై చిత్రంలో ఎరుపు రంగులో ఉన్నది మాత్రమే ఇంగ్లీషు మాట్లాడే సమాజాలు. చూడండి, ఎంతో



ప్రపంచం ఇంగ్లీషు మాట్లాడకుండా బతికేస్తుంది. వాళ్ళంతా ఏమి చేస్తున్నారు సమాచార సాంకేతిక రంగాల్లో?.
కాబట్టి, మన విశ్వవిద్యాలయాలు కొరియా, జపాన్, నార్వే, జర్మనీ, చైనా వంటి దేశాల విశ్వవిద్యాలయాలతో సెమిస్టరు ఎక్స్‌చేంజ్ ప్రోగ్రాములు విరివిగా ప్రోత్సహించాలి. తద్వారా మన యువతకు ఆంగ్లేతర సాంకేతిక పరిజ్ఞానంపై అవగాహన ఆసక్తి పెరుగుతుంది.

### రెండవ సూచన

మన ఇంజినీరింగు చదువుల్లో ప్రతి సెమిస్టరులోనూ తెలుగు కంప్యూటింగు ఒక పాఠ్యాంశంగా ఉండాలి. ASCII (American Standard Code for Information Interchange) లతో పాటుగా ISCII, Unicode లు కూడా నేర్పించాలి.



కిరణ్ కుమార్ చావా

# తెలుగు లో ఉర్దు పదాల 'తకరారు'

"కారులో షికారు కెళ్లే పాల బుగ్గల పసిడి దాన బుగ్గ మీద గులాబీ రంగు ఎలా వచ్చేనో చెప్పగలవా". ఆత్రేయగారు వ్రాసిన ఈ పాట పల్లవిలో తొలిపదం కారు ఆంగ్ల పదం, షికారు ఉర్దు పదం. తెలుగులో షికారు అంటే కాలక్షేప తిరుగుడు అని. ఉర్దులో 'వేట' లేక వెంటాడుట అని అర్థం. గులాబీ రంగుకు మరి వేరే చెప్పాలా; 'గులాబ్ కా రంగ్' తెలుగుపదం ఎలా అయిందో చెప్పగలవా?

"ఖుషీ ఖుషీగా నవ్వుతూ చలాకీ మాటలు రువ్వుతూ హుషారు గొలిపేవెందుకే నిషా కనుల దానా..." దాశరథి రచించిన ఈ పాట పల్లవిలో పదాల ఉర్దు అవశేషాలున్నాయి. ఖుషీ ఉర్దు పదం – అంటే ఆనందం , సంతోషం వగైరా. చలాకీ–అంటే 'చాలక్ ' అనే ఉర్దు పదం నుంచి వచ్చింది. తెలుగులో 'తెలివైన' 'చురుకైన ' అనే అర్థం. నిషా (ఉర్దు పదం) కనులు అంటే 'కైపెక్కిన కళ్ళు'.

సినీ గీత రచనలోనే ఇన్నేసి హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు పదాలు చోటు చేసుకుంటే, రోజువారీ సంభాషణల్లో ఇక ఎన్ని పరభాషాపదాలు దొర్లుతాయో చెప్పక్కర్లేదు. బేకారుగా ఉన్నాదంటే పనీపాటా లేకుండా వృధాగా కాలయాపన చెయ్యడం.బద్ధకం, సోమరి లాంటి తెలుగుపదం సరిపోతుంది. దస్తావేజుల లిపి లోంచి ఊడిపడిన పదాలు తకరారు (వివాదం) , ఫక్తు(ఇట్లు) ఫక్కీ(లాగ,వలె) నమూన అంటే మాదిరి, అలాగే కాపీ (ఇంగ్లీషు పదం) నకలు. నకిలీ (పోలిన). కబురు–ఉర్దూలో ఖబర్(వార్త) కు రూపాంతరం. మక్కీకి మక్కీ అనే పదానికి ఈగవాలిన చోటే ఈగను చంపి అలాగే ఉంచడం(యధాలాపం) అన్నమాట. అత్తరు ఉర్దులో ఈతర్ వాడుకలో అత్తరునే. ఇకపోతే బస్సు, రైలు, స్టాండ్ స్టేషన్, పేపరు, పెన్ను, గ్రౌండు, పోలీసు, కలెక్టరు, కండక్టరు, డ్రైవరు, రోడ్డు, బ్రిడ్జి, ఆపిలు, టేబుల్ , స్విచ్ లాంటి ఇంగ్లీషు పదాలు దైనందిన జీవితంలో చోటు చేసుకున్నాయి.

కితాబు ఉర్దు పదం. తెలుగులో కితాబు అయింది. కితాబు నివ్వడమంటే 'మెచ్చుకోలు'. ఫరారు, ఫరారి ఈ రెండు పదాలు నేర ప్రవృత్తిలో తారసపడతాయి. ఉదాహరణకు ప్రమదానంతరం డ్రైవరు పరారయ్యాడు. దోపిడి చేసిన దొంగలు పరారీలో ఉన్నారు. ఫరార్ అనే ఉర్దూ పదం తెలుగులో సమానార్థం 'పలాయనం' అనడం సబబు. సబబు అంటే న్యాయం, ధర్మం అని తెలుగులో అర్థం. 'ఉడాయించారు' అంటే ఎగిరేశారు, ఎగిరిపోయారు అని అర్థం.

కౌలు–ఖరారు ఇవి ఉర్దూ జంట పదాలు. అయినా విడి విడి ప్రయోగం జరుగుతుంది.సేద్య భూమిలో పండించిన పంటకు సగభాగం (ఒప్పందం ప్రకారం), భూస్వామికి సగభాగం కర్షకునికి చెందడం. ఖరారు అనగా నిశ్చయము. కౌలు–ఖరారు ఒప్పంద నిశ్చయం. కొన్ని పదాలు చక్రవర్తులు, నవాబుల కాలం నుంచి ఏలికలో ఉన్నాయి . వాటిలో కొన్ని చూద్దాం. ఇనాము (కానుక), నజరాన (బహుమానం), జులుం (దౌర్జన్యం).

జబర్దస్తీ (దౌర్జన్యం), జబర్దస్త్ (గొప్ప, సాటిలేని), జుర్మానా (పరిహారము, చెల్లింపు), హమేషా (నిత్యం), హవా (గాలి), హయం (పాలన), బద్మాష్, బెవకూఫ్ తిట్టును సూచించేవి. బద్మాష్ (ఇష్టంతో కష్టపెట్టువాడు), బెవకూఫ్ (అయోగ్యుడు, మూర్ఖుడు) లాంటి ప్రత్యక్ష తెగడ్తకు సానుకూల పదద్వయం.

పత్రికల వాళ్ళు పత్రికాభిరుచికి తగ్గట్టు కొన్ని ఉర్దు పదాలను వాడుకలోకి తెస్తుంటారు. తెలుగు భాష కనుమరుగైపోతుందని ఇంగ్లీషుకు అధిక ప్రాధాన్యమిస్తున్నారని బాషాభిమానులు, తెలుగు భాషోద్యమ కర్తలు ఉద్యమిస్తున్న నేటి పరిస్థితులలో పత్రికల వాళ్ళు ఇప్పుడిప్పుడే కళ్ళు తెరుస్తున్నారు. ఇంగ్లీషు పదాలకు తెలుగులో పదాలను కనిపెడుతున్నారు.




'కచ్చా రోడ్డు వల్ల ఇబ్బందులు పడుతున్న గ్రామీణులకు ఇక నుంచి తారు రోడ్లు వేయుటకు ఆర్ అండ్ బి తో చర్చలు జరిగాయి'. 'అలాగే ఫలానా పథకం కింద పక్కా ఇళ్ళు నిర్మించేందుకు ప్రణాళిక రూపొందించింది.' ఈ వాక్యాలు కచ్చా–పక్కా పద ప్రయోగాలు హిందీ,ఉర్దులో నుంచి తీసుకున్నవే . కచ్చా అంటే కాయ, పక్కా అంటే పండు. తెలుగు శబ్దార్థానికి 'కచ్చా' అంటే అస్థిరం, తాత్కాలికం. పక్కా అంటే శాశ్వతమైన, పటిష్టమైనదని భావం. 'ఖతర్నాక్' అనే పదం తెలుగు సినిమాగా వచ్చింది ఆ మధ్యలో. ఆ ఉర్దు పదం పదును, ప్రమాదం వంటి విశేషణాల్ని సూచిస్తుంది. జోడీ ఉర్దు పదం – జంట, జత పర్యాయ పదాలు. తాహతు 'తాహత్'కు రూపాంతరం. మనిషి ఆర్థిక స్థితిగతులనుద్దేశించి 'తాహతు' అని చెబుతున్నారు. దీనికి సరైన తెలుగు పదం స్థోమత. 'ఖలేజా' ఇటీవలి తెలుగు చిత్రం. 'కాలీజా' ఉర్దూ పదానికి తెలుగులో ఖలేజా అంటున్నారు.

ఉర్దూలో 'సతాన' పదానికి తెలుగులో సతాయింపు. ఉదాహరణకు అత్త కోడలిని సతాయిస్తుంది. తెలుగులో బాధించుట, వేధించుట. కుర్సీని కుర్చీ అంటున్నామా! ఫ్యాను, గ్లాసు, లైటు, రైటు, స్విచ్చు ఆంగ్ల పదాలు. ఫ్యానుకు 'పంకా' అని కనిపెట్టారు పత్రికలు. 'ఫంక్' అనే హింది పదానికి 'రెక్కలు' అని అర్థం. ఫ్యాన్ ను తెలుగులో 'విసన' అనాలి. కిలాడి అంటే కేటుగాడు. కిలాడి–ఆటగాడు లేదా క్రీడాకారుడు అని అర్థం.

'టోకరా ' అంటే తెలుగులో గంప, సజ్జా, బుట్టా, పత్రిక భాషలో మోసగించు. 'బంద్' అంటే మూసివేత. కానీ 'బంద్' అంటే సమ్మెగా వ్యవహరిస్తున్నాం. తెలుగులో జోరుకి ప్రత్యామ్నాయ పదం వేగం; 'జోష్–ఆవేశం, ఉత్సాహం. తాకీదు (హెచ్చరిక), దర్యాప్తు (విచారణ). 'బజార్' అరబ్బీ బాష నుంచి, 'మార్కెట్' ఇంగ్లీషు భాష నుంచి తెలుగులో దిగుమతి అయ్యాయి. 'రోజ్' అనే పదం అరబ్బీ మూలం. తెలుగులో 'రోజు' అంటున్నాం.

– సయ్యద్ జహీర్ అహ్మద్

## జుబ్బాలో నారదుడు!

సినిమాల్లో స్త్రీలు పురుష పాత్రలు ధరించడం కొత్తేమీ కాదు. ఐతే, నారదుడు వంటి పాత్రను స్త్రీలు ధరించాలంటేనే ఇబ్బంది! దానికీ మనసినిమావాళ్లు ఓ ఉపాయాన్ని కనిపెట్టారు. 1943లో విడుదలైన పౌరాణిక చిత్రం 'కృష్ణప్రేమ'లో – "మా తెలుగు తల్లికీ మల్లెపూదండ" ఫేమ్, ఆనాటి 'మిస్ బాంబే' టైటిల్ గ్రహీత టంగుటూరి సూర్యకుమారి నారదపాత్ర ధరించారు. ఆ చిత్రంలో నారద పాత్ర జుబ్బాలో కనిపించేసరికి ప్రేక్షకులు ఆశ్చర్యపోయారు. 1958లో 'చెంచులక్ష్మి' చిత్రాన్ని తీసిన దర్శక నిర్మాత బి.ఎ. సుబ్బారావు 'నారద నారది' చిత్రాన్ని సంకల్పించి, జుబ్బా నారదుడిగా ప్రముఖ నటి భానుమతికి మేకప్ స్టిల్స్ తీసి పబ్లిసిటీకి విడుదల చేశారు. కానీ ఏవో కారణాల వల్ల ఆ చిత్ర నిర్మాణం ప్రారంభం కాలేదు.




1960లో ప్రముఖ దర్శక నిర్మాత కె.ఎస్. ప్రకాశరావు 'రేణుకా మహత్యం'లో నారద పాత్రకు రమణారెడ్డిని ఎంపిక చేశారు. 'చెంచులక్ష్మి'లో రేలంగి నారద పాత్ర ధరించినప్పుడు – రమణారెడ్డి ఆ పాత్ర ఎందుకు వేయకూడదని ఆయన వాదం. ఐతేరమణారెడ్డి బక్క చిక్కి ఎముకల గూడుగా కనిపిస్తే అలాంటి నారదుణ్ణి ప్రేక్షకులు 'భరించలేరని' ఆయనకు జుబ్బా తొడిగి, ఆయనను కూడా జుబ్బా నారదుడిగానే చూపించారు! సినిమాల్లో రమణారెడ్డి జుబ్బా నారదుడిగా చూడ్డానికి విడ్డూరంగానే ఉన్నా,జనం నవ్వుకుంటూనే ఆయన అందించిన హాస్యాన్ని ఆస్వాదించారు!!

## 'తస్సాదియ్యా' అనొచ్చా?

నేటి సగటు తెలుగు సినిమాల్లో హీరోయిన్లు – పురుషులను 'నీ యబ్బా' అని తిట్టడం, హీరోలు – హీరోయిన్లను 'పిడత పగులుద్ది' టైపు డైలాగులతో ఎద్దేవా చేయడం సర్వ సాధారణం. సెన్సారు వారికి అందులో 'బూతు' కనిపించదు! కానీ ఒకప్పుడు సెన్సారు పోకడలు విచిత్రంగా ఉండేవి. అన్నపూర్ణా సంస్థ ఆదుర్తి సుబ్బారావు గారి దర్శకత్వంలో నిర్మించిన 'డాక్టర్ చక్రవర్తి' చిత్రంలోని ఒక పాటలో ' నీ తస్సాదియ్యా' అనే మాట వస్తుంది. అప్పటి సెన్సారు




వారికి అదొక అసభ్యకరమైన మాటగా అనిపించి. అభ్యంతరాన్ని లేవనెత్తారు! మొత్తం పాటలో ఆ ఒక్క మాట తీసెయ్యడం ఎలా కుదురుతుందని కాని, దాంతో ఆ పాట 'మ్యూజికల్'గా దెబ్బ తింటుందని కూడా ఆలోచించకుండా, ఆ 'తస్సాదియ్యా'ను తొలగించాలని పట్టుబట్టారు. ఆ మాటకొస్తే 'సంసారం' (1950) అనే చిత్రంలో హీరో అక్కినేని 'తస్సాదియ్యా' అనే మాటను ఊతపదంగా కూడా వాడతారు. ఇలా ఏం చెప్పినా వాళ్లు వినకపోయేసరికి, అప్పుడు ఆ పాట రాసిన దాశరథిగారు, దర్శక నిర్మాతలు తెలుగు నిఘంటువు తెప్పించి అందులో ఆ మాటకు అర్థం చూపి, అది అసభ్య పదం కాదని వాదించిన తర్వాతే సెన్సారువారు అంగీకరించారు. సెన్సారువారి ధోరణులు ఇప్పుడు కాలంతో పాటుగా అలా మారిపోయాయి మరి!

## 'ఛాన్స్' అడిగిన జంధ్యాల

ప్రసిద్ధ రచయిత, దర్శకుడు జంధ్యాల (వెంకట దుర్గా శివ సుబ్రహ్మణ్య శాస్త్రి)ను మీ అభిమాన దర్శకులు ఎవరని అడిగితే, బి.ఎన్. రెడ్డి, కె. విశ్వనాథ్, కె. బాలచందర్, బాపు, ప్రముఖ హాలీవుడ్ దర్శకుడు డేవిడ్ లీన్ (David Lean) పేర్లు చెప్పేవారు. 'బ్రీఫ్




ఎన్‌కౌంటర్, 'ద బ్రిడ్జ్ ఆన్ రివర్ క్వాయ్, 'లారెన్స్ ఆఫ్ అరేబియా' 'డాక్టర్ జివాగో' 'ఎ పాసేజ్ టు ఇండియా' వంటి ప్రసిద్ధ చిత్రాలు తీసిన డేవిడ్ లీన్ అంటే ఆయనకు ప్రత్యేకాభిమానం. ఎంత అభిమానం అంటే "మీ దగ్గర అసిస్టెంట్‌గా పనిచేసే అవకాశం నాకిస్తారా?" అని ఒకసారి ఆయనకు ఓ ఉత్తరం కూడా రాశారు! నటన పట్ల ఆసక్తి ఉన్నా, జంధ్యాల ఏ సినిమాలోనూ నటించలేదు. కానీ కె. విశ్వనాథ్ దర్శకత్వంలో రూపొందిన 'ఆపద్బాంధవుడు' చిత్రానికి ఆయన స్క్రిప్టు రాస్తున్నప్పుడు, కథానాయిక మీనాక్షి శేషాద్రి తండ్రి పాత్ర మీద ఆయనకు మమకారం ఏర్పడింది. దాంతో అందరికీ ఆశ్చర్యం కలిగేలా, ఆ పాత్రలో నటించే అవకాశం తనకు ఇవ్వవలసిందిగా ఆయన దర్శక నిర్మాతలను అడిగి ఆ చిత్రంలో నటించారు!

## నిధి చాల సుఖమా?

రాజ్‌బాబు హాస్య నటుడే అయినా ఆయన మాటల్లో అప్పుడప్పుడు ఓ రకమైన వేదాంత ధోరణి




తొంగిచూసేది. చిత్రరంగ ప్రవేశం చేసిన తొలిరోజుల్లో రాజ్‌బాబు, తన తమ్ముడు చిట్టిబాబు (ఈయనా హాస్యనటుడే)తో ఒక అద్దె ఇంట్లో ఉండేవాడు. అప్పుడు చెన్నైలో వాళ్లున్న ప్రాంతంలో దొంగల భయం ఎక్కువగా ఉండేది. అయినా రోజూ రాత్రి పడుకునేటప్పుడు రాజ్‌బాబు వీధి తలుపులు మూసేవాడుకాదు. చిట్టిబాబు తలుపులు మూయబోతే "వద్దురా... ఒకవేళ దొంగ ఎవడైనా వచ్చినా మనింట్లో ఏమీలేదని చూసి, వాడే ఏద్దైనా పడేసి పోతాడు" అనేవాడు నవ్వుతూనే. ఆ తర్వాత కొంతకాలానికి సినిమాల్లో బిజీ స్టార్ అయ్యాక, రాజ్‌బాబు చెన్నైలోని మహాలింగపురంలో ఓ ఇల్లుకొని, కాపలా కాయడానికి ఓగూర్ఖాను నియమించాడు. ఒక రోజు అర్ధరాత్రి తన తమ్ముణ్ణి నిద్రలేపి 'గూర్ఖా మేలుకుని ఉన్నాడో లేదో చూసొద్దాం పద' అన్నాడు. ఇద్దరూవెళ్లి చూసేసరికి గూర్ఖా గురకపెట్టి నిద్రపోతున్నాడు. వెంటనే రాజ్‌బాబు అతన్ని లేపి చివాట్లు పెట్టాడు. "దొంగల భయం ఉన్న రోజుల్లో కూడా మనం హాయిగా నిద్రపోయేవాళ్లం. డబ్బు వచ్చిన తర్వాత కాపలాకి గూర్ఖా పెట్టి, వాడికి కాపలాగా మనం గూర్ఖా ఉద్యోగం చేయాల్సివస్తుందే" అన్నాడు చిట్టిబాబు ఆవులిస్తూనే... "అంతేనమ్మా.... డబ్బు లేనన్నాళ్లూ లేదని బాధ.... డబ్బు వచ్చాక దాన్ని కాపలా కాయాలనే బాధ.... డబ్బులో సుఖం లేదమ్మా" అన్నాడు రాజ్‌బాబు తన వేదాంత ధోరణిలో!

– బి.కె. ఈశ్వర్

ఆ పిల్ల కంటికి ఆ తల్లి అందంగా కనిపిస్తుంది. ఇది సహజం. వారిద్దరి మధ్యా వున్న అనుబంధం, ప్రేమ, చనువు దీనికి కారణం. ఇలాంటిదే భాష కూడా. మనకి ఆ భాషలో వున్న చనువు వల్ల ఆ భాషని యిష్టపడతాం. ఉగ్గుపాలతో నేర్చే బాష కాబట్టి మాతృ భాషలో చనువు ఏర్పడుతుంది. వృత్తి వ్యాపార వుద్యోగ కారణాల వల్ల తరువాతి కాలంలో అన్య భాషను ఎక్కువగా వాడాల్సివస్తుంది. అప్పుడు సొంత భాష వాడుక బాగా తగ్గిపోతుంది. క్రమేపీ మాటలు మరుగున పడతాయి. నిత్యం ఎక్కువగా వాడే బాషా పదాలే నాలిక చివర వుంటాయి. సొంత మాటలకు తడుముకోకుండా వెంటనే స్ఫురించిన మాటల్నే వాడేస్తాం. అదేమీ పెద్ద అపరాధం కాదు. అయితే, అన్ని సందర్భాలకు యిది నప్పదు. వృత్తి వ్యాపారాలలో ఎన్నో భాషల్ని, పారిభాషిక పదాల్ని వాడతాం. కాని నిత్యకృత్యంలో మన ఆప్తులతో మాట్లాడేటప్పుడు అమ్మభాష బావుంటుంది కదా. ఒక పెళ్లిలోనో పేరంటంలోనో మన బంధువర్గం మధ్య మాటలు నడిచేవేళ మన తెలుగు మాటల్ని గుర్తు చేసుకునైనా మాట్లాడితే ఆ సందర్భం మరింత ఆహ్లాదంగా వుంటుంది. మన అక్కయ్యలు, చెల్లెళ్లు, మావయ్యలు, చిన్నాన్నలు, వదినలు యింకా వరసైనవాళ్లు ఎంతో సంతోషిస్తారు. వారుకూడా మనతో మాటకలుపుతారు. మనసు విప్పుతారు. ఎప్పటెప్పటి కబుర్లో వస్తాయి. అవి ముచ్చట్లు అవుతాయి. నిజంగా బావుంటాయి. ప్రయత్నించిచూడండి.

– సంపాదకుడు

## అపభ్రంశాలు

- టాంక్‌బండ్‌లోకి దూకి యువతి ఆత్మహత్య – బండ్ అంటే గట్టు. బండ్ మీంచి దూకి లేదా హుసేన్ సాగర్‌లో దూకి అని కదా వుండాలి. మనకు టాంక్‌బండ్ అనగానే పెద్ద తటాకం మనసులో మెదుల్తుంది. దాని కారణంగా యీ పొరబాటు జరుగుతుంది.
- 'హత్య చేసి ఆగంతకుడు పరారీ' అని శీర్షికలు వస్తుంటాయి. ఆగంతకుడంటే అనుకోకుండా వచ్చినవాడని అర్థం. కొందరు ఆ మాటని దోషి, నేరస్తుడు, దుండగుడు అనే భావం స్ఫురించేలా వాడుతున్నారు. పరిచయంలేని, తెలియని పాత్ర పేరు ఆగంతకుడు, 'అగంతకుడు' కాదు.
- సర్వసాధారణంగా వచ్చేవి – ఆసుపత్రి వర్గాలు వెల్లడించాయి. అధికార వర్గాలు చెప్పాయి. ఇక్కడ వర్గాలు అంటే కొంతమంది, సమూహం అనే కదా అర్థం. ప్రాణంలేనివాటికి వాడినట్టు, రాయి రప్పా చెట్టు చేమా అయినట్టు వెల్లడించాయి, చెప్పాయి అనకూడదు. చెప్పారు, తెలిపారు అనడం సమంజసం.
- ఆత్మహత్య చేసుకుని మరణించాడు అనే వాక్యం చాలా అసంబద్ధంగా వుంటుంది. ఆత్మహత్యలో మరణించడం వుంది. విషం తాగి మరణించాడనో, ఉరివేసుకు మరణించాడనో ఆత్మహత్యకు దారిని సూచించవచ్చు.
- బస్సు కింద పడిన యువకుడు ఆసుపత్రిలో చికిత్సపొందుతూ మరణించాడు – మరణానికి చికిత్స కారణం కాదు. బస్సు కింద పడడం కారణం. తెలిసి రాయడం బాగుంటుంది.







## కూరా గాయా

కూరగాయల మంచీ చెడూ మాట్లాడుకోవడానికి ఒక ప్రత్యేక పరిభాష వుంది. వంకాయలు నవనవలాడుతున్నాయి. ఎండకి మగ్గిపోయేట్టున్నాయంటాడు అమ్మకందారు. కసరుగా వున్నాయి, గిజరు కాయలు అంటుంది ఇల్లాలు. ముదురు బెండలు, పండు దొండలు, చేదు దోసలు ఎందుకూ చెల్లవు. 'సొరకాయ లేత దవ్వ, తీగెన కోసిన పీప తల్లీ' అంటాడు అమ్మకందారు. గోటితో నొక్కి చూస్తుంటే – అమ్మా గిల్లకండి, ఏడుస్తుంది అంటాడు. కందకి దురద చెడు పేరు తెస్తుంది. కందకి లేని దురద కత్తిపీటకెందుకని సామెత. చచ్చు ఉల్లిపాయకి మర్యాద వుండదు. కూరగాయల బేరం చేసే తల్లులను గమనిస్తే ఎన్నెన్ని మంచి మాటలు వినిపిస్తాయో! అందుకే జాను తెలుగులో కథలు చెప్పిన శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి తన భాషా సంపదంతా అమ్మలక్కలు పెట్టిన భిక్షే అని చెప్పుకున్నారు. హెచ్చులు మాట్లాడినా బడాయిలు చెప్పినా 'సొర కాయలు కోస్తున్నాడు' అంటారు. కొన్ని ప్రాంతాల్లో యిది ఆనపకాయ.

కోయకుమీ సొరకాయలు
వ్రాయకుమీ నవలలని అవాకు చెవాకుల్
దాయకుమీ అరవ ఫిలిం
చేయకుమీ చేబదుళ్లు సిరిసిముప్పా – అన్నారు శ్రీశ్రీ

## తెలుగు ముత్యాలు

- మన్నికైన చీరని కట్టోర్చిన చీర అంటారు. వెలవకుండా, కట్టిన కొద్దీ సహించగల ఓర్పుగలదని అర్థం.
- కొన్ని ప్రాంతాల్లో నెయ్యిని 'మెరుపు' అంటారు.

## ఉపమాలంకారం

సుబోధకంగా చెప్పడానికి సంగతిని కళ్లకు కట్టడానికి అనువైన ప్రక్రియ ఉపమ. ఒక ప్రసిద్ధమైన దానితో చెప్పదలచిన దానిని పోల్చిచూపడం. ఉపమాలంకారం కాళిదాసు సొత్తు. కాని, మన తెలుగునాట అమ్మలక్కలు కాళిదాసుకి మించిన నేర్పరులు.

అటుకులు చింతాకుల్లా సాగాయి.
అవి పేలాలు కావు, బొండు మల్లెలు.
ఆడపిల్లలు గోక్కాడల్లా యిట్టే ఎదుగుతారు.
పాలు చిక్కగా బొట్టు పెట్టుకునేట్టున్నాయి.
ఆవిడ పూచిన తంగేడులా వుండేది.
అమ్మో! ఆవిడొక గచ్చపొద.
నేత చిక్కగా వుంది, చీరెలో నీళ్లు మూట కట్టవచ్చు.
ఇలాంటి పదసంపదను కూర్చిన తల్లులకు వందనం.

## మాట మీద మాట




మన భాషలో మాట మీద మాట సులువుగా వస్తుంది. దానికి తగిన సరదా ప్రక్రియలు కూడా వున్నాయి. పొడుపు కథల లాగానే యివి కూడా–

కోడి గాని కోడి పకోడి; కారు గాని కారు పుకారు; పట్కారు; కారం గాని కారం మమకారం, చమత్కారం, అహంకారం, సహకారం, ఆకారం, వికారం – యిలా కారం వున్న పదాలన్నింటినీ చెప్పుకోవచ్చు. రాజు, తరాజు, పోతరాజు, కపోతరాజు – యీ పదాలు కేవలం ఒక్క అక్షరం చేర్పుతో కొత్తపదాలు అయినాయి.

'కొమ్ము' అనే మాట మీద అనేక ముచ్చట్లు వస్తాయి. దుప్పికొమ్ము, ఎద్దుకొమ్ము లాంటి కొమ్ములు వున్నాయి. అక్షరాలకు మనం కొమ్ములు పెడతాం. దాని ధ్వనిని మార్చేస్తాం. 'కొమ్మ'లో మకి కొమ్ము పెడితే 'కొమ్ము' అవుతుంది. 'కోడికి కొమ్ములు లేవు గాని గుఱ్ఱానికి ఒక కొమ్మువుంది' అంటుంటారు చమత్కారంగా. మరో కొమ్ము వస కొమ్ము. చిన్నప్పుడు వసకొమ్ము అరగలేని పిల్లకు పోస్తారు. మాటలు చురుకుగా వస్తాయంటారు. గడగడా మాట్లాడే వారిని 'వసపిట్ట' అంటారు. ఇది 'చాటర్ బాక్స్'కి చక్కని తెలుగు మాట. మరో కొమ్ము శొంఠికొమ్ము. 'శొంఠిలేని కషాయమా' అని సామెత. ఒక పొడుపు కథలో 'ఒంకర టింకర శొ' అని వస్తుంది. శొ అంటే శొంఠి. ఇంకోటి పుసుపు కొమ్ము. కొమ్ముని అంటుకు వుండే అనకొమ్ముల్ని 'చిల్లలు' అంటారు. చిలవలు పలవలు అంటే వ్యాప్తి అని అర్థం. కొండ కొసని కొండకొమ్ము అంటారు.

కొమ్ము బూరా ఒక వాద్యం 'ఏం కొమ్ములు మొలిచాయా' అంటే పొగరెక్కిందా అని అర్థం. అంతేకాదు, 'కొమ్ము మిఠాయి' అని ఒక తీపి వంటకం వుంది. పూసలుగా వుండేది పూస మిఠాయి అయితే, పొడుగ్గా కొమ్ములుగా వుండేది కొమ్ము మిఠాయి.

ముందొచ్చిన చెవుల కంటే వెనకొచ్చిన కొమ్ములు వాడని అనుకోకపోతే కొమ్ము మీద ఎన్ని కబుర్లైనా చెప్పుకోవచ్చు.

ఇది కూడా కారణం?

దేశీయ భాషా పదాలు మరుగున పడడానికి వెల్లువగా వచ్చిన ఆధునిక సౌకర్యాలు కూడా ఒక కారణం. పూర్వ ప్రయాణ సౌకర్యాలు లేవు. కాశీదాకా కాలినడకన వెళ్లే వారు. నడకకి నిచ్చెన వెయ్యడమంటే కథ చెప్పడమని అర్థం. కాశీ మజిలీ కథలు అలాగే వచ్చాయి. నడక శ్రమ తెలియకుండా వుండేందుకు పొడుపు కథలు పుట్టాయి. అప్పుడు బృందాలుగా నడిచి వెళ్తుం దేవారు. మార్గ మధ్యంలో అనేక ప్రాంతాలవారు కలిసేవారు. ఎన్నో వింతలు విశేషాలు యాసలు పరస్పరం కలిసేవి. ఆ నడకలు పోయాయి. దాంతో కబుర్లు కథలూ తగ్గిపోయాయి. ఆ రోజుల్లో యిలాంటి యాత్రలకు వెళ్లేవారు తమ బృందంలో మంచి చమత్కారులను, మాటకారులని, ధైర్యవంతుల్ని, జానపద కళాకారులని చేర్చుకునేవారట. నెలల తరబడి సాగే యాత్రలో వారే ఆటవిడుపు.

### పొడుపు – విడుపు

పొడుపు :

చిన తాంబాళం – పెద తాంబాళం

నూకల బువ్వ – నూనె ధార



విడుపు :
భూమి– ఆకాశం
చుక్కలు – వర్షం

(ఇట్లాంటి పొడుపు కథల్ని విప్పడం కష్టం. ప్రకృతిని జానపదులు రకరకాలుగా, ఎంతో ఇష్టంగా ఎలా వూహించుకుంటారో చెప్పడానికి యిదొక వుదాహరణ)

– శ్రీరమణ

### మనవి

మన తెలుగు మాటల్ని రకరకాలుగా తలచుకుంటున్న యీ శీర్షికను ఆదరించండి. ఇందులో పాలుపంచుకోండి. మీరు విన్న మాటల్ని నలుగురితో పంచుకోండి. ఇంతకు మించిన మాతృసేవ లేదు.

– సంపాదకులు
ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక

# ఏకత్వ భిన్నత్వం గంగమ్మ బహుముఖం!




పేరూరు గ్రామంలో ఉండే పేరూరమ్మకు, శేషాచలపతికి ఏడుగురు కొడుకులు. వాళ్ళు పెద్ద ఓబులన్న, చిన్న ఓబులన్న, మద్ది లేటన్న, పెంచల నరసింహ, కదిరి నరసింహ, గోవిందరాజు, వేంకటేశ్వరుడు. అన్నలు ఆరుమందికి తగిన చోటు దొరుకుతుంది. అందరికన్న చిన్నవాడైన వేంకటేశ్వరుడు తాను నివసించటానికి తగిన స్థలం వెతుక్కోవటానికి తల్లి పేరూరమ్మ దగ్గర సెలవు తీసుకొని బయలుదేరుతాడు. ఎంత వెతికినా తగిన స్థలం దొరకలేదు. అలా వెదుక్కొంటూ తిరుపతిలోని మూడు గుంటల (తాతయ్య గుంట) గంగమ్మ దగ్గరకొచ్చి తనకు తగిన స్థలం ఎక్కడుందో చెప్పమంటాడు. తనకు తగిన చోటు చూపిస్తే గంగమ్మకు సంవత్సరానికి ఒకసారి జాతర జరిపించి, దున్నపోతుల్ని, కుంభాల్ని ఆహారంగా సమర్పిస్తానని చెప్తాడు. అప్పుడు గంగమ్మ ఏడుకొండలమీద గట్టి చోటు చూపించిందట.

ఏడుకొండల పరిసరాల్లో తరతరాలుగా ప్రచారంలో ఉన్న కథ ఇది.

భృగు మహర్షి కోపమూ, అలిగి వెళ్ళిపోయిన మహాలక్ష్మిని వెతుక్కొంటూ విష్ణువు భూలోకాన కొండమీదకొచ్చి పుట్టలో ఉండటమూ, వకుళాదేవికి కొడుకు కావడం, ఆకాశరాజుకి అల్లుడుకావడం... పద్మావతి సమేత శ్రీనివాసుడై తిరుమల కొండమీద తిష్టవేయడం - ఇది కదా ప్రచారంలో కథ!

ఈ మెలిక అర్థం కావడమే సంస్కృతి. సత్యం- ఒక మొండి రాయిలా ఏకశిలాసదృశ్యమై ఉండదనీ, సత్యం బహుముఖమైనదన్న మన తూర్పుదేశాల సంస్కృతి సారాన్ని, ఆ బహుముఖీన భారతీయ సంస్కృతి సందేశాన్ని ఎలుగెత్తుతాయి జనశ్రుతిలో ఉన్న ఇటువంటి వేనవేల కథలు.

కలియుగ ప్రత్యక్షదైవమైన ఆ ఏడుకొండల వాడికే దిశానిర్దేశం చేసిన అమ్మలగన్నయమ్మ- మూడు గుంటల (తాతయ్య గుంట) గంగమ్మ. వెంకన్న మాటిచ్చినట్టు ఏటేటా ఏడురోజుల పాటు జరిగే గంగమ్మ జాతర ఈ ఏడాది కూడా అట్టహాసంగా, గొప్ప వేడుకగా జరిగింది.

### గంగమ్మ కథ:

తిరుపతిని పాలెగాళ్లు పాలించే రోజుల్లో ఆ వంశంలోని ఒక పాలెగాడు పరమ నీచుడు. ఆ రాజ్యంలోని అందమైన యువతులను చెరిచేవాడు. నవవధువుల్ని చెరబట్టేవాడు. అలాంటి రోజుల్లో స్త్రీ జాతిని రక్షించేందుకు తిరుపతికి 2 కి.మీ దూరంలోని అవిలాల గ్రామంలో కైకాల కులంలో గంగమ్మ జన్మించింది. యుక్తవయసుకొచ్చిన గంగమ్మపై యథావిధిగా పాలెగాడి కన్నుపడి ఆమెను









బలాత్కరించబోయాడట. దీంతో గంగమ్మ తన విశ్వరూపాన్ని ప్రదర్శించిందట. దాంతో పాలెగాడు పారిపోయి దాక్కున్నాడట. అలా దాక్కున్న పాలెగాడ్ని బయటకు రప్పించేందుకు గంగమ్మ తల్లి వేరువేరు వేషాలను దరించిదట. అలా గంగమ్మ అనేక వేషాలు ధరించి మూడు రోజులపాటు గాలించిందట. అయినా పాలెగాడు దొరకలేదు. నాలుగోరోజు గంగమ్మ దొరవేషం వేసిందట. దీంతో తన ప్రభువైన దొర వచ్చాడనుకుని పాలెగాడు బయటకు రాగానే వాడి తల నరికి సంహరించిందట. భక్తుల బహురూప వేషధారణ ఆచారానికి అదీ కారణం.

ఇంకా గంగమ్మ కొలుపుల ఆనుపానుల మీద అధ్యయనవేత్తలు రేపే ప్రశ్నలన్నింటికీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ప్రొఫెసర్‌గా పనిజేస్తున్న డా. పేట శ్రీనివాసులు రెడ్డి (పేటశ్రీ) దగ్గర జవాబులు వెదుక్కోవచ్చు.

❖

## నారికేళపాకం

వేదవ్యాసకృత మహాభారతం పంచమ వేదసారం. భక్తి- ఆధ్యాత్మిక- నైతిక భావ ప్రభోదాల కాసారం. కవిత్రయ భారతం రమణీయ రత్న వారాశి. అయితే, వీటి సారాన్ని అర్థం చేసుకోగల సమర్థత, ఓపిక, తీరిక ఆధునిక పాఠకులకీ లేవు. అందువల్ల వ్యాసభారతంలో ఉన్న అమూల్యమైన విషయాలు తెలుసుకోవాలంటే వచన అనువాదాల అవసరం ఎంతైనా ఉంది. గతంలో పురిపండా అప్పలస్వామి, పిలక గణపతి శాస్త్రి, ఉషశ్రీ వంటివారి వచన మహాభారతానువాదాలెంతో ప్రసిద్ధిపొందాయి. ఆ పరంపరలో తనదైన శైలిలో వచనానువాదానికి పూనుకున్నారు యం.వి. నరసింహారెడ్డి. వ్యాసభారతం 18 పర్వాలని మూలానుసారంగా రెండు సంపుటాల్లో అనువాదం చేశారాయన. ఆదిపర్వం నుంచి భీష్మ పర్వం వరకూ ఆరు పర్వాలు మొదటి సంపుటి కాగా, మిగతా పర్వాలు రెండవ సంపుటిగా వేశారు. వైదిక ఆర్ష సంస్కృతి పట్ల అపారమైన అభినివేశం, అనువాద ప్రతిభ ఉన్న నరసింహారెడ్డి ఈ గ్రంథాన్ని కృతకమైన గ్రాంధిక భాషలో కాకుండా సరళమైన శిష్ట వ్యవహారంలో రాసినట్లయితే పాఠకులకు ఉపయోగకరంగా ఉండేది. తులనాత్మక విశ్లేషణ లేకపోవడం వల్ల పండితుల మెప్పు పొందదనిపిస్తోంది.

**డా. పి.వి. సుబ్బారావు.**




వేదవ్యాసకృత మహాభారతం తెలుగు వచనానువాదం రెండో భాగం వెల రూ 350, పేజీలు 336 ప్రతులకు: సాహిత్య నికేతన్, 3-4- 852, కేశవనిలయం, బర్కత్ పుర, హైదరాబాద్ 500 027

---

## మౌలిక పాఠానికి విపుల వ్యాఖ్య




అంబేద్కర్ వర్ణ నిర్మూలన
సౌదాఅరుణ
పేజీలు 718, వెల రూ 1499
ప్రతులకు: దస్త్ర థియేటర్, బి 74, కేంద్రీయ విహార్ ఫేజ్- 2, గచ్చిబౌలీ, హైదరాబాద్- 500 032

ఒక గొప్ప చారిత్రక, సమకాలిక విలువగల రచనను అర్థం చేసుకోవడం ఎలా? ఆ రచన సామాజిక ఆర్థిక రాజకీయ సమూల, సానుకూల, పరివర్తనకు సంబంధించిన మౌలిక ప్రతిపాదన చేసేదైతే, ఆ సమూల పరివర్తన తమ దీర్ఘకాల పీడిత జీవితాలకు విముక్తి మార్గం అని తెలుసుకోవల్సిన ప్రజలు ఆ రచనను ఎట్లా అర్థం చేసుకోవాలి? అనే రెండు ప్రశ్నలు పునాదిగా, ఇంగ్లీష్ లో భారత సామాజిక విప్లవ ప్రవక్తల్లో ధ్రువతార వంటి బాబాసాహెబ్ అంబేద్కర్ రాసిన 'అన్నిహిలేషన్ ఆఫ్ కాస్ట్'ను తెలుగులో అనువదించి దానితో పాటు ఇంగ్లీష్ పాఠాన్ని, దానికి 'అంబేద్కర్ వర్ణనిర్మూలన' లేక 'ఫిలాసఫీ ఆఫ్ కాస్ట్ డెమోక్రసీ' అన్న విపుల వ్యాఖ్య, వివరణలను సౌద అరుణలు అందించారు . పీడన నుండి విమోచనను సూచించే రచనా పాఠాన్ని పెద్ద మార్పు చేకుండానే ఆ రచనా పాఠం చెప్పే అసలు విషయాన్ని మరుగుపరిచే మాయను బద్దలుకోట్టేందుకు ఈ 90 పేజీల ఇంగ్లీష్ పుస్తకానికీ దాని 250 పేజీల వివరణతో కూడిన అనువాదానికి 350 పేజీల విపుల వ్యాఖ్యానం అవసరం ఏర్పడింది అని వ్యాఖ్యాతలు చెప్పడం పుస్తకం చదివిన తరువాత అబద్ధం ఏమీ కాదనిపిస్తుంది.

గతానుగతికంగా బాబా సాహెబ్ అంబేద్కర్ ప్రధాన రచన 'కుల నిర్మూలన' అనే పేరిట ప్రచారం లోకి రావడానికి గల కారణాలతో మొదలుపెట్టి, నిజానికి ఈ పుస్తకం భారత దేశంలోని వర్ణ (బ్రాహ్మణ ,క్షత్రియ ,వైశ్య ) -జాతి (శూద్ర ,దళిత ,ఆదివాసి,ఇతరులు) అనే ప్రధాన వైరుధ్యాన్ని నిర్మూలించే ఉద్దేశ్యంతో రచించబడింది అని వ్యాఖ్యాతలు ప్రతిపాదిస్తున్నారు. దానికి సమర్థనగా బాబాసాహెబ్ 1937లో 'అన్నిహిలేషన్ ఆఫ్ కాస్ట్' అన్న పదబంధంలో 'కాస్ట్' అన్న మాట కేవలం మూడు ఆధిపత్య వర్ణాలకు సంబంధించనదేనని నిగ్గ తేల్చారు వ్యాఖ్యాతలు. అందుకే తమ అనువాదానికి 'అంబేద్కర్ వర్ణనిర్మూలన' అన్న పేరు పెట్టామని వివరించారు. వర్ణ ఆధిపత్యమూ జాతుల నిమ్నత్వమూ నిర్మూలించే బడే వర్ణ జాతి రహిత ప్రజాస్వామ్యమే కాస్ట్ డెమోక్రసీ, అని వివరించారు. ఈ దేశంలోని వర్ణ -జాతి అనే మౌలిక వైరుధ్యాన్ని మార్క్స్ తన కాపిటల్ మొదటి సంపుటంలోనూ, మహాత్మా జ్యోతిబా పూలే తన గులాంగిరీ లోనూ, అంబేద్కర్ వర్ణ నిర్మూలనలోనూ గుర్తించారని వ్యాఖ్యాతలు వివరించారు .అయితే ఆధిపత్య శక్తులు మార్క్స్ ఈ విషమే చెప్పలేదనీ, పూలే గురించి పెద్దగా తెలియనీయకుండానూ, అంబేద్కర్ ఆచరణ సులభ సాధ్యం కాని కుల నిర్మూలనవాదం గురించి రాసాడనీ తప్పుడు ప్రచారానికి దిగారని అంటారు ఈ విపుల వ్యాఖ్యలో. కమ్యూనిస్టులని చెప్పుకునే వారూ ఈ ప్రచారంలో ఉండటంతో అసలు ఈదేశంలో కమ్యూనిస్టు పార్టీ పుట్టలేదని సంచలన నిశ్చయాత్మక ప్రకటన చేసారు వ్యాఖ్యాతలు.

1914 గాంధీ భారత రాజకీయ రంగప్రవేశమూ దాని వెనుక గల చారిత్రక కారణాలనూ, మొదటి ప్రపంచ యుద్ధం తరువాత జాత్ పాత్ తోడక్ మండల్ రూపకల్పన దాని వెనుక గల సామాజిక ఆర్థిక కారణాలను వెలికితీసి చర్చించారు వ్యాఖ్యాతలు. ఈ మండల్ తనకు ఇంగ్లీషు పేరు పెట్టుకోక పోవడానికి కారణం కూడా కాస్ట్ అన్న మాటకు మూడు ఆధిపత్య వర్ణాలు అన్న అర్థం ఉండడమే అని వివరించారు. ఆర్య సామాజికులతో ప్రారంభించబడిన ఈ సంస్థకు ఉన్న అజెండా అంతా వాస్తవానికి పారిశ్రామిక ఉత్పత్తికి ప్రధానంగా పనికి వచ్చే జాతుల వారి మధ్య అంతరాలు లేని పారిశ్రామిక కార్మిక నైతికత, క్రమశిక్షణలను పెంచి వారిని ఆధునిక వస్తూత్పత్తికి అరమరికలు లేని పనివాళ్ళుగా చేయడమేనని అంబేద్కర్ అర్థం చేసుకొని, ఈ సంస్థ వారు మాట్లాడే కులాంతర భోజనాలు, కులాంతర వివాహాల వల్ల వర్ణ-జాతి వైరుధ్యం అంతం కాదనీ, అది జరగాలంటే వర్ణ హిందువులు పవిత్రంగా భావించే శ్రుతి, స్మృతి, పురాణ ఆధిపత్యాన్ని నిరాకరించడమే అని నిగ్గుతేల్చిన విషయాన్ని వ్యాఖ్యాతలు ఎత్తిచూపారు.

1919 నుండి 1934 వరకూ బాబాసాహెబ్ జాతి జనులలో కోసం పడ్డ శ్రమను, జనాభా దామాషాకు అనుగుణంగా ప్రత్యేక నియోజక వర్గాలను కోరడం, సాధించడం, పూనా ఒప్పందం ద్వారా కోల్పోవడం, అన్న కీలక అనుభవాలలో తపించి వర్ణ నిర్మూలన రచన చేసాడని తెలిపారు ఈ వ్యాఖ్యాన అనువాద గ్రంథంలో. గాంధీ ఈ మొత్తం కాలంలో అగ్రవర్ణ ప్రతినిధిగా ప్రవర్తించిన తీరును వస్తుగత ఉపనిషత్తులతో వివరించారు వ్యాఖ్యాతలు. ఒక మనిషికి ఒక వోటు ఉండే ప్రస్తుత స్థితిలో వర్ణ–జాతి రహిత ప్రజాస్వామ్యాన్ని నిర్మించాలంటే 'పెర్ఫెక్ట్ యినీక్వాలిటీ నుండి పెర్ఫెక్ట్ ఈక్వాలిటీ' వైపు పరవర్తన చెందేలా ఉద్యమించడమే బహుజన కాస్ట్ డెమొక్రాట్ల కర్తవ్యమని వ్యాఖ్యాతల వివరణ. వర్ణ జాతి నిర్మూలన అనే సమస్యతో తలపడాలనుకునే వారూ జాగ్రత్తగా చదవాల్సిన, అతి వాదాలనూ అవేశాలనూ అదుపులో ఉంచుకున్న, వివరణాత్మక వ్యాఖ్యానువాదం ఈ పుస్తకం .

–హెచ్.వాగీశన్

## అరిటాకు దొప్పలో వదిలిన పద్యం

అసలు ఏ పరిచయాలు, మాటలు లేకుండా హాయిగా పుస్తకం టైటిల్ స్వాతి పేరుతో డైరెక్ట్ గా తన కవిత్వానికి తీసుకెళ్లడం బాగుంది . 'నదిలోని నీరు'తో మొదలైంది అతను వెళ్ళడం లోని బాధ లోతును సుతిమెత్తని రంపంతో కోసుకుంటున్న చప్పుడు చేస్తూ, 'అరిటాకు దొప్పలో పద్యం' వదిలేసినంత అందంగా మలిచింది. 'ఊపిరి పాటకు చూపేది' ఈ కవిత చదువుతుంటే క్లాసికల్ మనసు తడైపోతుంది. 'మురళితో పాటు మహాబలి పురాన్నే సంచిలో పెట్టుకు వచ్చాడా.... రహస్యం స్వామి! నాకు ఇక్కడే దర్శన మవుతుంది' అంటూ ఒక్క పదంతో ఘాఢతలో చుట్టేసింది. 'గాలి మళ్ళింది' చాల హృద్యంగా మళ్ళీ తిరిగి చదివించేంత సెన్సిబుల్‌గా ఉంది.




ఆవిరి (ఆన్ లైన్ కవిత్వం)
స్వాతికుమారి బండ్లమూడి, పేజీలు 40
ఈ కవితా సంకలనం ఈ లింక్ లో ఉచితంగా దొరుకుతుంది:
http://kinige.com/ksearch.php?searchfor=aviri

'భ్రష్ట యోగి'లో తన వ్యక్తీకరణ, లోతైన తన చూపుకు ఆశ్చర్యపడకుండా ఉండలేము. కాంటెంపరరీ పోయెట్రీ భావానికి, లాజిక్ తోడైనప్పుడు 'అబ్బ నిజమేకదా' అనిపిస్తుంది చదివే వాళ్ళకి– 'ముందుమాట', 'వదల్లేక–వదల్లేక' వంటి కవితలు చదివినప్పుడు.

ప్రతిపనిలో అందాన్నో, అద్దాన్నో పెట్టుకొని పనిచేస్తే, నువ్వందరిలా కాక ఎంతో ప్రత్యేకమనిపిస్తుంది, అలాంటిదే 'ఆవిరి'. 'అతనంతే మల్లెలు లేనప్పుడు మంచుమొగ్గలోయి అని అరుస్తాడు' ఇలాంటి మాటలు మనల్ని ఎక్కడో తాకి వదిలేస్తాయి.

'అనుకోకుండా' గురించి రాయకుండా ఆవిరి పూర్తవ్వదు. నడుస్తున్న ప్రతి తోవా నడుస్తున్నట్లు, తాకిన ప్రతి వస్తువు తెలిసినట్లు, ప్రతిచోట ప్రశ్నార్ధకంతో నిలిచే సమాధానాలు, అంతర్ముఖంగా, ప్రాప్తంగా దక్కిన మనసుల కలబోతలో అంతర్లీన దుఃఖ్ఖాన్ని అద్భుతంగా ఆవిష్కరించిన ఒరిజినల్ ఫీల్ ఉన్న ఆన్ లైన్ పుస్తకం.

– శ్రీసుధ మొదుగు (కింగ్‌స్టన్, జమైక)

# స్వీకారం




**కళ్యాణపురం**
యానాం కథలు– 2
దాట్ల దేవదానం రాజు
**వెల:** రూ 100
**పేజీలు:** 160
**ప్రతులకు:**
రచయిత,
8–1–048, ఉదయిని,
జక్రియ నగర్,
యానాం– 533 464
విశాలాంధ్ర, నవోదయ,
పాలపిట్ట పుస్తక
కేంద్రాలు




**అనామిక డైరి (నవల)**
సలీం
**వెల:** 150
**పేజీలు:** 208
**ప్రతులకు:**
ఫ్లాట్ 306, జె.బి.
అపార్టుమెంట్,
దోమలగూడ,
హైదరాబాద్
విశాలాంధ్ర,
నవోదయ, ప్రజాశక్తి
పుస్తక కేంద్రాలు




**ఏం లేదు**
నాయుని కృష్ణమూర్తి
కథలు
**వెల:** రూ 100
**పేజీలు:** 158
**ప్రతులకు:**
రచయిత,
వి ఎన్ ఆర్ బుక్ వరల్డ్,
చౌడేపల్లి– 517 257
చిత్తూరు జిల్లా

**అడుగుజాడలు**
వ్యాససంకలనం
వేదార్థం మధుసూదన
శర్మ
**ప్రతులకు:**
వి. పద్మావతి,
5–135/చ్, ఎన్మెనబెట్ల,
కొల్లాపూర్ మండలం,
మహబూబ్ నగర్ జిల్లా
పిన్ కోడ్ 509 102
అన్ని పుస్తక
కేంద్రాలలో...

# వండర్ బోయ్ పిలకా!

హొరని గాలి దుమారము లెగిరన్
భోరని ధారావర్షము కురిసెన్
వీధులలో ఎవరో! ఆ నీడలు
ఆకలితో ఏవేవో ఘోషలు!!
అమ్మా! మాదాకబళం తల్లీ!
అమ్మా! పిల్లల మన్నం తల్లీ!

ఈ ఆకలి కవిత్వం ఎవరిదో చటుక్కున చాలా మంది పోల్చుకోలేరు. 1950లలో పండిత కవి పిలకా గణపతిశాస్త్రి రాసిన గేయం. ఆ రోజుల్లో శ్రీశ్రీ ప్రభావం కృష్ణశాస్త్రినే లొంగదీసింది యిక యాయనెంత!

గణపతి శాస్త్రి 1911లో పశ్చిమ గోదావరి జిల్లా కట్టుంగలో పుట్టారు. విజయనగరం మహరాజ కళాశాలలో 'విద్యా ప్రవీణ' సాధించి రాజమండ్రి వైశ్యసేవా సదనంలో కొంతకాలం అధ్యాపక వృత్తిలో గడిపారు. గణపతి శాస్త్రి సహజంగా బిడియస్తుడు. దానికి తోడు పాఠాలు చెప్పడం కొత్త. తరగతిలో కాళిదాసు శాకుంతలం చెబుతుంటే ఒక విద్యార్థిని తెగ నవ్వుతూ వుండేదిట. ఆయనకు యిబ్బందిగా వున్నా ఏమనడమో తోచక అలాగే భరించేవారు. ఆ విద్యార్థిని ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ. ఆమె మధురకవి నాళం కృష్ణారావు కుమార్తె. ఆ బాలిక తరువాత ప్రముఖ రచయిత్రి అయింది. గణపతి శాస్త్రి ఆమె తండ్రిగారిని కలిసినప్పుడు 'మీ అమ్మాయి నవ్వు నుంచి నేను కాళిదాసు కవిత్వంలోకి అందచందాలను, విలువలను, లోతుపాతులను తెలుసుకోగలిగాను. మనసులో మీ అమ్మాయిని దీవిస్తూ వుంటాను' అని చెప్పారట. లక్ష్మీకాంతమ్మ ఆమె జీవిత చరిత్రలో యీ సంఘటన గుర్తు చేసుకున్నారు. ఆయన చాలా మృదుస్వభావి. హాస్య ప్రియులు. 'నా వయసు 39 వెళ్లింది గాని 40 రాలేదు' అని నాలుగేళ్లు చెప్పుకున్నారని నాటి మద్రాస్ సహపాటీలు చెబుతుంటారు.

1946లో ప్రారంభమైన 'ఆంధ్ర శిల్పి' సచిత్ర మాస పత్రికలో పనిచేయడానికి టంగుటూరి ప్రకాశం ఆదేశం మేరకు మద్రాసు చేరారు. ఆంధ్రపత్రిక, భారతిలకు పనిచేశారు. ప్రమద్వర, రత్నోపహారం, విభ్రాంతామరుకం ప్రసిద్ధ ఖండకృతులు. ఆయన వచనంలో మహాభారతం, హరివంశం, భాగవతం, పద్మపురాణం, ప్రాచీన గాథలహరి చాలా పేరు తెచ్చుకున్నాయి. శరత్‌బాబు బెంగాలి మాతృకను 'గృహదహనం' పేరిట తెలుగు చేశారు.

ఆ రోజుల్లో, మద్రాసు మౌంట్ రోడ్ వెనుకవున్న 'గులాం ముర్తూజా' వీధిలో శాస్త్రి, నందూరి రామోహనరావు పక్కపక్క వాటాలలో వుండేవారు. ఇద్దరికీ వున్న కామన్ వరండాలో నిత్యం సాహిత్య గోష్ఠులు జరిగేవని నందూరి చెబుతుండేవారు. గణపతి శాస్త్రి ప్రతి అల్పవిషయానికి ఎక్కువగా ఆశ్చర్యపడేవారు. అందుకని ఆయనకు 'వండర్ బాయ్' అని నిక్‌నేమ్ వుండేది. 1978లో విజయవాడ ఆంధ్రజ్యోతి ఆఫీస్‌కి నందూరిని చూడాడానికి వచ్చారు. అప్పుడు నేను అక్కడ పనిచేస్తున్నాను. గణపతి శాస్త్రిగారిని పరిచయం చేసి, అప్పుడే కొత్తగా వచ్చిన ఆఫ్‌సెట్ వెబ్ ప్రింటింగ్ మిషన్‌ని దగ్గరుండి చూపించడని, నాకు పురమాయించారు. 'వరసగా రంగులు కొట్టుకుంటూ వెళ్లడం, చివరకు పేజీ మల్టీకలర్‌లో పడిపోవడం, అంతా క్షణంలో! ఆశ్చర్యం!' అంటూ శాస్త్రి అతిగా విస్తుపోతుంటే నాకు నవ్వాగలేదు ఎందుకంటే అప్పటికే రామ్మోహనరావు యీ వండర్ బోయ్ కథలు నాకెన్నో చెప్పివున్నారు. అందుకే శాస్త్రి నాలుక కొంచెం చురుకు. ఆకురాయిలా వాడి. అది ఆయన వృత్తి జీవితాన్ని దెబ్బ తీసిందని ఆయన సమకాలికులు చెప్పేవారు. సుప్రసిద్ధ చిత్రకారులు పిలకా నరసింహ మూర్తి వీరి సోదరులు.



పిలకా గణపతి శాస్త్రి

## గృహిణి

పిలకా గణపతి శాస్త్రి ఉద్దండ పండితులు. బహు భాషా వేత్త. ఆయన నవల 'విశాల నేత్రాలు' చాలా ప్రాచుర్యం పొందింది. ఆ నవల తరువాత 1964 ప్రాంతాలలో 'గృహిణి' అనే సాంఘిక నవల రాశారు. పౌరాణిక నాటకాలకి, అప్పుడప్పుడే వెలుగులు నింపుకుంటున్న సినిమా రంగానికి మధ్య యీ ఇతివృత్తం నడుస్తుంది. అంటే 1930 – 40 మధ్య కాలంలో జరిగిన కథ అనుకోవచ్చు.

పిలకా వారు రాసిన చాలా రోజుల తరువాత, అంటే 1967 ప్రాంతంలో ఆంధ్రప్రదేశ్ మాస పత్రికలో సుమారు మూడేళ్లపాటు ధారావాహికంగా వెలువడింది. ఆ తరువాత 1972 ఏప్రిల్ నెలలో ఎమెస్కో సంస్థ గృహిణిని రెండు సంపుటాలుగా ప్రచురించింది. ఒకనాటి ఆంధ్రప్రదేశ్ పత్రికలని తిరగేస్తే ఎందరో వైతాళికుల రచనలు, సంతకాలు కనిపిస్తాయి.

గణపతి శాస్త్రి సోషలిజం పర్వాలేదు గాని కమ్యూనిజం కష్టం, మనకు సరిపడదు అనేవారట. దేవులపల్లి కృష్ణశాస్త్రికి వీరాభిమాని. 'నఖశిఖ పర్యంతం కవి' అని ప్రస్తుతించేవారట. సంస్కృత సాహిత్యాన్ని శాస్త్రి కాచి వడపోశారు. తెలుగు సరే. ఆంగ్లం స్వయంగా నేర్చుకున్నారు. హిందీ, బెంగాలీలు వచ్చు. మార్సెల్లా హోర్డీ వద్ద ఫ్రెంచి భాషని నేర్చుకుని ఎమిల్‌జోలా, రోమారోలా రచనలు చదవడం సాధించారు. తన మీద తనే జోకులు వేసుకుంటూ, నవ్వుతూ నవ్విస్తూ వుండేవారని ముళ్లపూడి, నందూరి తలుచుకుంటూ ఆయన మాటలు చెప్పుకుంటూ వుండేవారు. 'పిలకా' అని ఇంటిపేరు మీకెలా వచ్చిందండీ అని అడిగితే ఓ కట్టుకథ చెప్పేవారు. ఓ సారి వాళ్ల పూర్వీకుడు ఒకాయన నూతి దగ్గర చేదతో తోడి నీళ్లు పోసుకుంటున్నాడట. కొన్ని చేదల తర్వాత ఒక చేదలో కప్పపిల్ల రాగా అది శిరసున పడి పిలక మీదుగా కిందికి జారిపోయిందిట. ఆయన భయపడి ఒక గెంతు గెంతాట్ట. ఈ పూర్వీకుడికి ఇద్దరు మగ పిల్లలు. దామాషా ప్రకారం ఒకరింటిపేరు పిలకావారు, ఇంకోరి పేరు కప్పగంతులవారు అయిందట.

తెలుగు సాహిత్యాన్ని ఒక మహా యజ్ఞంగా, గొప్ప సేద్యంగా సాగించిన వారిలో పిలకా గణపతి శాస్త్రి ఎన్నతగినవారు.

నీతి సమిధలు కాల్చి, నీ వలపు చలివేళ
నెచ్చెలి రగిలించె వెచ్చ వెచ్చని కీల!
చలి కాచుకొన రమ్ము చెలి కౌగిలింతలో
వెలలేని పరువ మూర్పుల నెగిరె ధూళిలో

ఇటువంటి గీతాలు రాయడం అపరాధంకాని రోజుల్లో శాస్త్రి యిలాంటివి చాలా రాశారు.

❖

